అఘోర (ఆంధ్రజ్యోతి సీరియల్)

రచన :

కె. కిరణ్ కుమార్

మొదటి ముద్రణ :

ఫిబ్రవరి-1996

వెల : 45-00

కవర్ డిజైన్ :

N. V. రమణ

పబ్లిషర్స్ :

నవ్యాంధ్ర బుక్ హౌస్
లెనిన్ సెంటర్,
విజయవాడ-2

ముద్రణ :

డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2
ఫోన్: 434852



# అ ఘో ర

ఒక లిప్తపాటు అవతలి వ్యక్తి చెబుతున్నదేమిటో అర్థంకాక "ఏమిటీ..." అన్నాడు.

అవతలి వ్యక్తి అంతకు ముందు చెప్పిన విషయాన్నే రిపీట్ చేశాడు.



ఇవతల వ్యక్తి భృకుటి ముడిపడింది. టెలిఫోన్ పట్టుకున్న చెయ్యి బిగుసుకుంది.

"ఎస్... దెన్ వాట్?" సుడులు తిరుగుతున్న విసుగు కంఠంలో తొంగి చూసింది.

"మీ అమ్మాయి... పావని... విమెన్స్ కాలేజీలో బి.కామ్ ఫైనలియర్ చదువుతోంది..." అవతలి వ్యక్తి కంఠంలో అదే నమ్రత!

"ఇంతకీ నువ్వెవరు..."

"నా గురించి నువ్వు తెలుసుకోవలసింది ఆఖరి డైలాగు అవుతుంది. దానికి ముందు మరికొంచెం కథ ఉంది. జాగ్రత్తగా విను... ఈ రోజు మీ అమ్మాయి పసుపుపచ్చ లంగా, తెల్లని పమిట వేసుకుని కాలేజీకి బయల్దేరింది."

"ఇదంతా నాకెందుకు చెబుతున్నావ్" అతడి రక్తం ఉడికిపోతోంది.

"నీవు ఆ అమ్మాయి తండ్రివి కనుక....సరే అసలు విషయానికి వస్తున్నాను. మీ అమ్మాయి కాలేజీకి వెళ్ళలేదు"

"మరి"

"మా దగ్గర వుంది. మేము మీ అమ్మాయిని కిడ్నాప్ చేశాం"

"వాట్...."

టెలిఫోన్ రిసీవర్ పట్టుకున్న చేయి వణుకుతోంది. శరీరంలో ఒక్కసారిగా రక్తప్రసరణ హెచ్చింది.

అది సన్నటి జలదరింపు కాదు.... లక్ష ఓల్టుల షాక్!

మాట్లాడే దశ దాటిపోయింది. కళ్ళప్పగించి చూస్తున్నాడు.

సరిగ్గా అప్పుడే వచ్చింది ఆయన శ్రీమతి వంట ఇంట్లో నుంచి, పవిటకు చేయి తుడుచుకుంటూ. స్పృహ తప్పి తూలి పడిపోవటానికి సిద్ధంగా వున్న అతడ్ని ఒక్క అంగలో సమీపించింది. "ఏమండీ.... ఏమయిందీ...." అంటూ అతడ్ని, అతడి చేతిలోని టెలిఫోన్‌ని పట్టుకోటానికి ప్రయత్నించింది.

ప్రక్కనే వున్న సోఫాలో జారగిలబడ్డాడు గాని ఫోన్‌ని మాత్రం వదిలిపెట్టలేదు.

ఒక స్వేత బిందువు అతడి నుదుటి నుంచి నెమ్మదిగా క్రిందకు జారడం ప్రారంభించింది.

అతడ్ని ఆ సింకింగ్ ఫీలింగ్‌తో చూడగానే ఆమె కంగారు రెట్టింపయింది.

"ఏంటండీ....ఏమైంది. ఎవరిదా ఫోన్" బలవంతంగా అతడి చేతిలోని ఫోన్ లాక్కునే ప్రయత్నం చేస్తోంది.

తన కూతుర్ని.... డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతున్న కూతుర్ని కిడ్నాప్ చేశారు.

ఆ ఆలోచనని భరించలేకపోతున్నాడు.



అతడు ఓ రిటైర్డ్ ఎమ్మార్వో....

భయపడుతూ బ్రతకటానికి అలవాటు పడిన బడుగు అధికారి.

"చూడు మిస్టర్ సుబ్రహ్మణ్యం.... ఈ న్యూస్ వినగానే షాక్ అయినట్లున్నావ్.... ఫోను పెట్టేసి ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగు.... గుండెల నిండా గాలి పీల్చి ఓ నిమిషం పాటు బిగబట్టు. తర్వాత వదిలెయ్. నీకు ఆసనాలు వేసే అలవాటు వుందిగదా! నేను నీకు టెన్షన్ తగ్గించుకోవడమెలాగో చెప్పనవసరంలేదు. ఫోన్ పెట్టేసే ముందు ఓ మాట.... పెద్ద సీను క్రియేట్ చేయకు. ఈ విషయం నీకు, నీ భార్యకు మినహా మూడో వ్యక్తికి తెలియటానికి వీల్లేదు. 'తెలిస్తే ఏమిటి' అన్నది కార్యరూపంలో చూస్తావ్. తెలియనీయకపోతే నువ్వేం చేయాలన్నది నేను మళ్ళీ ఫోన్ చేసి చెప్తాను"



అవతల రిసీవర్ క్రెడిల్ చేసిన శబ్దం.

అతడి మొహంలో కనబడిన భయం, కళ్ళలోని బెదురు చూసి- "ఏం జరిగిందంటే చెప్పరేం" అని రెట్టిస్తోందా ఇల్లాలు.

ఓ వేపు ఫోనువాడు, రెండోవేపు భార్య—

ఏం చెప్పాలి?

అతడి మొహంలో రక్తం ఇంకిపోయింది.

కళ్ళు మూసుకుని ఉఛ్వాస నిశ్వాసల్ని క్రమబద్ధం చేయసాగాడు.

తనని తాను కంట్రోల్ చేసుకోటానికి అతడు చేస్తున్న ప్రయత్నాల్ని ఆమె గమనించింది.

తనని తానూ అదుపు చేసుకోటానికి ప్రయత్నించసాగింది.

గుండెకీ, గొంతుకి మధ్య కండరాన్ని చిట్లించే నరక యాతన ఆరంభమయింది.

* * * *

చెట్ల కొమ్మల మధ్యగా సూర్య కిరణాలు చొచ్చుకొస్తున్నాయి.

ఆకాశంలో సూర్యుడు పులి పంజాకి బలయినట్లు రక్తం కక్కుతున్నాడు.

ఎత్తయిన చెట్టు సంధ్యవారుస్తున్న మహర్షిలా వుంది.

ఇసుక నేలంతా చిత్తడిగా వుంది.

గాలి స్తంభించినట్లు ఉక్కగా వుంది.

నరాలను బ్లేడ్లతో కోస్తున్నట్లు ఒళ్ళంతా సూదులతో గుచ్చుతున్నట్లు....

కనుచూపు దూరంలో కాలుతున్న కాష్టాలు విరజిమ్ముతున్న పొగలు నీలి మేఘాలవలె అంబరాన్ని ఆక్రమించి సూర్య తాపాన్నుంచి ఆచ్ఛాదన ప్రసాదిస్తున్నాయి.

కాష్టం నుంచి వెలువడుతున్న కమురు కంపు గుప్పు గుప్పున గుబాళించి వాయు దేవునికే ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు ఆటంకం కలిగిస్తున్నది.

ఆ బీభత్స ప్రకృతి కాలభైరవుని కరాళ నృత్యవేదిక!

ఆ భైరవుని ఆలయ ప్రాంగణంలో—

విరులు తాల్చిన తరువు నీడన ఎగుడు దిగుడుగా పోసి వున్న గాజు పెంకులు, కొనదేలిన రాళ్ళమీద ఒక పండు ముసలి పడుకొని వున్నాడు.

బంగారం తాపడం చేసినట్టున్న మేను-

ఏకుల బుట్టలా జుత్తు-

కౌపీనం—

గుబురుగా, పొదవుగా పెరిగిన గడ్డం, శరీరాన్ని కప్పేస్తోంది, జడలుగా ప్రాకిన శిరోజాలు నేల మీద నాగుల్లా పరుచుకుని వున్నాయి.

ఎముకల పోగులా వున్నాడతడు.



పాలభాగాన భస్మం ధరించాడు. కౌసలమధ్య మణిపూస పొదివినట్టుంది.

శివలింగంపై పవిత్ర గంగ బొట్టు బొట్టుగా జారిపడినట్లు, గాజు పెంకులు, రాళ్ళు గుచ్చుకున్న ఆ పండు ముదుసలి శరీరం నుండి రక్తం జారుతోంది

నీచ, దరిద్ర వాతావరణంలో నిస్సహాయంగా పడివున్న అతడి ముఖం చూస్తుంటే మహా సమాధి స్థితిలో మునిగినట్లు కనిపిస్తున్నాడు.

బాహ్య దృష్టికి కన్పించే సర్వ చరాచర ప్రపంచమూ అతడి దృష్టిపథానికి కన్పించినట్లు కన్పించడంలేదు.

పండుటాకులా వున్నాడతడు.

అంపశయ్య మీదనున్న భీష్మునిలా వున్నాడు.

విధి వికటించి అదృష్టదేవతకు మతిచెడటంవల్ల స్మశానానికి చేర్చబడినట్లున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో—

ఆ బీభత్స వాతావరణంలోకి-

పండుటాకులాంటి ఆ ముదుసలి వద్దకు ఓ చిగురుటాకులాంటి కుర్రవాడొచ్చాడు.

అతడు??

అదిగర్వైశ్వర్యత్వము—

యౌవనము—

చక్కదనము—

సాహసము—

చనువు—

దోషపుంజమున కొక్కొక్కటే చాలు!

కానీ ఇవన్నీ కలగలిపితే 'సుకుమార్' అవుతాడు.

అతడ్ని చూసి మన్మథుడు కోపించాడు.

పితృ గౌరవము, వంశ గౌరవము, విద్యా గౌరవము మంట గలిపి ద్యూతకేళి వినోదోప్రాయముగా- పరదారగమనము ప్రౌఢినుగా- గురు తిరస్కారము గరిమగా- పానము అధ్యాత్మపరతగా- విటకీర్తనము పటిమగా- కామతంత్ర వరతంత్రుడుగా, "దేవతా రహస్యానికో తర్కఋష్యంతి" అని ప్రణయ చర్యల యందలి గంభీరార్థ మెరిగినవాడుగా వాసికెక్కాడు, తన్ను మరిగిన స్త్రీల యనురాగమున మునుగుటయే నిత్యకర్మ అతడికి

శాస్త్రీయ పురుషార్థమే సర్వమతడికి

అతనికి అనుష్టాన బంధములై విషయ భోగము లందే సుఖ బుద్ధి.

విపరీత వాంఛా లోలుడయిన సుకుమార్ అ దృశ్యాన్ని చూశాడు.

తాను భ్రాంతి పడుతున్నానేమోనని కళ్ళు నులుముకుని మరీ చూశాడు....

పండు ముదుసలి... విసిరివేయబడ్డట్టు, అతడి శరీరం నుండి రక్తం- చుక్కలు చుక్కలుగా!

ఒకడు, మరొకడు అయితే ఆ దృశ్యాన్ని హత్యగా భావించి అక్కడ్నించి పారిపోయేవాడే.... ఏదో ఉన్మాదం అవరించినట్లు రుద్ర భూమిని సమీపించిన సుకుమార్ అ ముసలిని కదిపి చూశాడు. కొన ప్రాణంతో కొట్టుకుంటున్నాడేమోనని

ఆ ముదుసలి తపస్సు భగ్నమయింది, కళ్ళు తెరిచాడు....

పున్నమి వెన్నెలనాడు కొలనులోని కలువవలె ఉన్నాయి, ఆ కళ్ళు.... నిర్మలంగా, ప్రశాంతంగా!

రంగస్థలం కర్టెను నెమ్మదిగా పైకి లేచినట్లు కనురెప్పలు పైకి లేచి, అదే స్థాయిలో క్రిందకు దిగాయి.

ఆ కళ్ళలో మెరుపు.... అమాయకత్వం, నిర్మలత్వం, కాక్ టెయిల్ అయినట్లు!



అంపశయ్యపై వున్న భీష్ముడు గుర్తుకు రాలేదు ఆ క్షణాన, యశోదకు తన బోసినోట్లో భువన భాండావాన్ని చూపిన బాలకృష్ణుడు గుర్తొచ్చాడు.

అతడిలోని సందేహాలు దృష్టిని మరల్చాయి. "శవాలు కాలుతున్న దుర్వాసనను భరిస్తూ, ఈ పొగలో, ఇంత ఎండలో, ఈ గాజు పెంకులు, రాళ్ళమీద, రక్తం చిమ్ముతూండగా ఈ పడకేమిటి?" అనడిగాడు సుకుమార్.

"నీవేమిటి.... ఇక్కడికెందుకొచ్చావ్" మొగ్గలు పుష్పిస్తున్న చప్పుడు స్ఫురించింది ఆ స్వరంలో.

"నా వయసు పద్దెనిమిది.... జీవితంలో నేను చవిచూడని అనుభవము లేదు. అన్ని జాతుల స్త్రీ సౌఖ్యాన్ని చవి చూశాను. మత్తు పదార్థాలు— అంటూ నాకు తెలియనివి లేవు. ఏ ఒక్కటీ నాకు పరిపూర్ణ తృప్తిని ఇవ్వడం లేదు. యింతేనా ? అనిపిస్తుంది. యింకా ఏదో చేయాలనిపిస్తుంది. అది ఏదో, ఎక్కడ వుంటుందో తెలియక తిరుగుతున్నాను"

"కుమారా! 'సుఖము' అంటే ఏమిటో జీవునికి బోధపడదు తెలుసుకోవాలన్న 'తపన' వుంటే, ఆ తపన 'తపసు'గా మారుతుంది. కుండలినీ జాగృతమవుతుంది. మాయకు అవలనున్న స్థితి అవగతమవుతుంది. శవాలు కాలుతున్న వాసన.... చర్మాన్ని కాల్చేస్తున్న సూర్యరశ్మి.... శరీరాన్ని శిథిలం చేస్తున్న గాజు పెంకులు, రాళ్ళు అంటున్నావు... యివేమీ నాకు తెలియవు నీ దుస్తులపై చల్లుకున్న పెర్ఫ్యూమ్‌కి ఆ శవాల వాసనకి, చర్మాన్ని చీల్చే గాజుపెంకులకి హాయినిచ్చే పూల పాన్పుకి నాకు తేడా లేదు, ఈ భూమండలం నాకు ఒక శివలింగం, ఆ స్వామికి అభిషేకం చేస్తున్నాను నేను- రక్తం స్రవిస్తోందని అంటున్నావు నీవు ! మన ఇద్దరికీ వున్న తేడా అదే నేను పడుకున్నది మారేడు చెట్టు క్రింద. శ్రీసిరి, మారేడు చెట్ల క్రింద దీక్ష తీసుకోవడం మంచిది. గుహ్య దీక్షకు పర్వత శిఖరం ఎంతగా ఉత్తమమైనదో స్మశానమూ అంతే ఉత్తమమైనది!

"శివుడు మెడలో కపాలాలు ధరిస్తాడు. ఆ కపాలాల వెనుక నున్న కథ తెలుసుకో- అవన్నీ తన భక్తుల కపాలాలు. పరమేశ్వరుడు తన భక్తులను ఎంతగా ప్రేమిస్తాడంటే వారు చనిపోయినా వారి కపాలాలను కూడా మెడలో వేసుకుని ఊరేగుతాడు అంతగా ప్రేమిస్తాడు. అటువంటి రుద్రుని భూమి ఇది. ఇంతకన్నా పవిత్ర స్థలం మరొకటి ఏముంది?

"శివుడు- భోళా శంకరుడు. భక్తులు అడిగిందే తడవు ఇచ్చేస్తాడు.

"విష్ణువు అలా కాదు, భక్తులకు ఎన్నో పరీక్షలు పెట్టి చివరకు వరం ఇస్తాడు."

"అమ్మవారు వరం ఇస్తుంది; ఇచ్చింది తిరిగి తీసుకుంటుంది."

"నీలోని తపన తపసుగా మారే యోగం నీకు వుంది కనుకనే నన్ను వెదుక్కుంటూ వచ్చావు. నీకు కుండలినీ సిద్ధమహాయోగము నేర్పిస్తాను...." అంటూ లేచాడు ఆ ముదుసలి.

"యోగము అంటే—" సుకుమార్ సందేహం.

"యోగః చిత్తవృత్తి నిరోధః- చిత్త వృత్తులను నిరోధించటమే యోగము"

"దీక్ష ఎలా ఇస్తారు?"

"దృష్టితో-స్పర్శతో-యంత్రము నిచ్చుట ద్వారా-

గురువు ఏ విధంగా ఇవ్వాలనుకుంటే ఆ విధంగా ఇవ్వవచ్చు. ఏ విధంగా ఇచ్చారు? అన్నది అప్రధానం- 'సంకల్పం' ప్రధానం."

"మీరు నాకు దీక్ష ఇవ్వాలని ఎందుకు అనుకుంటున్నారు?"

"భగవంతుడ్ని వెదుక్కుంటూ భక్తుడు పుణ్యక్షేత్రాలను, పుణ్య నదులకు వెళతాడు. కానీ భగవంతుడు అసలయిన భక్తుడ్ని వెదుక్కోవడానికి అంతకంటే ఎక్కువ శ్రమ పడతాడు. ఈ భక్తుడు ఎక్కడ, ఏ రూపంలో వున్నా వెదకి పట్టుకోవడం.... ముక్తి మార్గాన్ని సూచించడం ఆ భగవంతుని కర్తవ్యం.



"అలాగే గురుశిష్యులు.

గురువు లభించడం శిష్యుని అదృష్టం.

సద్గురువు కూడా అంత గొప్ప శిష్యుడు ఎక్కడ దొరుకుతాడా అని ఎదురు చూస్తాడు. నా అదృష్టంకొద్దీ నీవు నాకు లభించావు."

"నేను శిష్యుడ్ని- మీరు గురువు అనుకుందాం. నాకు దీక్ష ఇవ్వాలని మీకెందుకంత తపన? నన్నూ ఈ రాళ్ళ- గాజు పెంకులమీద, స్మశానంలో, దుస్తులు లేకుండా పడుకోబెడదామనా?" సుకుమార్ సూటి ప్రశ్న.

"జీవి భూమిమీద పడినప్పుడు ఏ స్థితిలో వుంటాడో అదే స్థితిలో ఈ శరీరాన్ని త్యజించాలి జీవి ఈ శరీరం ధరించిన తరువాత గురువుల నుంచి, పరిసరాల నుంచి ఏయే విద్యలు సంపాదిస్తాడో ఆ విద్యలన్నిటినీ శిష్యులకు ధారపోయాలి. అప్పుడే విముక్తి; ముక్తి లేకుంటే మరో జన్మఎత్తి రుణ విమోచనం పొందాలి. ఈ శకుల్ని శిష్యుడు దుర్వినియోగం చేస్తే ఆ పాపం గురువుది. ఆ పాప ప్రక్షాళనానికి గురువు ఏడు జన్మలు ఎత్తాలి.

'సద్గురువు' అనేవాడు శిష్యునికి ఎంత అవసరమో, అటువంటి శిష్యుడూ గురువుకి అంతే అవసరం"

"ఓ ముసలయ్యా.... కొంపదీసి నన్ను ఈ శ్మశానానికి అంకితం చేస్తావా ఏమిటి....?"

"స్మశానం అంటే కోరికలు అణిగిపోయిన చోటు కాదు: కోరికలు ఆగిపోయిన చోటు!

శివుడు తనలో తాను ధ్యానం చేసుకునే చోటు!

ఏ జీవి అయినా పరిపూర్ణ ఏకాగ్రతని పొందేచోటు; అత్యంత ప్రశాంతంగా- అతి గాఢంగా నిద్రపట్టే చోటు.

శివ—బయోఫిజికల్-పదార్థం

శక్తి-బయోకెమికల్—శక్తి

బ్రహ్మ—క్రియేషన్-ఉత్పత్తి

'శివ శక్త్యాత్మకం బ్రహ్మ'
మనిషిలో జీవభౌతిక పదార్థాలు- 30 నుంచి 40 శాతం
జీవరసాయనిక పదార్థాలు- 70 నుంచి 60 శాతం
వీటిని 50-50 చేయగలిగితే
-మరణం లేదు
-వృద్ధాప్యం లేదు
-కృశించడం లేదు
అదే 'అర్ధనారీశ్వర తత్వం'

—ఆ తత్వాన్ని సాధించాలంటే నన్ను అనుసరించు. లేదా నీ మార్గాన్ని నీవు వెదుక్కో"

"-మరణం లేదు
-ముసలితనం లేదు
-నిత్యయవ్వనం"
ఈ మాటలు సుకుమార్‌ని విపరీతంగా ప్రభావితుడ్ని చేశాయి.

"అందుకు నేనేం చేయాలి...." అంటూ అప్రయత్నంగా చేతులు జోడించాడు.

"అఘోర...
సంప్రదాయాన్ని పాటించాలి"

## 2

తంత్ర మంత్రజాల భూషణా అహీన శేముషీ దురంధరార్యలోక పూజితా సుహాసపూర్ణ దివ్యతేజ శోభితా సుధాకరుడు-ఆచార్యుడు—ఆ క్షణాన అగ్నివలె వున్నాడు; హృదయాన్ని చీల్చి చదవటంలో మేటిలా భాసిస్తున్నాడు; కృతాంతుడి పాశంలా శోభిస్తున్నాడు.



అనన్య సాధారణ బ్రహ్మ వర్చస్సుతో—
అనంత శేముషీ సంపదతో-

అఖండ మేధా సంపత్తితో జాజ్వలంగా మిరుమిట్లు గొలుపుతున్న ఆ మనిషి నిశిత వీక్షణ సుకుమారుడ్ని పెదవి కదపనీయలేదు.

పాలలో ముంచి తీసినట్లు అందంగా, ఆకర్షణీయంగా కనిపిస్తున్న సుకుమార్ ఆలోచనలు ఎక్కడో, ఎప్పుడో ఆగిపోయాయి ఏదో ఉత్కంఠ, ఉద్రిక్తత.... ఆందోళన.... ఆశ....ఆనందం—కాక్ టెయిల్ అయి-అతడ్ని వివశుడ్ని చేశాయి.

వార్ధక్యం—
నశించడం—
కృశించడం లేనే లేవు!
అన్న విషయం దగ్గరే ఆగిపోయాయి.



అతడి ఎదురుగా నున్నది నీచ, నిస్సహాయ, దరిద్ర రూపం కాదు.

-అన్న భావం బలపడసాగింది!

శూన్యంలోకి గీసిన రెండు సమాంతర రేఖలు కలిస్తే వచ్చే రూపం ఆ ఆచార్యుడు; జీవితంలో పడిన చిక్కుముడికి కాలం విప్పిన జవాబుముడి ఆ ఆచార్యుడు.

ఆ ఆచార్యుని శరీరం అధోభాగం నుంచి రక్తం సరసరా కారి జరజరా ప్రవహిస్తోంది.

అంత రక్తం ధారకడుతున్నా, ఓ మనిషి నిలువరించుకొని నిలదొక్కుకోవడం సాధ్యమా? ఎముకల పోగులా శుష్కించిన ఆ శరీరంలో అంత రక్తం ఎక్కడుంది? -పాతాళ గంగలా ఎలా పెల్లుబుకుతోంది?

లాజిక్‌కి అందని విషయం!

-రీజనింగ్ మనసు ముంగిటకు రావడంలేదు.

-సుకుమార్ శరీరంలో తీవ్రమైన సంచలనం ఆరంభమయింది. తనలో కలుగుతున్న సంచలనాన్ని అణచివేసుకునే ప్రయత్నం చేయలేదతడు.

ఆ ఆచార్యుడు సుకుమారులోని మార్పు గమనించాడు; గమనించనట్లే వున్నాడు.

ఆ ఆచార్యుని శరీరం నుంచి రక్తం ధారకడుతున్నా మనిషిలో భయ విహ్వాల ఛాయలు లేవు; వర్షపు చినుకుల్లా పడుతున్న రక్తపు చుక్కలు గడ్డకట్టడంలేదు.

ఆయన పాదాలు పసుపురంగులో వున్నాయి; పచ్చని చర్మం వెనుకనున్న నరాలను- ఎముకలను లెక్కబెట్టగలిగిన స్థాయిలో వున్నాయి!

సుకుమార్ చూస్తున్నది ఇవి కాదు-ఆయన మొహాన్ని.

ఆయన శరీరంలోని ప్రతీ అణువులోనూ ప్రశాంతత; ధృడచిత్తం తొణికిసలాడుతోంది. ఆయన కళ్ళు ముత్యపు చిప్పలో పడ్డ వర్షపు చుక్కల్లా స్వచ్ఛంగా, ప్రశాంతంగా వున్నాయి.

ఆ ఆచార్యులవారు పెదవి కదిపారు.

“ఆరోగ్యకరమైన మనసుని ఒకే విషయంపై కేంద్రీకరిస్తే అది సమాధి”

-బుద్ధ

ఆరోగ్యం - నాన్ ఎగ్జయిట్‌మెంట్
- నాన్ ఎమోషనల్
- నాన్ ఎగ్జాజిరేషన్!

‘తంత్రం’ ఇక్కడే ఆరంభమవుతుంది.

‘జ్ఞానం’ - నలభై ఏళ్ళ తర్వాత నిన్ను ఆవరిస్తుంది
- పంచమకారాలు ‘స్టెరాయిడ్స్’ వలె పనిచేస్తాయి.
- ఆత్మశక్తి, యోగశక్తి, జ్ఞాన-క్రియా శక్తి లేనివారు ఈ పంచమకారాలను సాధనాలుగా చేసుకుంటారు.



- అయిదోది మండలం.”

- అని చెబుతున్న ఆచార్యులవారు చేతివ్రేళ్ళతో శూన్యంలో గీతలు గీసి



“ఇది సృష్టికి చిహ్నం; ఇక్కడ యాక్టివిటీ మినిమమ్ వుంటుంది” అంటూ మరొక్కమారు శూన్యంలో గీతలు గీసి, “ఈ త్రికోణం సృష్టిని



నిరోధిస్తుంది. ఈ రెండూ కలిపితే షట్కోణం” అంటూ మరొకమారు చేతి వ్రేళ్ళతో శూన్యంలో గీతలు గీశారు.



సాధకుని లక్షణాల్ని కళ్ళు చూసి చెప్పొచ్చు-

సాధకుని కళ్ళు ఎప్పుడూ ఏదో ఒక దానికోసం అన్వేషిస్తుంటాయి.

ఎవరి జీవితం ‘ఎంక్వయిరీ’ అవుతుందో, అతడు యోగి–

'మెంటల్' ఎగ్జిక్యూషన్ ద్వారా లైఫ్‌ని ట్యూన్ చేసే వ్యక్తి యోగి-

'ఎంక్వయిరీ' అంటే 'విముక్తి' గురించి తెలుసుకోవాలన్న 'జిజ్ఞాస.'

'అవధూత' అర్హత పొందడానికి-

బాల-

ఉన్మత్త-

పిశాచ దశల్ని అధిగమించాలి.

"ఆచార్యుడు ఇద్దరికోసం అన్వేషిస్తున్నారు.

ఈ జన్మ ఎత్తిన తర్వాత ఏఏ విద్యలు' ఆర్జించాడో, ఆ విద్యలను శిష్యునికి బోధించి విముక్తి పొందడానికి సత్ శిష్యుని కోసం.... అన్వేషణ.

ఈ దేహంతో ఏమేం సంపాదించారో ఆ సమస్తాన్నీ శిష్యునికి ధారపోస్తేనే 'విముక్తి' లభిస్తుంది. లేకుంటే ఆ విద్య రుణశేషంగా మిగిలి పోతుంది.

'అవధూత'గా ఆవిష్కరింపచేసే ఆ సద్గురువుకోసం.... అన్వేషణ.

నీ కళ్ళలో ఈ ఆచార్యునికి అన్వేషణ కనిపించింది. అయితే ఒక్క అన్వేషణ చాలదు-ఆరాటం, అంతకుమించిన పోరాటం వుండాలి. ఈ ఆచార్యుల వారి నుంచి ఆ విద్యలు పొందడానికి ప్రయత్నించు.... వెంటాడు, వేటాడు" అంటూ కదిలాడు ఆ ముసలాయన.

(గమనిక : అవధూతలు ఎన్నడూ 'నేను, మేము' అని తనని గురించి పేర్కొనరు. 'ఆచార్యులు' అని చెబుతారు.)

సుకుమారుడు మెస్మరైజ్ చేయబడినట్టు ఆ ముదుసలి మాటలు వింటూ మిగిలిపోయాడే గాని, ఆ సమయంలో అంతగా గాలి వీస్తున్నా ఆ చెట్టు ఆకులు కదలడంలేదని, ఆకాశంలో తిరిగే కాకులు తదితర పక్షులు కూడా ఆ వైపు రావడంలేదని, ఆఖరికి చీమలు కూడా ఆచార్యుల వారున్న ప్రదేశం వైపు మసలడంలేదని గమనించలేక పోయాడు.



గమనిస్తే ఇంత సాహసానికి పూనుకునేవాడు కాదు-అతడి జీవితం చిత్రమయిన మలుపు తిరిగేదీ కాదు!

కోనసీమ....

అందునా అమలాపురం తంత్రవిద్యలకు కేంద్ర బిందువని, పైకి అతి సామాన్యులవలె కనిపించే వారిలో ఎందరో ఉపాసకులున్నారని, వారివద్ద తాళపత్ర గ్రంథాలు వున్నాయని - కనుసైగతో విద్యుత్తునే శాసించగల విద్వత్తు వున్న వారనీ అతనికి తెలియదు. తెలిస్తే ఈ కథ మరో మలుపు తిరిగేది.

కళ్ళు మూసి తెరిచేంతలోనే ఆ ముదుసలి అక్కడ్నించి కదిలాడు.

ఆ కదలిక నడకకన్నా వేగంగా వుంది. పరుగుకన్నా తక్కువగా వుంది.



ఆ ముదుసలి వేగాన్ని అందుకోవడానికి పరుగు ప్రారంభించాడు సుకుమార్. చిత్రం...సుకుమార్ పరుగెత్తుతున్నకొద్దీ ఆ ముదుసలి నడక వేగం మితిమీరుతోంది రొప్పుతూ, రోజుతూ తన ప్రయత్నాన్ని కొనసాగిస్తున్నాడు సుకుమార్....

అక్కడ నేల అంతమయి, నీరు ప్రారంభమయింది.

ఆ నది లోతయింది....

ఆచార్యులవారు నేలమీద ఎలా నడిచారో అలాగే ఇసుకపైన.... నీటిపైన నడుస్తున్నారు.

నేల అంతమయినచోట సుకుమార్ దబ్బున జారి గుబిల్లుమని నీటిలో పడ్డాడు.

ఆచార్యులవారు వెనుదిరిగి చూడలేదు.... అలాగే నీటిపై అదే వేగంతో నడుచుకుంటూ వెళ్తున్నారు.

* * * *

డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతున్న తమ కూతురు- కిడ్నాప్! మంచుపులి పంజా దెబ్బలా వుంది ఆ వార్త!!

అ షాక్ నుంచి తేరుకోవడానికి వారికి అయిదు నిమిషాలు పట్టింది.

అంతకు కొద్ది నిమిషాల క్రితం భర్తకి అసరా ఇవ్వబోయిన ఆమెను అతడు ఓదార్చవలసిన పరిస్థితి ఏర్పడి ది.... ఆ ఇద్దరిలో ముందుగా తేరుకున్నది అతడే గనక!

"అమ్మో....నా కూతూరు" అని అరున్నొక్కరాగం అందుకున్న ఆమె నోరు నొక్కేశాడు మాటలతో. "చూడు.... ఈ విషయం నలుగురికీ తెలిస్తే అమ్మాయి మరింత అల్లరవుతుంది. అసలు ఇందులో నిజమెంతో మనకీ తెలియదు.... నీవు నోర్మూసుకో" అతడి మాటలలో బేలతనం, గదమాయింపు, ఆక్రోశం మిళితమై ధ్వనించాయి.

దుఃఖాన్ని కడుపులో దిగమింగుకోవలసిరావడమే మరింత దుఃఖానికి కారణమవుతుంది.

సముద్రగర్భంలో ఏర్పడిన అల్పపీడనం తీరాన్ని పెనుతుపానయి తుడిచేసినట్టు ఆ కన్నకడుపు రంపపుకోతకు గురయింది.

కూతురు కోసం ఏడ్పు....ఉక్కిరి బిక్కిరవుతున్న భార్యని సముదాయింపు....తన తక్షణ కర్తవ్యమేమిటో తెలియక సతమతమవుతున్న అతడు ఆ క్షణాన అవధాని అయ్యాడు. సరిగ్గా అ సమయంలో మరో సారి ఫోను మోగింది.

ఆదే వాయిస్....

"మిస్టర్ సుబ్రహ్మణ్యం....మేము చెప్పేది జాగ్రత్తగా విను.... మేము మీ అమ్మాయిని కిడ్నాప్ చేశాం....ఎందుకు చేశామంటే, తమాషా కోసం చేశాం. కిడ్నాప్ చేయడంలో ఓ థ్రిల్ వుంది.

"వయసొచ్చిన ఆడపిల్ల అరుగురు అబ్బాయిల ముందు.... అదీ ఒక పాడుబడ్డ కొంపలో బితుకు బితుకుమంటూ కూర్చుని వుండడం- ఎంత థ్రిల్లింగ్‌గా వుంటుందో చూడటానికే కిడ్నాప్ చేశాం.

"రేపోమాపో ఆ అమ్మాయికి పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభిస్తున్న ఆమె తల్లిదండ్రులు ఈ వార్త విని ఎంతగా తల్లడిల్లిపోతారో చూడటం చాలా ఎగ్జయిటింగ్‌గా వుంటుంది. అందుకోసమే కిడ్నాప్ చేశాం...."



"ఒక ఆడపిల్లని తొమ్మిది నెలల్లో తల్లిని చేయగలమో లేదో తెలుసుకోవడానికే కిడ్నాప్ చేశాం..... అన్నిటినీ మించి ఒక అమ్మాయి శరీరాన్ని గంటలలెక్కన- రోజుల లెక్కన ఎలా సొమ్ము చేసుకోవచ్చో అనుభవపూర్వకంగా తెలుసుకోవడానికే కిడ్నాప్ చేశాం....మీ అమ్మాయి గుండె, కిడ్నీ, బ్లడ్ ఒకటేమిటి ఆఖరికి నెత్తిమీద జుత్తు కూడా సొమ్ము అవుతుంది. ఇప్పుడు నిర్ణయించుకో- మీ అమ్మాయిని మేము కిడ్నాప్ చేశామని పోలీసులకి చెప్పాలో, వద్దో!

"మీ అమ్మాయిని ప్రాణాలతో ఎంతకు సొమ్ముచేసుకోగలమో, ప్రాణాలు పోయిన తర్వాత కూడా అంతగా సొమ్ము చేసుకోగలం. అయితే ఆ ఛాన్స్ ముందుగా మీకే ఇవ్వాలని నిర్ణయించుకున్నాం. ఒక లక్షరూపాయల క్యాష్. సాయంత్రం నాలుగు లోపు ఆ డబ్బు ఎవరికి ఎక్కడ ఎలా ముట్టచెప్పవలసిందీ మళ్ళీ ఫోన్‌చేసి చెబుతాం. మీరు ఈ విషయాన్ని పోలీసులకి ఇన్‌ఫార్మ్ చేస్తే మీ అమామ్మాయి మటాష్.... గుర్తుంచుకోండి. సాయంత్రం నాలుగు గంటలలోపు లక్ష రూపాయల క్యాష్....బెట్" అంటూ అవతల ఫోన్ క్రెడిల్‌చేసిన శబ్దం వినిపించింది.

అప్పటికి జవసత్వాలు కృంగిపోయిన సుబ్రమణ్యం ఫోన్ క్రెడిల్ చేయాలన్న విషయం కూడా మర్చిపోయి అలాగే వున్నాడు.

"ఎవరండీవాళ్ళు....ఏమంటున్నారు... మన అమ్మాయి మాట్లాడిందా?" అంత బాధలోనూ ఫోన్ మోతకి అప్రమత్తమయిన ఆ ఇల్లాలు ప్రశ్నించింది.

ఎవరనిచెబుతాడు?

వారి డిమాండ్ వినడంతోనే సుబ్రహ్మణ్యం గుండె గొంతులోకి వచ్చింది

"ఎవరండీ...." భార్య రెట్టిస్తోంది.

"తెలియదు....కానీ లక్షరూపాయలు ఇస్తే వదిలిపెడతారట—"

"లక్ష రూపాయలా?" అంత బాధలోనూ ఆశ్చర్యం తొంగి చూసిందామె కంఠంలో.

అదొక విచిత్రమైన నరకయాతన

ఎదిగిన కూతుర్ని ఎవరో కిడ్నాప్ చేశారని చెప్పుకోలేరు; చెప్పుకోకుండానూ వుండలేరు– ఆ బాధని భరించలేరు; ఆ బాధను బయటకు చెప్పుకోనూ చెప్పుకోలేరు!

ఒకరికొకరు మిగిలిపోయారు.

అప్పుడు అనుభవంలోకి వచ్చింది భార్యాభర్తల బంధమంటే ఏమిటో- ఒకర్నొకరు ఓదార్చుకుంటూ విషయాన్ని వివరించుకున్నారు.

అప్పుడొచ్చిందామెకు ఈ అనుమానం : "ఎవరయినా మనల్ని ఆట పట్టించడానికి ఇలా ఫోన్ చేశారేమో- ఒకసారి కాలేజీకి వెళ్ళిరండి" అన్నది.

భార్య అనుమానం నిజంకాదని అనిపిస్తున్నా, నిజమయితే బావుణ్ణని మనసు పీకుతోంది. అందుకే బయల్దేరాడు.

ఆ రోజున పావని కాలేజీకి రాలేదని తెలిసింది అంతే—అంతకుమించి డిస్కషన్ పెంచలేదు సుబ్రమణ్యం. వెనుదిరిగాడు. అంత నిరాశలోనూ ఓ ఆశాకిరణం - బంధువుల ఇళ్ళలోనో, స్నేహితుల దగ్గర వుందేమోనని!

పావనికోసం ఎంక్వయిరీకి వెళ్ళినట్టుగా కాక, యధాలాపంగా వెళ్ళినట్టు వెళ్ళాడు. ఎక్కడా పావని ఆచూకీ దొరకలేదు.

ఒక్కగానొక్క కూతురు

ఇంట్లోకి అడుగు పెట్టగానే ఏడుపు కట్టలు త్రెంచుకుంది.

భర్త ఏడుపుచూసి బావురుమంది ఆ ఇల్లాలు

ఇరుగూ పొరుగూ ఎక్కడ వింటారోనని బిగ్గరగా ఏడ్వలేక ఏడ్చుకున్నారు ఆ దంపతులు,

ఆడపిల్ల తల్లిదండ్రులు తమ పిల్లకు జరుగుతున్న అన్యాయానికి బిగ్గరగా ఏడ్చుకునే స్వతంత్రం, అవకాశం లేవు ఈ దేశంలో.



ఆడపిల్లల్ని కిడ్నాప్‌చేసి తీసికెళ్ళి వ్యభిచార కొంపలకి, విదేశాలకి అమ్ముతున్న ముఠాలు మన మధ్యే తిరుగుతున్నాయి-

అయా వ్యక్తులకు తెలియకుండా వారి కిడ్నీలు, రక్తం తీసుకుని అమ్ముకుంటున్న రాకెట్స్ కూడా సమర్థవంతంగా పనిచేస్తున్నాయి.

పరువు ప్రతిష్ట కోసం ప్రాకులాడే మధ్యతరగతి కుటుంబాలు తమ కూతురు ఆచూకీకోసం పదిమందిని అడగలేరు; పోలీసులకు ఫిర్యాదు చేయలేరు.

ఇదే జరిగితే ఆ పిల్లకు రేపు పెళ్ళి కాదు: ఆ కుటుంబానికి పరువు మిగలదు

ఇలా ఆలోచిస్తున్న ఆ దంపతులు అంతకుమించి ఆలోచించలేకపోయారు.

వారు ఆలోచించనిది;

పావని తిరిగి వస్తుందా?

ఆ తిరిగి రావడమన్నది ప్రాణాలతోనా? ప్రాణాలు లేకుండానా?

ఆడపిల్లలకు ప్రాణం ముఖ్యమా? మానం ముఖ్యమా?

ఇంతకీ పావనిని కిడ్నాప్ చేసింది ఎవరు?

# 3

అణువంత అనుమానం క్షణాల్లో ఆకాశమంతగా ఎదిగిపోయి అంతటా తానై ఆవరించింది.

అంతా చీకటి–ఆ చీకటి స్థానాన్ని విద్యుత్‌దీపం ఆక్రమించడానికి పోరాడిస్తోంది.

టిక్....టిక్....టిక్....గోడ గడియారం శబ్దం.

టపటపా కొట్టుకుంటున్న గాజు కిటికీలు.

చీకటి నిశ్శబ్దాన్ని బద్దలుచేసే కప్పల బెక బెక....

చుట్టూ చూశాడు సుకుమార్—
తాను తన గదిలో వున్నాడు. ఇదెలా సాధ్యం
రాత్రి తాను చూసిన ముదుసలి—గుర్తువచ్చాడు.
కాలుతున్న శవాల వాసన-
అవేమీలేవు తాను భ్రమపడ్డాడా? కల చెందాడా?

వెండిలా మెరిసిపోతున్న జుత్తుతో ఆ ముదుసలి: పగిలిన గాజు పెంకులు-రాళ్ళశయ్య— అంతా భ్రమేనా?

అదంతా 'కల'గా కొట్టిపారేయడానికి దాఖలాలున్నాయి.

కానీ 'వార్ధక్యం లేదు'- అన్న మాట వేద మంత్రంలా అతడ్ని మెస్మరైజ్ చేసింది. అది కల 'కాదు', 'కల కాకూడదు' అన్న ఆలోచన బలపడింది.

రాత్రి తాను చూసిన దృశ్యాన్ని తిరిగి చూడటానికి- దిగ్గున లేచాడు.



అసంపూర్తిగా మిగిలిన అన్వేషణని కొనసాగించడానికి, ఓ కొలిక్కిరాని నిగూఢ రహస్యాలను అంతుతేల్చడానికే నిర్ణయించుకున్నాడు. ఎంత వేగంగా ఆ ప్రాంతాన్ని చేరుకున్నాడంటే ముళ్ళ కంచెల మధ్య అతడి మోకాళ్ళు చీరుకుపోయిన విషయం సైతం అతడు గమనించలేదు.

అతి స్వల్పకాలంలో ఒక జీవితానికి సరిపడ్డ అనుభవాన్ని పోగు చేసుకున్న వ్యక్తి అతడు.

ఒక జీవితకాలం తర్వాత ఎదురయ్యే ప్రశాంత వాతావరణమది;
ఒక సుదీర్ఘ పోరాటం తర్వాత జీవి విశ్రమించే చోటు అది;

దగ్ధ హృదయ బడబానలం పూర్తిగా ద్రవించి మనసు ప్రక్షాళన మయ్యే రుద్రభూమి అది;
కాలభైరవుని కరాళ నృత్య వేదిక అది;
సుకుమారుడు ఎన్నుకున్న తాజా రంగస్థలమది!
అతడు మెదడుతో కాక గుండెతో ఆలోచిస్తున్నాడు.



పున్నమి-
కాముని పున్నమి-
సాధారణంగా తాంత్రికులకు అమావాస్య, ఆదివారం పరమ పవిత్రమయిన రోజు!

కొన్ని తాంత్రిక విద్యలు పున్నమి రోజునే ఉపాసిస్తారు.

అన్న విషయమే కాదు; తాంత్రిక విద్యా విషయాలేవీ సుకుమార్‌కి తెలియవు.

మెగ్నీషియం తీగ మండినట్టు లోకమంతా తెల్లగా వింతకాంతిలో మెరుస్తోంది. తాను ఆ తెల్ల గడ్డపు వ్యక్తిని చూసిన చెట్టువేపు నడిచాడు.

ఆదే చెట్టు- ఆ చెట్టుక్రింద రాళ్ళు, గాజుపెంకులు మామూలే-

ఆ చెట్టు సమీపించబోయాడు. అప్పుడు జరిగిందది.

కమ్మరి బండిచక్రం పట్టాకి పిడకల కొలిమి పెట్టినట్టు వలయాకారంలో అగ్నిశిఖ-

ఈ వలయాకారాన్ని సమీపిస్తున్నకొద్దీ అడుగుల వేగం తగ్గసాగింది. ఎంతగా శక్తిని కూడదీసుకుని ముందుకి కాళ్ళు పీకుతున్నా అంతగా అడుగులు వెనుకకి పడసాగాయి. అడుగు ముందుకి పెగలడం లేదు. అప్పుడు గమనించాడు-తాను ముందుకు అడుగేయబోయినప్పుడల్లా అడుగు వెనుకకి పడుతోందని! తానేకాదు, ఆ చెట్టు ఎత్తున ఆకాశంలో సంచరించే పక్షులు సయితం- దిశ మార్చుకుని వెళుతున్నాయని! చీమలుకూడా ఆ ప్రాంతంలో వెనుకకి నడుస్తున్నాయి. వీచే గాలికెరటం కూడా ఆ చెట్టు సమీపానికి చాగానే స్తంభించిపోతోంది. ఆ చెట్టు ఆకు కూడా కదలడంలేదు.

ఒక్క వాక్యంలో చెప్పాలంటే- అక్కడవున్న చరాచర వస్తువులన్నీ ఫ్రీజ్ అయ్యాయి. ఆ నేపథ్యంలో పుట్‌బాల్‌ని గోల్‌వేపు తన్నినట్టు: క్రికెట్ బాల్‌ని బౌండరి లైను అవతలికి కొట్టినట్టు- సుడిగాలిలో చిక్కుకున్న ఎండుటాకులా ఒక్కసారిగా దూరంగా విసిరివేయబడ్డాడు.

అక్కడ చూశాడు: భూమికి గజం ఎత్తున గాలిలో నిల్చునివున్నా డతడు.

ఆ పాదాలు పవిత్రత నాపాదించుకున్నట్టు- ఎర్రచందనంలో ముంచి తేల్చినట్టున్నాయి; పవిత్రత పోగులు పోగులుగా విడిపోయి, పొరలు పొరలుగా కదిలిపోయి, కదిలే ప్రతీ కదలికా ఒక మృదుమధుర ప్రకంపనమై తూర్పును తాకి, పడమటను సోకి, ఉత్తరాన వికసించి, దక్షిణాన ఆవిష్కరింపబడినట్లున్నాడు. అంతుబట్టని రహస్యాల ప్రపంచంలా వున్నాడు.

ఒక ఉన్మాదిలా ఏ శక్తో అవహించినట్టు ఆకాశంలోకి రెండు చేతులూ సాచి ఎవరినో శాసిస్తున్నాడు.

ఆకాశం బద్దలైనట్టు అనిపించింది.

వెండికొండల్లా మెరుస్తున్న ఆకాశం కరిగి మేఘాలయ్యాయి; పొర్లుతున్నాయి; మెలితిరుగుతున్నాయి; దివినుంచి భువికి దిగుతున్న హిమపాతంలా వుంది.

అతడి నీడ నేలమీద పరుచుకుంది. పింగినుంచి నేలకు దిగుతున్న వెన్నెల ఆ నీడ పొడవునా పరచుకుంటోంది ఆ నీడ పరుచుకున్న మేర నేల చిట్లింది ఆ నేల కదలిక మామూలు కదలిక కాదు, రౌద్రకళా కృతహస్తుకేతు లంఘనంలా వుంది చీలిన భూమినుంచి ఓ శవం తనకు తానుగా లేచి నిల్చుంది

—నరాలు చిట్లేంత గగుర్పాటు.

—టెన్షన్, రక్తం నోటిలోకి ఎగజిమ్ముతున్నట్లు వగర్పు

—ఎదురుగా గాలిలో నిలబడిన మనిషి; అతడి నీడ పరుచుకున్న మేరకు నేల చిట్లి, లేచి నిలబడిన నేల మాళిగలో నిశవం; వాగ్రాం-జర పైశాచిక కేళి!

ఆకాశం గుండె పగిలినట్లు కుదపలు కుదపలుగా కురుస్తున్న వెన్నెల!

వెన్నుపాములో పుట్టిన వణుకు క్రమంగా అతడి శరీరమంతా వ్యాపించింది.



గొంతు పిడచకట్టుకుపోతోంది; గగుర్పాటుతో అతని శరీరం కనిపించసాగింది

ఏనాడూ ఇటువంటి అనుభవం చూడని సుకుమార్ ఎంతగా కలవరపడ్డాడంటే, అప్పటికే అతని శరీరం చెమటతో తడిసి పోయింది

"ఛాయా ప్రేతము"

తాంత్రికులకు అమావాస్య-ఆదివారం పవిత్రమయిన రోజు. ఆ రోజు కోసమే వారు నిరీక్షిస్తారు. అయితే కొన్ని ఉపాసనా కార్యక్రమాలు పౌర్ణమినాడుకూడా జరుగుతాయి వాటిలో ఒకటి- ఛాయా ప్రేతము.

ఆరోజున తాంత్రికుడు వెన్నెలలో నిలబడి తన ఛాయలోకి ప్రేతాన్ని అహ్వానిస్తాడు. ఆకాశంనుంచి వచ్చే పిశాచాలను వారు ఉపాసిస్తారు; నడిపిస్తారు.

ఈ ఉపాసకుడు సామాన్యుడు కాదు గాజు పెంకులలోను పూలపాన్పుగా విశ్రమించగలడు. అతడు నిల్చున్నదగ్గర గాలి దిశ మార్చుకుంటుంది; పక్షులు సయితం అతడివేపు చూడటానికి సాహసించవు; చీమలుకూడా తమ గమనాన్ని మార్చుకుంటాయి. అతడు నేలపై ఎలా నిలబడగలడో-నడవగలడో అలాగే నీటిపైన, గాలిలోన నిలబడగలడు; నడవగలడు. శవాలను లేపి తన కార్యక్రమాన్ని నిర్వర్తించుకోగలడు.

సాధన, మధువిద్య, జీవ విద్య, భూత విద్య, భూ విద్య-భువన విద్య-భోగవిద్య- అభోగవిద్య

—అష్ట సిద్ధులలో మొదటి ఏడు సాధించిన సిద్ధపురుషుడాయన.

—సుకుమార్ ఆలోచనలేకాదు, శరీరమూ పారలైజ్ అయింది. ఆ ఉద్వేగం, ఆ వణుకు, ఆ భీతావహం స్థానే భావన- అ భావన స్థితి చోటుచేసుకుంది. అలా యెంత సేపు వున్నాడో అతడికే తెలియదు.

స్మారకంలోకి వచ్చి చూస్తే కుదపలు కుదపలుగా నింగినుంచి నేలకు దిగుతున్న వెన్నెలలేదు; భూమిని చేసుకొని లేచి నిలబడిన శవమూ లేదు.

ఆ నిస్సత్తువలోంచి ఆత్మవిశ్వాసం మెదడు పొరల్లోకి పంప్ అయింది క్రమంగా చచ్చుపడిపోయిన జ్ఞానేంద్రియాలు పనిచేయడం మొదలుపెట్టాయి.

అయినా ఏదో మగత....మనసుని ఆవరించింది.

"ఇక్కడ నీవు చూసింది నిజమనుకుంటే నిజం, భ్రాంతి అనుకుంటే భ్రాంతి భీతావహాన్ని ఓ అస్త్రంగా ఉపయోగించుకోవాలిగాని భయానికి లొంగిపోకూడదు. ఇంద్రియాలను నిలువరింపజేస్తే నీలోని కుండలినీశక్తి నిద్రలేస్తుంది. అందివచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకునేవాడే జ్ఞాని"

ఆ మగత విడిపోయింది.

ఆ గాలిలోని మనిషి కనుమరుగయ్యాడు.

—ఊహింపశక్యంకాని దృశ్యమది.

గురు శిష్య సంబంధం మర్కట, మార్జాల కిశోరనీతి.

మర్కట కిశోరనీతి: తల్లికోతి పొట్టని పిల్లకోతి అంటిపెట్టుకుని వుంటుంది. తల్లికోతి ఒక కొమ్మమీదనుంచి మరొక కొమ్మమీదకు దుముకుతున్నప్పుడు జారి పడిపోకుండా పట్టుకోవలసిన బాధ్యత పిల్లకోతిదే!

—అలాగే శిష్యుడు గురువుని వెదుక్కోవాలి; వెంటబడాలి; శుశ్రూషచేసి రహస్యాలు తెలుసుకోవాలి.

మార్జాల కిశోరనీతి

తల్లిపిల్లి పిల్లపిల్లిని తన నోటితో కరచి పట్టుకుని జాగ్రత్తగా ఒక ప్రదేశంనుంచి మరో ప్రదేశానికి తీసుకెళుతుంది.

ఇక్కడ పిల్లపిల్లి బాధ్యత ఏమీ వుండదు; బాధ్యత అంతా తల్లిపిల్లిదే!



—అలాగే శిష్యుని వెదుక్కోవడం, విద్యలు నేర్పడం గురువు బాధ్యత.

సుకుమార్‌కి గురువుపట్ల గురి కుదిరింది.

గురి కుదిరిన శిష్యుడు గురువుని వదిలిపెట్టడు.

డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతున్న సుకుమార్ అఘోర సంప్రదాయాన్ని అనుసరిస్తే....!???

# 4

సమయం సాయంత్రం పావుతక్కువ నాలుగు గంటలు—

కిడ్నాపర్స్ డిసైడ్ చేసిన డెడ్‌లైనుకి యింకా పావుగంటే టైముంది.

క్షణాలు గడిచేకొద్దీ భయం భూతంలా మారుతోంది.

ఇక్కడ యిబ్బందికరమైన నిశ్శబ్దం చోటుచేసుకుంది. డిగ్రీ చదువుతున్న అమ్మాయి కిడ్నాప్- ఈ వార్త విన్నాక మనసు నితాంత శరాఘాత అవశేషమైంది. గుండెల్లో దుఃఖం కళ్ళలోంచి రాలేదు—మరింత బాధపెట్టడానికా అన్నట్టు మనసులోనే వుండిపోయింది నిర్వికారంగా చూస్తుండిపోయారు.

అప్పుడు మోగింది ఫోను- సరిగ్గా పదినిముషాలు తక్కువగా నాలుగు గంటలకి.

కొన్ని సంఘటనలకి లింకులు ఉండవు అవి అంతే! ఎందుకిలా జరిగింది-అంటే లాజిక్ దొరకదు!

నిశ్శబ్దంలోంచి ఓ శబ్దం

"హలో...." అని

స్వరంలోనేకాదు మొహంమీద కూడా అతడి మానసిక స్థితి తెలుస్తోంది-విచారాన్ని, నిస్సహాయతన్ని సూచించే ముదత ఒకటి అయన

నుదుటిమీద తేలింది. ఆ కొద్ది గంటల్లోనే పదేళ్ళ వార్థక్యం ముంచుకొచ్చింది.

రక్తం లేనట్టు ఆమె మొహం పాలిపోయి వుంది! అతికష్టంమీద ఏడుపు ఆపుచేసుకున్నట్టుంది.

"హలో మిష్టర్ సుబ్రహ్మణ్యం! నీకొక ముఖ్యవిషయం చెప్పాలి, ఒక సగటు మనిషి హటాత్‌గా ఓ ఆరుగంటల వ్యవధిలో లక్ష రూపాయల క్యాష్ ఇవ్వడమంటే చిన్నవిషయం కాదు మానవతా దృక్పధంతో నీకొక ఛాన్స్ ఇస్తున్నాం. ఒక వారంరోజుల్లో మాకు లక్షరూపాయలు సర్దాలి. ఎక్కడ ఎప్పుడు ఎవరికి అందజేయాలన్న అనుమానం నీకు రావచ్చు. కంగారుపడకు—ఉమెన్స్ కాలేజీ ఎంట్రన్స్‌లో ఎడమవేపున ఓ క్లాత్‌స్టోర్స్ వుంది. ఆ క్యాషియర్‌కి లక్షరూపాయల క్యాష్ ఇవ్వు ... అతడితో డిస్కషన్ పెంచినా, చెప్పినట్టు చేయకపోయనా నీ కూతురు వీధిలోకి వస్తే చాలు యాసిడ్ పోసి ముఖం కాల్చేస్తాం.... నీ కూతురు వీధి ముఖం చూడకుండా ఎంతకాలం దాచగలవో చూస్తాం.... ప్రస్తుతానికి నీ కూతుర్ని విడిచిపెడుతున్నాం. సరిగ్గా నాలుగు గంటలకి మీ అమ్మాయి మీ ఇంటికి తిరిగి వస్తుంది"

బలమైన కెరటం వచ్చి మొహానికి తగిలినట్టయింది సుబ్రహ్మణ్యంకి.

సడెన్‌గా చాలా రిలాక్సింగ్‌గా అనిపించింది

కళ్ళ నీళ్ళమధ్య కొండంత సంతోషం-విషాదం మధ్య రత్నాల చిరునవ్వు ...

అతడు అడిగిన ఒకే ఒక ప్రశ్న—"మా అమ్మాయి మా దగ్గరికి వచ్చేస్తుందా....నిజంగా వచ్చేస్తుందా?" అని.

అతడి ముఖంలో మారిన రంగుల్ని, కంఠంలో వచ్చిన మార్పుని గమనించిన ఆమె ఓ నిర్ణయానికొచ్చింది.

భార్యని గమనించే స్టేజీ దాటిపోయాడు సుబ్రహ్మణ్యం. అవతలి వ్యక్తి చెప్పేది అతి జాగ్రత్తగా వింటున్నాడు.



"అవును....సరిగ్గా నాలుగు గంటలకి మీ అమ్మాయి మీ ఇంటి దగ్గర వుంటుంది. మా మాట మేము నిలబెట్టుకుంటాం. మీ మాట మీరు నిలబెట్టుకోండి. ఈ విషయం పోలీసులకు చెప్పినా, లక్షరూపాయల వాగ్దానభంగం జరిగినా మీ అమ్మాయి తొమ్మిది నెలలకి బిడ్డని ఎత్తుకోవడం ఖాయం" అంటూ సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా ఫోన్ పెట్టేసాడు.

ఈ హెచ్చరికలు....వినే స్టేజీ దాటిపోయాడు.

తన కూతురు తిరిగి వస్తుందన్న చోటే మిగిలిపోయాడు.

## 5



పావని—

తురాయి చెట్టులా ఎర్రెర్రగా వుందామె ఆ క్షణాన.

ఏదో ట్రాన్స్‌లో వున్నట్టు నడుస్తోంది.

శృంగారమంతా కూరినట్లు ఆమె కనుపాపలు మత్తుగా, డ్రీమీగా వున్నాయి.

ఎత్తు గుండెలు గుండ్రగా, ఎదుటి మనిషిలో తుఫాను రేపుతున్నట్లున్నాయి. లివర్‌నెక్ జాకెట్‌లోంచి బయటకు దుమకడానికి అవి చేస్తున్న ప్రయత్నం జాకెట్ వంపు తిరిగిన దగ్గర అద్భుతంగా కనిపిస్తోంది జాకెట్ వెనుక డబుల్ స్ట్రిప్డ్ బ్రా చిక్కని చిక్కంలా స్తనద్వయాన్ని హత్తుకొని వుంది. చీరని జాకెట్‌ని వేరుచేస్తున్న చోట చర్మం బంగారం రంగులో మెరిసిపోతోంది.

ఊహించని విధంగా తన కూతురు అంత హఠాత్తుగా అక్కడ కనిపించేసరికి అదోలాంటి థ్రిల్, అదోరకమైన ఉద్వేగం ఆమె తండ్రిని ఊపేసింది.

వీధిగుమ్మం దగ్గర నిల్చుని కూతుర్ని చూస్తున్న సుబ్రహ్మణ్యం తన కాళ్ళకు చెప్పులు కూడా లేవని మర్చిపోయి వడివడిగా కూతురి దగ్గరికి వచ్చాడు. వయసులో భావాలు మొహంలో ప్రతిబింబిస్తున్నాయి. ఆనందం ఉద్వేగం-దుఃఖం-ఆవేశం కాక్‌టెయిల్ అయి అతడిని ఓ కుదుపు కుదిపేశాయి.

"అమ్మా! వాళ్ళు నిన్నేం చేయలేదుగదా...." అది నడివీధి అని కూడా మర్చిపోయి అడిగాడు. వెనుకే వచ్చిన తల్లి ఎవరు ఎక్కడ తమ సంభాషణని వింటారోనని జాగ్రత్తపడుతూ వడివడిగా లోపలకి లాక్కెళ్ళింది

"ఏమ్మా....వాళ్ళు నిన్నేం చేయలేదుగా!"

"ఇంతకీ వాళ్ళు నిన్నెక్కడికి తీసికెళ్ళారు....వాళ్ళు ఎవరో నీకు తెలుసా?" ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాడు సుబ్రహ్మణ్యం

"నన్ను ఎవరో ఎక్కడికో తీసికెళ్ళడమేమిటి? నేను కాలేజీనించి వస్తున్నాను"

"నేను మీ కాలేజీకే వచ్చాను....మీ ఫ్రెండ్స్ ఇళ్ళకు, ఆంటీవాళ్ళ ఇంటికి వెళ్ళాను. ఎక్కడా లేవు...."

విదుద్ఘాతం తగిలిన దానిలా నిశ్చేష్టురాలయి అలాగే చూస్తూ వుండిపోయింది. మొదట తండ్రి చెప్పింది అర్థంకాలేదు అర్థమయిన తర్వాత శరీరం మంచులో పెట్టినట్టు చల్లగా అయింది.

"అవునమ్మా....మీ నాన్నగారు నీకోసం వెదకని చోటు అంటూ లేదు" అంటూ ఫోన్ రావడం, సుబ్రహ్మణ్యం అన్నిచోట్లా చూసిన వైనం చెప్పింది.

ఆకాశం బద్దలయినట్టు అనిపించింది. పావని సన్నగా వణికింది.

"చెప్పమ్మా! వాళ్ళు నిన్నేం చేయలేదుగదా? అసలు వారెవరో నీకు తెలుసా? నిన్ను ఎక్కడికి తీసికెళ్ళారు? నిన్ను ఒకదానినే తీసికెళ్ళారా?" అదే ధోరణిలో తండ్రి ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు.

ఊపిరి అందనట్లు మనసంతా ఆందోళన....వెన్నులో ప్రారంభ



మయిన ప్రకంపన సెకండ్లలో మొత్తం శరీరమంతా వ్యాపించింది. ఒక్కసారిగా బరస్ట్ అయింది.

ఆ ఏడుపు వాగయింది. వాగు ఏరయింది, ఏరు మిన్నేరు అయింది.

కూతురి ఏడుపు ఆ తల్లిదండ్రుల్ని కల్లోల పరిచింది. పొగిలి-పొగిలి ఏడుస్తున్న కూతుర్ని చూసి తట్టుకోలేకపోయారు ఆ యిద్దరిలో ముందుగా వున్నది ఆమెతల్లి మాత్రమే.

"మీరు వుండండి....పిల్లని వాళ్ళెంతగా హింసించారో" అంటూ కూతుర్ని పక్క గదిలోకి తీసికెళ్ళింది. వాళ్ళు తన కూతుర్ని ఏదో చేశారని, అది చెప్పలేక కూతురు ఏడుస్తోందని ఆమె అభిప్రాయం.

"ఏమ్మా ఏం జరిగింది? కన్న తల్లిని నాకయినా చెప్పమ్మా" అనునయంగా అడిగింది.

అప్పటికే స్వేద బిందువులతో నిలువునా తడిసిపోయిన పావని ఆకులా అల్లల్లాడిపోయింది.

ఆ కన్నతల్లి గుండె వాగుకు గండిపడింది. మనసు పొరచిట్లి మెదడు నరాలను మెలిపెట్టి నిప్పు సెగల్ని పైకి చిమ్మింది. కన్నీళ్ళు లావాలా చిమ్మాయి.

ఆ గది బయట, హాలులో వున్న ఆ కన్నతండ్రి మనసు మెలి తిరిగినట్టు ఆక్రోశించింది.

ఆక్రోశంనుంచి ఆలోచన్లు ఒక్క కొలిక్కి వచ్చాయి.

పోలీసు రిపోర్టిస్తే—

తన కూతురు గుమ్మందాటి వీధిలోకి అడుగు పెడితేనేగదా, వాళ్ళు తన కూతురిపై అఘాయిత్యం జరపగలిగేది....

తన కూతుర్ని ఒంటరిగానే కాదు, తల్లితో కూడా బయటకు వెళ్ళనీయడు....

పోలీసు నిఘా వుంటుంది.

ఆ వెధవల్ని ఇప్పుడే అరెస్టు చేయించాలి. లేకుంటే ముమ్ముందు మరిన్ని వెధవ్వేషాలు వేస్తారు.

స్థిర నిర్ణయానికి వచ్చిన సుబ్రహ్మణ్యం వీధి తలుపుకి తాళం పెట్టి తిన్నగా పోలీసు స్టేషన్‌కి వెళ్లాడు.

డ్యూటీలో ఉన్న ఇన్స్‌పెక్టర్ 'జిగురునాధం'

వాస్తవానికి అతడి ఇంటిపేరు 'గంటి', అసలు పేరు 'గురునాధం'. ఆ విధంగా జి. గురునాధం అయ్యాడు. కానీ స్కూలు రోజుల్లో క్లాసు బుక్‌మీద 'జి' తర్వాత ఫుల్‌స్టాప్ పెట్టడం మర్చిపోయి 'జిగురునాధం' అని తన పేరు రాసుకున్నాడు. అదిచూసిన లెక్కలు మాష్టారు 'జిగురునాధం' అని అ రోజు నుంచి పిలవడం ప్రారంభించారు. అతడికి ఆ పేరే స్థిరపడింది.

వాస్తవానికి గురునాధం దృష్టికి ఏ విషమైనా వెడితే దాని అంతు చూడనిదే వదిలిపెట్టడు, బంకలా పట్టుకుంటాడు. ఆ విధంగా జిగురునాధం సార్థక నామధేయుడయ్యాడు.

సుబ్రమణ్యం చెప్పింది రొటీన్‌గా కాక, ఇంటరెస్టింగ్‌గా విన్నాడు జిగురునాధం. అతడలా ప్రత్యేక శ్రద్ధ చూపడానికి కారణం లేకపో లేదు. ఈ మధ్య టౌనులో రెండు గ్రూపులు బయల్దేరాయి. ఒక గ్రూపు ఆడపిల్లల్ని కిడ్నాప్‌చేసి తీసికెళుతుంటే మరో గ్రూపు అమాయకుల్ని వలలో వేసుకొని వారి కిడ్నీలు స్మగుల్డ్ చేస్తోంది. ఈ రెండు గ్రూపుల కోసం పోలీసులు గాలిస్తున్నారు. ఈ నేపథ్యంలో కాలేజీగర్ల్ కిడ్నాప్ ఎపిసోడ్. దీనికి రెస్పాండ్ కావలసినదానికన్నా ఎక్కువగా రియాక్ట్ అయ్యాడు జిగురునాధం. పావని కిడ్నాప్ వెనుక పెద్ద ముఠా ఉందన్న నిర్ణయానికొచ్చిన జిగురునాధం ఇంటిలిజెన్స్ ఎస్పీ సహాయం కోరాడు. దానితో సినేరియో మారిపోయింది. సుబ్రమణ్యం ఇంట్లోని ఫోనుని ట్యాప్ చేశారు. పేరలల్ ఫోను ఒకటి అమర్చారు. ఆ యింటి పరిసరాల లోను, ఉమెన్స్ కాలేజీ ఎంట్రెన్స్‌లో నిఘా ఏర్పాటు చేశారు మఫ్టీలో పోలీసులు.

అప్పుడు ప్రారంభించారు ఇంటరాగేషన్. ఎవరు ఎన్ని రకాలుగా ప్రశ్నించినా ఆమె ఇచ్చిన సమాధానం ఒక్కటే—ఏడుపు!



ఆమె పెదవి కదిపితేగాని కథ ముందుకి సాగదన్న విషయం అందరికీ తెలుసు కానీ ఆమె అసలు విషయం చెప్పదు— ఒకటే ఏడుపు.

ఆ కిడ్నాపర్స్ ఎవరో ఆమెకు తెలుసా?

వారి ఆచూకీ తెలిపితే వారివలన తనకే కాక తన తలిదండ్రులకి కూడా ముప్పు ముంచుకొస్తుందని ఆమె భయపడుతూందా?

ఇలా పలురకాల సందేహాలు జిగురునాధంని వేధిస్తున్నాయి. విమెన్స్ కాలేజీ ఎంట్రన్సులోనున్న మ్యాచింగ్ సెంటర్ క్యాష్ కౌంటరులో నున్న వ్యక్తిని మంచి మాటలతో పక్కకు తీసికెళ్ళి పోలీసువేను ఎక్కించారు. స్టేషనులో మక్కెలు విరగ్గొట్టినా వాడు కుయ్యో— మొర్రో అన్నాడేగాని అసలు విషయం బయట పెట్టలేదు. దానితో కేసు మొదటికొచ్చింది.

అప్పటికీ పావని ఇంటికి తిరిగివచ్చి సరిగా ఇరవయ్ గంటలైంది కేసులో పురోగతి లేదు. అప్పుడు జరిగిందది.

సుబ్రహ్మణ్యం ఇంటిలోని ఫోను మోగుతోంది.

ఫోను మోతని మించిపోతోంది ఆమె గుండెదడ.

అంతకన్నా దడదడలాడిపోతున్నాడు సుబ్రహ్మణ్యం.

పోలీసులకి ఇన్‌ఫార్మ్ చేసిన విషయం వారికి తెలిసిందా? తెలిస్తే రియాక్షను ఎలా వుంటుంది?

అన్నది సుబ్రహ్మణ్యం వర్రీ.

పావని వేరొకటి: పావని వర్రీ వెనుక వెరీ ఇంటరెస్టింగ్ స్టోరీ వుంది.

"ఫోన్ తీయండి—" అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

సుబ్రమణ్యం రిసీవర్ తీయడం పోలీస్ ఇన్స్‌పెక్టర్ పేరలల్ ఫోన్ అందుకోవడం ఒకేసారి ఎలా జరిగాయో, సుబ్రమణ్యం నోటి నుంచి "హలో" అన్న మాట రావడం, అవతల రిసీవర్ క్రెడిల్ చేయడం కూడా అలాగే జరిగాయి.

విషయం అర్థమైంది—ఆ ఫోను ఎవరికో!

పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఊహించినట్టుగానే మళ్ళీ పావుగంటలో ఫోను మోగింది. ఈ తఫా పావనిని ఫోను అందుకోమని, పేరలల్ ఫోను తీసుకున్నాడు ఇన్‌స్పెక్టర్.

"హలో—" అన్నది పావని అప్రయత్నంగా.

"హలో పావనీ—నేను" అంటూ ఏదో చెప్పబోతుండగా పావని రిసీవర్ క్రెడిల్ చేసింది.

"ఎందుకమ్మా ఫోను పెట్టేశావు—నీవు సంభాషణని పొడిగించు అతను ఏ ఫోను నుంచి మాట్లాడుతున్నాడో మనకి తెలిసిపోతుంది నీతో మాట్లాడుతూ వుండగానే వెళ్ళి రెడ్ హేండెడ్‌గా పట్టుకునేవాళ్ళం—" ఇన్‌స్పెక్టర్ జిగురునాదం అన్నాడు

సమాధానంగా పావని మరొక్కమారు భోరుమన్నది.

పావనికి ఏ నెంబరు నుంచి ఫోను చేశారో పోలీసులకు తెలిసింది అయితే అది పబ్లిక్ బూత్ ఫోన్ నెంబరు!

ఫోన్ ట్యాపింగ్ ప్రయత్నం విఫలమయింది, పావనికో-అపరేట్ చేయడం లేదు. తదుపరి కర్తవ్యం ఏమిటి? అని జుత్తు పీక్కుంటూ వుండగా ఆ మెసేజ్ వచ్చింది. ఒక అపరిచిత వ్యక్తి హీరోహోండా మీద ఆ ఇంటిచుట్టూ చక్కెర్లు కొడుతున్నాడని ఆ మెసేజ్ సారాంశం.

"వాడ్ని పట్టుకుని స్టేషనుకి తీసికెళ్ళండి" జిగురునాధం హుకుం జారీచేశాడు.

మోటార్ సైకిల్‌మీద ఆ ఇంటిచుట్టూ ప్రదక్షిణం చేస్తున్న ఆ కుర్రవాడి పేరు దామోదర్-పావని బోయ్ ఫ్రెండ్!

ఆ రోజు పావని కలవకపోవడం, ఫోన్ చేస్తే ఆమె తండ్రి మాట్లాడడం, మళ్ళీ ఫోన్‌చేస్తే-తన గొంతు విని పావని ఫోన్ పెట్టేయడంతో బెంబేలెత్తిన దామోదర్ ఆ ఇంటి చుట్టూ రెండుసార్లు తిరిగాడు. దానికితోడు క్లాత్ స్టోర్సులో క్యాషియర్‌గా పనిచేస్తున్న తన ఫ్రెండ్



కనిపించక పోవడంతో మనసంతా తిక్క తిక్కగా వుంది. ధ్యేయం లేకుండా తిరగసాగాడు. అలా పరాకుగా సందులు గొందులు కూడా తిరుగుతున్న దామోదర్ రోడ్డుకి అడ్డంగా ఆగివున్న మోటార్ సైకిల్ చూసి తన బైక్ స్లో చేశాడు. ఆగివున్న బైక్‌మీద చిద్విలాసంగా పడుకుని వున్న థర్డ్ ఇయర్ డిగ్రీ స్టూడెంట్ వంశీ ఈల వేసుకుంటూ లేచాడు

"హలో రోమియో, ఏమంటుంది నీ జూలియట్—" అనడిగాడు చిద్విలాసంగా.

"షటప్—" అసలే చిరాకుగా వున్న దామోదర్ మరింతగా ఇరిటేట్ అయ్యాడు.

ఆ పని చేసేది నేను కాదు, పోలీసులు ఇప్పటికి ఒక అంకం పూర్తయింది. నీ గర్ల్ ఫ్రెండ్—అదే పావని—కాలేజీకి అని బయల్దేరి నీతో పార్కుల్లో, తోటల్లో, హోటల్సులో డ్యూయెట్స్ పాడదిక-వాళ్ళ బాబు ఇంట్లో నుంచి బయటకు రానివ్వడు, నీవు ఫోనుచేస్తే నీ గర్ల్ ఫ్రెండ్ మాట్లాడదు. మీ ఇద్దరికీ మధ్య సంధానకర్తగా వ్యవహరించే క్లాత్ స్టోర్స్ క్యాషియర్ ప్రస్తుతం పోలీసుల కస్టడీలో వున్నాడు. ఇప్పటి వరకూ మోకాలి చిప్పలు మాత్రమే పగిలాయి. నీవు ఆ వైపు వెడితే నీ గతీ అంతే— అన్నట్టు అసలు విషయం గుర్తుందా? రెండ్రోజుల క్రితం నీ గర్ల్‌ఫ్రెండ్‌ని—అదే పావనిని మా ప్రభాకర్ ఏదో కామెంట్ చేశాడని వాడి కాలరు పట్టుకున్నావు దానికి చిన్న పనిష్మెంట్ యిది. మేమూ పెద్దగా చేసిందేమీ లేదు-కాలేజీకి బయల్దేరిన నీ గర్ల్ ఫ్రెండ్ తిన్నగా కాలేజీకి రాదు, మీరిద్దరూ ఎక్కడికో వెళ్ళిపోతారు కాలేజీ వదిలే సమయానికి బుద్ధిమంతురాలిలాగా యింటికి తిరిగి వస్తుంది ఇది తిరుగులేని సత్యం ఈ సమయంలో పావని బాబుకి ఓ ఫోను కొట్టాం. నీ కూతుర్ని కిడ్నాప్‌చేసి-లక్ష రూపాయలు తీసుకొచ్చి క్లాత్ స్టోర్స్ లోని క్యాషియర్‌కి యివ్వు లేదా మీ అమ్మాయిని రేప్ చేస్తాం—అని

దాంతో బెంబేలుపడిన సుబ్రహ్మణ్యం పోలీసులకి కంప్లెయింట్ యిచ్చాడు. ఇప్పుడు ఆ యింటి పరిసరాలన్నీ మఫ్టీలోని పోలీసులతో నిండిపోయింది. ఆ వైపు తొంగి చూశావో కీళ్ళు తొలగిపోతాయి జాగ్రత్త—

"బైదిబై నా పేరు వంశీ. నాతోగానీ, నా డింగ్'డాంగ్స్‌తోగానీ పెట్టుకోకు. ఇది శాంపుల్ డోస్ మాత్రమే, ఈతఫా ఇచ్చే డోసు చాలా సీరియస్‌గా వుంటుంది"

దామోదర్‌కి ఆ తర్వాత ఏమీ వినిపించలేదు. మఫ్టీలో వున్న వారంతా పోలీసుల వలెనే కనిపించసాగారు. పోలీసుల తుపాకీ గుండుకి కూడా దొరకనంత వేగంగా కదిలాడు

"కంగ్రాట్స్ గురూ....నా కాలరు పట్టుకున్నందుకు వాడికి ఇంత పెద్ద శిక్ష. అదీ రెండు ఫోన్ కాల్స్‌తో-" అన్నాడు ప్రభాకర్.

"లెటజ్ సెలబ్రేట్ ద అకేషన్-" అన్నాడు శ్రీనివాస్.

"బై ఆల్ మీన్స్" అంటూ దగ్గర్లోనే-కాలేజ్ మెయిన్ గేటుకి ఎదురుగా వున్న హోటల్ వైపు దారితీశారు.

ఎవరి అభిరుచిమేరకు వారు మెనూ ఆర్డర్ చేశారు.

ఆర్డర్‌కి సర్వీసుకి మధ్యనున్న సమయంలో జరిగిందది.

కాలేజీ ఎంట్రన్స్ గేటు దగ్గర జరిగింది.

తలతిప్పిన వంశీ ఆ వైపే చూస్తూండిపోయాడు.

వంశీ దృష్టి ఎటువైపు నిలిచివుందో ఆ వైపే మిగిలినవారి దృష్టి మళ్ళింది.

రిక్షావాడితో దెబ్బలాడుతోంది ఆమె!

వారు చూస్తున్నది ఆమె దెబ్బలాడుతున్న తీరు కాదు- ఆమె నిల్చున్న తీరు!

ఆమె నిల్చున్న తీరులో ఒక గ్రేస్ వుంది; ఆమె ముఖంలో వెర్సటాలిటీ ద్యోతకమవుతోంది.



"గురూ డింగ్ డాంగ్...." అన్నాడు ప్రభాకర్ వంశీని ఉద్దేశించి.

"ఈ డింగ్ డాంగ్ కొత్త ఎంట్రీ గురూ...." అన్నాడు చిదంబరం.

"డింగ్ డాంగ్ కాదు గురూ, కింగ్ కాంగ్... కాలేజీ గేటులోకి అడుగుపెడుతూనే గొడవ పెట్టుకుంది...." సన్నాయి నొక్కులు నొక్కాడు శ్రీనివాస్

"బుసకొట్టడం పాము నైజం; కుసకుసలాడటం ఆడ లక్షణం. కస్ బుస్ మనే పాముని పట్టి బుట్టలో వేయడం ఈ వంశీ హాబీ.... చూద్దాం, ఇప్పుడేగా మన గ్రౌండులోకి అడుగుపెట్టింది' చిద్విలాసంగా అన్నాడు వంశీ.

ఆమె- గాయత్రి.

న్యూ అడ్మిషన్ అని తెలుసుగాని ఆమె పేరు 'గాయత్రి' అని వారికి ఇంకా తెలీదు.

* * * *

అహిమహోహోరము :

జలధి వేలాదర్శనుకు, కుతూహలి, ఉత్సుకడు విలయాభ్రాభముడై వున్నాడు.

రక్త వస్త్రములు ధరించిన కంచుకివలె ముంగిస చర్మంపై కూర్మాసనంలో వున్నాడు.

అతడి ఎదురుగా పులి ముగ్గు- ఆ ముగ్గుకి ఉత్తర వాయువ్యాన చర్మం చితికి నెత్తురు ధారాపాతంగా ప్రవహిస్తున్న కోడిపుంజు గిలగిలలాడుతోంది. ముగ్గు మధ్యలో కాల్చని మట్టిమూకుడు; నిండుగా నూనె!

రుధిరంతో దాహం తీరిన కంచుకివలె నూనెలోని నిండు చందమామను చూస్తున్నాడు. అతడి కళ్ళలో ఆశ్చర్యం-ఉత్సాహం—సంతోషం ఒక్కసారిగా ముప్పిరిగొన్నాయి.

మధుపములంటని- కేసరములు చెదరని- ఎండచే వాడని- మంచుచే బిరుసెక్కని పూజాపుష్పంవలెనున్న ఆమెని చూడగానే అతడి అన్వేషణకు గండిపడింది; గుండె పొంగింది. నిశ్శబ్ద గాంభీర్యం చెదిరింది.

అతడు చూస్తున్న ఆమె స్వర లక్షణ లక్షిత మాత్రమే కాదు, సర్వ లక్షణ లక్షిత కూడా!

అతడు నూనెలో ఆమె ఛాయను చూస్తున్నాడు.

ఆమె గాయత్రి

ఒక చిన్న మెరుపు ఆకాశంలో; అతడి కళ్ళలో!

—వంశీకి ఆ క్షణాన తెలియదు; ఒక అఘోరశ్రీ దృష్టి ఆమెపై వాలిందని. ఆమె జీవితం రుద్ర భూమికి అంకితం కాబోతూందని!

మేధావులలో మేధావి-
అల్లరిలో చిల్లరవాడు-
చిన్న విషయాన్నయినా పెద్దగా ఆలోచించే వంశీ-
వామాచార ఘనాపాటి అఘోరశ్రీ-
ఇద్దరి దృష్టి ఏకకాలంలో ఆమెపై మరలడం యాదృచ్ఛికం!

# 6

కాలేజీ గేటులోకి అడుగు పెడుతూనే అందరి చూపులూ తనవైపు ఆకట్టేసుకోగల ఓ విధమైన అమాయకత్వంతో కూడిన అందం ఆమెది.

పెదవి విరుపులో నిర్లక్ష్యం, కనుబొమలలో ముడుచుకున్న కోపం ఆమె అందాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

ఆమె పోట్లాడుతున్న తీరులో కూడా. ఒక రకమైన ఆకర్షణ వుంది.



ఆమెనే చూస్తున్న ప్రభాకర్ వెన్నెముకమీద 'థ్రిల్' అనేది జర జరా పాకింది. ఏదో తొట్రుపాటు తుళ్ళిపడుతూ!

చిదంబరం అయితే ఏదో ట్రాన్స్‌లో వున్నట్లు అటువైపే చూస్తున్నాడు

శరీరమంతా మధురమైన కంపనాలు, అంతవరకు అనుభవించని ఫీలింగ్ మత్తుగా, గమ్మత్తుగా!

గోదావరి రెండు పాయలుగా చీలుతున్నచోట చూడటానికి ఎంత ముచ్చటగా వుంటుందో అంత ముచ్చటా ఆమెలో కనిపిస్తోంది ఎక్కడో గుండెల్లో సన్నగా ప్రారంభమైన చిన్న కదలిక ప్రతి అవయవానికి పాకి ఉత్తుంగ తరంగమై ఊపేసింది. ఏదో ఆకర్షణ పరిమళంలా చుట్టుముట్టేసింది.

అయితే అటువంటి భావమేదీ దగ్గరకు రానివ్వనిది వంశీ ఒక్కడే! తన కళ్ళముందు అందంగా కదలాడుతున్న ఆ మెరుపు తీగని చూడటం లేదతడు రోషంతో ఎర్రబడిన ఆమె ముక్కుని చూస్తున్నాడు. ఆ ముక్కు వరకు జారిన ముంగురులను చూస్తున్నాడు. ఆమె విల్చున్న తీరులోని గ్రేస్‌ని గమనిస్తున్నాడు అంతకుమించి, ఆమె ముక్కు కొస నుంచి జారిన చెమటచుక్క మెడమీద నుంచి గుండెల మధ్యకు జారుతున్న వైనాన్ని చూస్తున్నాడు

వంశీ-
ప్రభాకర్-
చిదంబరం-
శ్రీనివాస్-
భరణి—

పంచపాండవులవలె కలిసి వుంటారు. క్లాసులోను, బయట వీరు చేసే అల్లరి అంతా ఇంతా కాదు వీరు టీజ్ చేయని అమ్మాయి వుండదు. ఆ టీజింగ్‌లో కూడా అందం వుంటుంది. ఆ అమ్మాయి ఆ కామెంట్స్‌ని

కాంప్లిమెంట్స్‌గా తీసుకుంటుందేగాని, అఫెండ్ కాదు! అద్దంముందు కూర్చుని వారి కామెంట్స్ ఎంతవరకు నిజమో- తనలో తనకు తెలియని అందాలను అతడెంతవరకు చూపించాడో నిశితంగా గమనించడం కద్దు.

కంప్యూటర్ కన్నా వేగంగా ప్రోగ్రామింగ్ ఇచ్చాడు వంశీ.

రోబట్ కదిలింది ఆ రోబట్ పేరు ప్రభాకర్.

మరో పది నిముషాలలో కొంత ఇన్‌ఫర్‌మేషన్ తీసుకొచ్చాడు. ఆమె బి.ఎ. సెకండ్ ఇయర్ స్టూడెంట్- పేరు గాయత్రి.

క్లాసులు ప్రారంభ సూచకంగా బెల్స్ మోగాయి. పంచపాండవులు బయల్దేరారు. తిన్నగా బి.ఎ. సెకండ్ ఇయర్ క్లాసుకి వెళ్ళారు ఆ క్లాసు మెట్టా వెంకటేశ్వరరావుగారిది. ఆయనకు నాటకానుభవంకూడా వుంది. పద్యం చదవడంలో ఆయనకు ఆయనే సాటి.

ఆయన పాఠం చెబుతున్నారు అప్పుడు కిటికి దగ్గరకు చేరారు పంచపాండవులు. వారు వస్తే చాలు, ఏదో సందడి మొదలవడం సర్వసాధారణం. ఏం జరుగబోతూందోనని ఉత్సుకతతో ఎదురుచూడసాగారు మిగతా స్టూడెంట్స్. ఇవేమీ తెలియని గాయత్రి మాస్టారివైపు దృష్టి నిలిపింది. అంతలో 'కావు కావు'మన్న అరుపులు వినిపించాయి.

మెట్టావారు తమ సర్వీసులో ఇటువంటివి ఎన్నో చవిచూశారు. ఇనుమును కాల్చి కొడితే వంగమన్నట్టు వంగుతుందన్న విషయం ఆయనకు బాగా తెలుసు.

చెబుతున్న పాఠం ఆపారు "నాలుగు కాకులు కలిసి అరుస్తున్నాయంటే...." అంటూ ఆయన ఏదో చెప్పబోతుండగా, "నాలుగు కాదండీ, అయిదు...." అన్నది ఆఖరి బెంచీలోని అమ్మాయి.

"ఆ.... ఆ.... కాకుల్ని లెక్కెట్టడమే పనిగా పెట్టుకున్న ఓ అమ్మాయీ నీ మాటే నిజమనుకుందాం.... కాకులు కలిసి అరుస్తున్నాయంటే వాటిలో ఒక కాకి చచ్చి వుండాలి. అయిదు కాకుల్లో ఒక కాకి



చస్తే మిగిలేవి నాలుగు కాకులే గదా.... ఎవరయినా పిండం వేస్తారేమోనని గొడవ పెడుతున్నట్లున్నాయి.... క్యారేజీ తెచ్చుకున్న వాళ్ళలో ఎవరయినా మూడు ముద్దలు కిటికీలో నుంచి బయటకు విసిరేయండి. కాకులు లేచిపోతాయి...." అనేసరికి క్లాసులోని అమ్మాయిలంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు.

మాష్టరు ఇచ్చిన రిటార్టుకి కౌంటర్ వేయడంలో మునిగిపోయాడు వంశీ.

మెట్టావారు మళ్ళీ పద్యం అందుకున్నారు.

ఈ టీజింగ్ డ్రామాలో ఎప్పుడూ మెట్టావారిదే పైచేయి. ఆయన తన సర్వీసులో ఎందర్ని చూసివుంటారో.... కాలేజీ ఆవరణలోకి అడుగుపెట్టిన ప్రతి స్టూడెంటూ హీరోలా గొడవ మొదలెడతాడు. వాడి బాబు కూడా అదే కాలేజీలో చదివాడని, వాడి బాబు కూడా అలాగే గొడవ చేశాడని.... ఈ మాష్టారే అప్పుడూ వున్నారని మర్చిపోతాడు



అప్పుడు ఆరంభమయ్యాయి కుక్కల అరుపులు!

విషయాన్ని అర్థం చేసుకున్న మాష్టారు తన ఆయుధాన్ని బయటకు తీశారు.

"కాకులు పిండంతో తృప్తిపడ్డాయి, వెళ్ళిపోయాయి.. ఇప్పుడు కుక్కలు కూడా కాలేజీలోకి అడుగుపెట్టాయి కుక్కల్ని చులకనగా చూడకండి. షిరిడీ సాయికి కుక్కలంటే చాలా అభిమానం దత్తాత్రేయుడు నాలుగు వేదాల్ని నాలుగు కుక్కల రూపంలో చేరదీశాడు. ఇప్పుడు మన పద్య పఠనాన్ని ఆస్వాదించటానికి వచ్చిన ఆ కుక్కలు ఏ వర్గానికి చెందినవో చూద్దాం" అని మాస్టారు అనగానే క్లాసులో నవ్వులు గవ్వల గలగలింపులై మ్రోగాయి.

ఆ నవ్వుల నేపథ్యంలో ఒక అమ్మాయి అడిగింది- "మాస్టారూ! కొంతమంది అకారణంగా కుక్కల్లా మాటలతో రక్కుతారు, పిల్లిలా గొణుగుతుంటారు. కారణమేమిటి?"

"అది పూర్వజన్మ ప్రభావం— గత జన్మలో కుక్క, పాము, పిల్లి అయినవారు ఈ జన్మలో కూడా గతజన్మ వాసన విడిచిపెట్టలేక అకారణంగా మొరగడం, బుసకొట్టడం, అరవడం చేస్తుంటారు...." అని చెప్పిన మాస్టారు రహస్యం చెప్పినట్లు చెప్పసాగారు-"మీకు ఒక విషయం చెబుతాను జాగ్రత్తగా గమనించండి. కొన్ని పశువులు కొన్ని రంగులు చూస్తే రెచ్చిపోతాయి, బెదురుతాయి. అలాగే రోడ్ మీద కలర్‌ఫుల్‌గా కన్పించే కాలేజీగర్ల్స్‌ని చూడగానే కొంతమంది అబ్బాయిలు రెచ్చిపోతారు ఆ రెచ్చిపోవడమన్నది పశువు లక్షణం"

క్లాసు రూం కరతాళ ధ్వనులతో దద్దరిల్లింది.

క్లాసు బయట వున్న అబ్బాయిల ముఖాల్లోనే కాదు, క్లాసురూములోని అబ్బాయిల ముఖాల్లో కూడా కత్తి వేటుకు నెత్తురు చుక్క లేదు!

బంతిని ఎంత బలంగా గోడకి గురిచూసి కొడితే అంత వేగంతో వెనుదిరిగి వస్తుంది. ఇప్పుడు జరిగిందీ అదే!

నవ్వులపాలయిన వంశీ అదే కాలేజీ ఆవరణలో పువ్వులు పరవటానికి సరికొత్త ప్లాను వేశాడు.

* * * *

ప్రథమ యామం గడిచిపోయింది. ద్వితీయ యామం ముగియడానికి సిద్ధంగా వుంది ఆకాశాన విహరిస్తున రతిరాజు రారాజు గుండెలు గుబిల్లుమన్నట్లున్నాయి.

తటాలున నీలి మేఘం ముసుగేసుకుని గప్‌చుప్‌గా దాక్కున్నాడు

సరిగ్గా ఆదే సమయాన ఓ అరడుగుల ఎత్తు వ్యక్తి ఊరికి దక్షిణం వేపు వెళుతున్నాడు.

ఆ మనిషి ఓ అగ్ని, అతడి నిశిత వీక్షణలు ముక్కంటి మూడవ నేత్రం నుండి వెలువడే అగ్నిజ్వాలలను పోలివున్నాయి.





అతడి ముఖంలో అనన్య సాధారణ బ్రహ్మవర్చస్సు- అనంత శేముషీ సంపద!

కృతాంతుడి పాశంలా అతడి భుజం మీదగా జీరాడుతున్న తాడు- ఆ తాడు చివర గంట!

అతడు అడుగు తీసి అడుగేస్తున్నప్పుడల్లా ఆ గంట అతడి చీలమండలకు తగిలి శబ్దిస్తోంది.

అతడు వెనుదిరిగి చూడటంలేదు. తన గమ్యానికి లక్ష్యం తెల్సు, తన గమ్యం తెలుసు.

అతడి ఒంటినిండా బట్టలే. చంకకు జోలె- ఆ జోలెలో భస్మం, ఇతర పూజా సామాగ్రి.

ఆ గంటానాదానికి ఊరకుక్కలు ఒక్కటయి మొరుగుతూ పరుగెత్తుకొస్తున్నాయి.

తాటితోపులో గాలి ఈలలు ఆ నిశీధిలో ప్రేతాత్మల గుసగుసల్లా వినిపిస్తున్నాయి.

ఎత్తయిన చెట్లు ఆకాశాన్ని ఆలింగనం చేసుకుంటున్నాయి. మబ్బు తునకల్ని ముద్దాడుతున్నాయి.

ఆ చెట్ల మధ్య బతుకు అర్థాన్ని బహిరంగపరిచే బాట- ముందుకు జెర్రిలా పొడవుగా సాగిపోతోంది.

రుద్రభూమికి దారితీస్తున్న కాలిబాట!!

అర్థరాత్రి, దుర్గమ్మ మెడలో హారములమరే వేళ అది!

నక్కల ఊలల నేపథ్య సంగీతంలో కాలరుద్రుని కరాళనృత్యం పతాక స్థాయికి చేరుకుంది

అతడి భుజం నుంచి వ్రేలాడుతున్న తాడు చివరనున్న గంట చీలమండలను తాకి శబ్దిస్తోంది, ఆ శబ్దానికి చెవులపిల్లి ఒకటి చెంగున పక్కనున్న ముళ్ళపొదలోకి దూకింది. తెల్లగా, మెత్తగా బొచ్చుతో నిండిన ఆ చర్మం ముళ్ళు గుచ్చుకుని ఎర్రగా మారింది.

అతడిదేమీ గమనించే స్థితిలో లేడు.

నిండయిన విగ్రహం- ఆరడుగుల ఎత్తులో బొద్దుగా!

వెడల్పయిన ముఖం- ఆకాశ మండపంలా కళ్ళు-కాటుక దిద్దినట్లు మిల మిల మెరుస్తున్నాయి.

ఎటు చూసినా భీతావహమైన వాతావరణం, ఒడలు జలదరింపజేసే పరిసరాలు.

ఎక్కుబెట్టి విడిచిన బాణంలా రుద్రభూమికి చేరాడు.

వేదంలా ప్రవహిస్తున్నది నది

ఆ రుద్రభూమి పూరికి ఆగ్నేయాన, నదీ తీరాన వుంది

అతడు తన చంకన ఉన్న జోలె తీసి ఒడ్డున ఉంచాడు. ఒంటిపై నున్న వలువలు కుప్పగా పోసాడు. బోదెలోకి దిగాడు.

అతడి దారికి అడ్డంగా- కాలనాగు- బుస కొడుతోంది. పడగ విప్పిన తీరు, గొస పెడుతున్నట్టు బుస కొడుతున్న వైనం చూస్తే పని గట్టుకుని, పగబట్టి వచ్చినట్లుంది.

అతడి అడుగుల వేగం తగ్గలేదు, దిశా మారలేదు.

మనిషి దగ్గరవుతున్న కొద్దీ ఆ నాగు పడగ మరింత విస్తృత మైంది. బుస్సున గాల్లోకి లేచింది.

అప్పుడు జరిగిందీ విచిత్రం- కాటేయడానికి ముందుకు రావలసిన ఆ పాము, ఎవరో వెనక్కి నెట్టినట్టు దబ్బున వెల్లకిలా పడింది.

అతడు ఇది కూడా గమనించనట్లు తిన్నగా నదిని సమీపించాడు.

అప్పుడు గాని అతడు చైతన్యంలోకి రాలేదు.

సుడులు తిరుగుతూ ప్రవహిస్తున్న ఆ తల్లికి వంగి ప్రణామం చేసాడు.

తర్వాత గురువును తలుచుకున్నాడు. మంత్రాన్ని పఠిస్తూ నెమ్మదిగా కుడికాలు నీటిలో పెట్టాడు. తర్వాత ఎడమకాలు.



ఆ స్పర్శతో అతడి నేత్రాలు విస్ఫులింగాలయ్యాయి. మనసు భక్తి భావంతో నిండింది.

నదిలోకి దిగిన తర్వాత నిర్ణీత వ్యవధిలో మంత్ర పఠనం ముగియాలి. నది నుంచి బయటకు రావాలి. అక్కడ్నించి తిన్నగా స్మశానాన్ని చేరుకున్నాడు తన సరంజామాతో. శవాలను కాల్చగా మిగిలిన కట్టె పుల్లలు, బొగ్గులు ఒక చోట చేర్చి నిప్పు చేశాడు.

ప్రకృతి ఒక మహాశక్తి.

అధ్యయనం చేస్తే ఆ శక్తి అర్థమవుతుంది.

సాధన చేస్తే ఆ శక్తి అర్థమవుతుంది.

సాధన చేస్తే ఆ శక్తి వశమవుతుంది!

ఆ సాధనను ఉపాసన అన్నారు పెద్దలు.

అతడి శరీరం నిండా విభూతి రేఖలు—నొసట విభూతి రేఖల నడుమ అగ్నిబింబంలా పెద్ద కుంకుమ బొట్టు- అతడి ముందు ఇసుకలో గీసిన గీతలు- ఆ ముగ్గుమీద పసుపు, కుంకుమ-

పద్మాసనం వేసుకుని కళ్ళు మూసుకుని ధ్యాన ముద్రలో వున్నాడతడు.

మనసు అందర్నీ జయిస్తుంది.

కానీ మనసుని అతడు జయించాడు

కాయకల్పం పొందాడు

"శరీరేణ జితా స్సర్వే శరీరం యోగిభర్జితం"

లౌకిక, పరలౌకిక విద్యల లక్ష్యం-సమాధి స్థితిని పొందడమే!

అతడు పరమావధి సమాధి స్థితిని పొందిన జితేంద్రుడు.

నిర్ణీత వ్యవధిలో అతడి ధ్యానం ముగిసింది. వెనుదిరిగి చూడకుండా స్మశానం నుంచి ఊరివైపు బయల్దేరాడు. ఊరుని సమీపించగానే తృటికాలంపాటు ఆగాడు. కళ్ళు మూసుకుని ధ్యానించాడు

అతడు ఒకో రోజున- ఊళ్ళో- ఒక వీధి తిరుగుతాడు.

ఇంటింటి ముందూ ఆగుతాడు. ఆ ఇంటి వారికి జరగబోయే శుభ అశుభకార్యాలు-వారు నిర్వహించవలసిన పూజ పునస్కారాలు, వస్త్ర ధారణ వగైరా వగైరా సూచనలన్నీ చేస్తుంటాడు.

సుషుప్తికి, జాగ్రదవస్థకు మధ్య నున్న సంధికాలం అది.

వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి.

వీధి కుక్కలు మాత్రం గొడవ చేయకుండా అతడు చెబుతున్న కాలజ్ఞానాన్ని శ్రద్ధగా ఆలకిస్తున్నాయి.

దత్తాత్రేయుని పాదాల చెంతనున్న నాలుగు కుక్కలు-

షిరిడీ సాయి చేరదీసినవి ఊరకుక్కలు-

అతడి వెంటా అవే కుక్కలు!

ఎడమ చేతిలో శంఖం, కుడిచేతిలో ఢమరుకం!

-ప్రతి ఇంటి ముందూ ఆగి శంఖానాదం చేస్తున్నాడు. ఢమరుక నాద నేపథ్యంలో తాను చెప్పవలసింది చెబుతున్నాడు.

ఇక్కడ మూడు విశేషాలున్నాయి.

అతడు భిక్షపతి సేవకుడే గాని యాచకుడు కాదు

గ్రామ దేవతల కొలుపులు రెండు నెలల్లో ప్రారంభమవుతాయనగా అతడు ఆ ఊళ్ళో కనిపిస్తాడు. ఒక్కోరోజున- ఊళ్ళో ఒక దిశన వెళతాడు.

ఏ ఇంటి వారి జాతకం ఆ ఇంటి ముందు చెబుతాడు. పక్క ఇంటి వారి ముందు కూడా చెబుతున్నట్టు ఇరుగు పొరుగుకి తెలుస్తుంది గాని, విషయం అర్థం కాదు. కోడి నిద్రలో నున్న ఆ ఇంటి యజమానికి అతడు చెబుతున్నది అతి స్పష్టంగా అర్థమవుతుంది.

పైసా ఖర్చు పెట్టకుండా, ప్రయాస పడకుండా మన ఇంటి ముందర నిలబడి- మనల్ని నిద్ర మేల్కొలిపి-మన కుటుంబ భవిష్యత్ చిత్రపటాన్ని, ఆ సంవత్సరానికి మన ముందుంచే ఆ సిద్ధుడు-

బుడబుక్కలవాడు.





దేవరా, అనుకోరా-

నైరుతి దిశన పీడ ప్రారంభమయిందిరా. ధ్వజ స్తంభం మీద గరుడుడు ఎగిరేవరకు కూతుర్ని కాచుకోరా....

ఇది పశుపతి ఆనరా...

ఆ బుడబుక్కలవాని మాటల్లో వినిపించిన అపశృతి ఆ యజమానిని కలవరపరిచింది. మనసు అట్టడుగు పొరల్లోని రాగబంధం కలుషితమయింది. కన్నపేగు కదిలింది.

వెన్నులో నుంచి వణుకు తన్నుకొచ్చింది.

"దేవరా...." గావుకేక పెట్టబోయాడు. ఏ స్మృతి కలశం గొంతుకి అడ్డం పడిందో, ఆ కేక గొంతులోనే ఆగిపోయింది.

అప్పుడు వినిపించింది భైరవుని మొరాయింపు,

-సాధారణంగా బుడబుక్కలవాని ఢమరుకం మోగితే ఏ కుక్కా మొరగదు. శంఖం ఊదాడంటే రానున్న ప్రమాద హెచ్చరిక!

-ఇందుకు భిన్నంగా కుక్క అరుపు.

ఆ ఇంటి యజమాని ఒళ్ళు జలదరించింది.

గ్రామ దేవతకు ప్రాణిని బలి ఇవ్వబోయే ముందు సాంబ్రాణి పొగవేసి వేపాకుతో పసుపు నీళ్ళు జిలకరిస్తే ఆ ప్రాణి ఒడలు ఇలాగే జలదరిస్తుంది.

అతడికి అపశకునం అయిదు రంగులలో కనిపించింది.

ఇంద్రియములకు వశపడిన 'పశుత్వము'.

ఇంద్రియముల వశములో నుంచిన 'పశుపతి తత్వము' సిద్ధించును.

ఆ ఇంటి యజమాని కుమార్తె-గాయత్రి.

* * * *

కళ్ళు మూసుకున్నా, తెరుచుకున్నా అదే రూపం!

-అది కామరూపమని సుకుమార్‌కి తెలియదు.

-తెలిస్తే ఇంతగా తెగించేవాడు కాదు.

ప్రాచీనులు లోకకళ్యాణం కోసమే ఉపాసించారు. తమ విద్యలను అంకితం చేశారు. ఉపాసనలో ఎన్నో త్యాగాలు చేశారు- అన్న నిజమూ తెలియదు.

రవిచంద్రుల దివారాత్రుల దోబూచులాటలో చంద్రుడు గ్రీన్ రూమ్‌లోకి జారబడుతున్నాడు. రవి రంగస్థలం మీదకి రావడానికి సిద్ధంగా వున్నాడు.

వీణమీద వేదాలు పలికిస్తున్నట్టుగా ఎవరో తనని పేరు పెట్టి పిలిచినట్లుంది.

ఆ మధురస్వరం తాకిడికి తట్టుకోలేకపోతున్నాడు.

ఎవరో హిప్నోటైజ్ చేసినట్టు నడుస్తున్నాడు.

ఎక్కడికి వెళుతున్నాడో అతడికే అర్థం కావడంలేదు.

ఆ స్వరం ఎవరిదో అర్థం కావడంలేదు.

-చివరకు తానెక్కడున్నాడో కూడా అతడికి అవగతం కాలేదు.

-ఓ వ్యక్తి ఆకాశం వేపు దృష్టి సారించి, చేతులు రెండూ సాచి ఎవర్నో ఆదేశిస్తున్నారు.

ఆ ఆదేశం శాంతిసూక్తాన్ని పోలివుంది.

పొడవుగా పెరిగిన తెల్లని గడ్డం, గుబురు మీసాలు.

గోచీ పెట్టుకుని వున్నాడు.

అక్కడ అతడొక్కడే కాదు, దాదాపుగా మరో పాతికమంది వున్నారు. వారంతా ఆయనవేపే చూస్తున్నారు. వారికి తెలుసు-ఆయన ఎవర్ని ఆదేశిస్తున్నారో?

ఆయన ఆదేశం/అనుమతి లేనిదే ఆ ప్రాంతానికి పిట్ట కూడా రాలేదన్న నిజం కూడా వారికి తెలుసు.

సుకుమార్‌కి తెలియదు- తాను ఒక ముగ్గుమీద నిలబడివున్నానని....





ఆ ముదుసలిని గుర్తించిన సుకుమార్ కళ్ళు కలువలయ్యాయి ఆనందంతో.

సుకుమార్ కోసం ఆ ముసలి ఎంతగా పరితపిస్తున్నాడో, సుకుమార్ కూడా ఆ ముసలివానికోసం అంతగానే పరితపిస్తున్నాడు.

"ఎవరాయన...." పక్కనున్న వ్యక్తిని ప్రశ్నించాడు సుకుమార్.

"ఆ మహర్షి....అఘోరశ్రీ....ఆచార్య కాలనేమి....ఆయన అనుమతి లేకుండా ఇక్కడున్న వారిలో ఏ ఒక్కరూ ఈ ప్రాంతంలో పాదం మోపలేరు.

"యోగశాస్త్రానికి సంబంధించిన ఇరవై రెండు ఉపనిషత్తులలో ఆయన ఘనాపాటి. సమాధి పొందే అర్హత రావాలంటే ఈ ఇరవై రెండు ఉపనిషత్తుల్ల సాధన వలన సమకూరే శక్తుల్ని లక్ష్యపెట్టకుండా ముందుకు సాగాలి. ఆచార్యులవారు మరొక్క స్థాయిని అందుకుంటే అవధూతగా మిగిలిపోతారు. "ఆత్మయాత్ర'తో ఆత్మపై అదనపు భారం లేకుండా తాను భూమిపై పడిన తర్వాత నేర్చుకున్న విద్యలన్నిటినీ ధారబోస్తున్నారు...."

"అవధూత అంటే...."

"జీవన్మరణాలకు, సుఖ దుఃఖాలకు అతీతమైన స్థితి....పరమాత్మ స్థాయీ భూతం—"

"అది సాధ్యమా?"

"ఖచ్చితమైన యోగాభ్యాసం అలవాటు చేసుకుని, యమ నియమాలను- ఆసన- ప్రాణాయామ- ప్రత్యాహారాలను; ధ్యానస్మరణ సమాధులనూ పొందగలిగితే ముందు కోరికలను జయించిన వాళ్ళమవుతాం."

"ఆ ముసలాయన...."

"ఆనకు, ఆయన అఘోరశ్రీ- ఆచార్య కాలనేమి"

"అదేలే, ఆచార్యులవారు ఎంతకాలం నుంచి ఈ నిష్టలు పాటిస్తున్నారు?"

"ఇదే విషయమై నేనూ మాగురువుగార్ని ఏభై ఏళ్ళక్రితం ప్రశ్నించాను. ఆయన ఓ డెబ్బై సంవత్సరాల నుంచి తాను ఆచార్యులవారికి సేవలు చేసుకుంటున్నానని సెలవిచ్చారు...."

"అంటే దాదాపుగా రెండు వందల ఏళ్ళుండవచ్చు...."

"బ్రహ్మముహూర్తంలో ఆయన నీటి అడుగున నిలబడి జపం చేసుకుంటారు. అప్పుడు చూస్తే అర్థమవుతుంది, ఆయన వయసు 200 ఏళ్ళకు తక్కువ వుండదని...."

అయ్యబాబోయ్, రెండు వందల ఏళ్ళ నుంచి ఏ సుఖమూ లేకుండా నీళ్ళలో నిల్చొని, అగ్నిమీద కూర్చొని, గాజు పెంకులమీద పడుకుని తపసు చేస్తున్నాడట... ఇంకా ఆయన సాధించవలసింది వుందట.... అవధూత కావడానికి ఇంకెంత కాలం పడుతోందతుందో?

—ఈయనకే ఇంతకాలం పడితే నా పరిస్థితి ఏమిటి?

—ఇన్ని వందల సంవత్సరాలు తపస్సు చేస్తూ కూర్చుంటే జీవితాన్ని అనుభవించేది ఎప్పుడు?

—దీనికోసమా ఇంత పడిగాపులు గాసేది? ఇటువంటి బ్రతుకు కోసమేనా చావుని జయించేది?

—ఇలా పరిపరి విధాలుగా ఆలోచిస్తుండగా ఆచార్యులవారి ఆదేశం వచ్చింది

మారు మాటాడకుండా వెళ్ళాడు.

కొత్త మూకుడు— నిండా నువ్వుల నూనె— మధ్యలో అగ్గి!

ఆచార్యులవారు ఆదేశించినట్టు ఒంటిమీదున్న దుస్తులన్నీ తొలగించి నగ్నంగా తలారా స్నానించి, గోచిపెట్టుకుని ఆయన ముందుకొచ్చాడు సుకుమార్.

చేతిలోని దీపం మూకుడు సుకుమార్ చేతిలో వుంచాడు.



"కుమార్!"

నీకు మృత్యువు నుంచి రక్షణ కల్పిస్తున్నాను. అధిక బలాన్ని ప్రసాదిస్తూ మంత్రోపదేశం చేస్తున్నాను. అదిగో సూర్యోదయమవుతోంది. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు దీపం మీదుగా ఆ ప్రత్యక్ష నారాయణున్ని చూస్తూ జపం చెయ్యి. ఆ సూర్యభగవానుని దిశకనుకూలంగా నీవూ దిశ మార్చు—

దిశ మొలతో దిశ తిరుగుతూ ఈ జపం చేయాలి. సూర్యాస్తమయం లోపు చేతిలోని దీపాన్ని క్రింద పెట్టరాదు; జపం ఆపరాదు!

"ఓం ఖషొల్లాయ స్వాహా...."

—అని మూడుసార్లు మంత్రోపదేశంచేసి తర్పణం విడిచారు ఆచార్యులవారు.

సరిగ్గా ఆ సమయానికి సూర్యభగవానుడు తూర్పున ఉదయించాడు.

ఇసుకపై కాళ్ళకు చెప్పులైనా లేకుండా దిశ మొలతో నిలబడివున్న సుకుమార్ ఉదయకాలపు సూర్యుణ్ని దీపం మీదుగా చూస్తున్నాడు.

* * * *

"రేయ్ బావా, నాకివేళ ఎంత అవమానమయిందో తెలుసా? తల తీసేసినట్టయింది...." అన్నది కాలుమీద కాలేసుకుంటూ!

అలా కాలుమీద కాలేసుకుని కూర్చోవడంతో, లంగా బొందు క్రింద— బెత్తెడు దూరంలో త్రికోణం ఏర్పడింది.

ఆమె భుజం మీద నుంచి జారుతున్న పవిట—

కొద్దిగా పక్కకు తొలగి గోపుర కలశాల్ని గోచరింపజేస్తోంది.

ఆమె- చారుమతి- వంశీ మరదలు.

అదే కాలేజీలో డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతోంది.

"అవునురా బావా, నిన్న మెట్టా వెంకటేశ్వరరావుగారి నిండు క్లాసులో కామెంట్స్ అన్నింటినీ వింటూ కిక్కురుమనకుండా మిగిలి పోయావేంట్రా—" అన్నది.

వాస్తవానికి చారుమతి వంశీకన్నా చిన్నది. కాకపోతే ఆస్తిలో పెద్దది. అంతకుమించి చిన్నతనం నుంచీ కలిసి చదువుకున్నారు. వంశీ ఎంత అల్లరి వాడో, అంతకు డబుల్ అల్లరి చారుమతి.

"దే కెంగే.... కల్ దేకెంగే...." సాలోచనగా తలాడించాడు వంశీ.

అతడి ఉద్దేశం- మరుసటిరోజున గాయత్రి వ్యవహారం చూస్తానని

# 7

"రేయ్ బావా. మీ చెల్లాయి వస్తోందిరా—" బస్‌స్టాపులో పిట్ట గోడమీద కూర్చున్న జీన్స్ అబ్బాయి కంచు కంఠం ఖంగుమంది.



ఆ కంచు కంఠం చిదంబరానిది.

"అన్నా, మీ మరదలు ఈవేళ చీర కట్టుకుంటే చూడముచ్చగా వుంది గదూ" నాలుకతో పెదవులు తుడుపుకుంటూ అన్నాడు శ్రీనివాస్.

"పరాయి వాడి 'ఉడ్‌బి'ని కామెంట్ చేయడం— అదీ కాబోయే శ్రీవారి సమక్షంలో– సంస్కారం అనిపించుకోదురా" అన్నాడు "పొట్ల కాయ్" అనబడు బక్క ప్రసాద్.

"అలా గడ్డి పెట్టిరా బక్కోడా.... దానికి కాబోయే మొగుడ్ని నేనిక్కడ వుండగా మీరంతా నోటికొచ్చినట్టు వాగడం పద్ధతి కాదురా" మెత్తమెత్తగా చివాట్లు పెట్టాడు 'ఎర్రతేలు' అని ఆడపిల్లలు ముద్దుగా పిలుచుకునే ప్రభాకర్.

"రేయ్, మనమీద మనం జోక్స్ వేసుకుంటూ నవ్వడం కాదురా- ఈ పోరి కాలేజీలోకి అడుగుపెట్టి అప్పుడే రెండు రోజులయింది. ఇప్పటి



వరకూ ఆ పోరికి మన ఎగ్జిస్టెన్స్ తెలియనీయలేదు. అందుకు ఏడ్చు కోవాలిరా—" ముటముటలాడాడు వంశీ.

"నీవు బోణీ చేయకుండా మేము బెంకుజెల్ల తినిపించడం సభ్యత కాదని ఊరుకున్నాం గురూ.... లేక పోతేనా?" అన్నాడు ప్రభాకర్.

"కబుర్లకేంగాని, పదండిరా-" అంటూ అందర్నీ బయల్దేరదీశాడు

కాలేజీ ఎంట్రన్స్‌లో, ఆఫీసు దగ్గర్లో బ్లాక్ బోర్డువుంది. దాని పైన ప్రతీరోజూ ఏదో ఒక క్లాసువారు ఒక కేప్షన్ రాయడం అనవాయితీ ఆ రోజున ఆ అమ్మాయి మరికొందరు క్లాసుగరల్స్‌తో కలిసి బ్లాక్‌బోర్డు ముందు ఏదో చర్చిస్తూ వుండడం చూసి, "ఏమిట్రోయ్ నున బ్యూటీ బ్లాకీ దగ్గర చర్చ మొదలు పెట్టింది" అన్నాడు శీను పండు.

"ఈ మగ సమాజానికి ఏదై సందేశం అందించబోతున్నట్టుంది-"

"అటులయిన మనం చూని తరించవలె" అంటూ అక్కడకు చేరారు.

"WOMEN RULE THE WORLD...." అని రాసిం దామె బ్లాక్ బోర్డుమీద.

"ఈ వాక్యం అసంపూర్తిగా వుంది. RESPECT THE WOMEN అని రాయండి—" సలహా ఇచ్చింది మరొక అమ్మాయి.

"RULERS RESPECT అనేది అడిగి తెచ్చుకోరు; COM-MAND చేసి సంపాదిస్తారు—" అన్నది ఆ అమ్మాయి అబ్బాయిల వైపు ఓరగా చూస్తూ.

ఆ చూపుల్ని అర్థం చేసుకున్న వంశీ మరో చాక్‌పీస్ తీసుకుని ఆ వాక్యం క్రింద ఇలా రాశాడు.

BUT MEN RULE THE WOMEN WITH ROL-LERS"

వంశీ వ్యాఖ్య చూసిన అబ్బాయిలు అమ్మాయిల్ని గేలి చేస్ విజిల్స్ చేయడం చూసి

"IN THE JUNGLE" అని రాసింది.

—అలా రాయడంలో ఆమె తన తెలివినలతా ప్రదర్శించిం బోర్డుమీద క్రింద మరేమీ రాయడానికి వీలులేకుండా పెద్ద పెద్ద అ రాలు రాసింది.

ఆమె కొంటెతనం అర్థమైంది అందరికీ. ఎవరికి వారే ముసిము నవ్వులు రువ్వుతూ వంశీవేపు చూసారు ఈ సవాలు యేవిధంగా స్వీ రిస్తాడా? అని.

వారెంత ఉత్సుకతగా చూస్తున్నారో, అంత తాపీగా వెళ్ళి ఆమె రాసిన అఖరి వాక్యం పక్కన మరో అక్షరం 'E' చేర్చాడు. అది— 'JUNGLEE' అయింది.

అంతే!

అబ్బాయిలతోపాటు కొందరు అమ్మాయిలు కూడా బిగ్గరగా నవ్వారు ఆతడిచ్చిన రిటార్ట్‌కి.

దానితో ఆమె నిక్‌నేమ్ 'జంగ్లీ'-పాపులర్ అయింది.

"అరే బావా, హిట్ కొట్టావురా...." వంశీవేపు మెచ్చుకోలుగా చూస్తూ అన్నది చారుమతి

"బిగ్ బెన్" అన్న పిలుపుతో తృళ్ళిపడి వెనుదిరిగి చూసింది.

చారుమతి పెద్ద బన్ పెట్టుకుని ముడి చుట్టుకుంటుంది.

ఇప్పటివరకూ ఆమెను అలా కామెంట్ చేయసాహసించినవారు లేరు. అందుకే ఆ తృళ్ళిపాటు!

"నాతో పెట్టుకోకు. జీవితాంతం విచారించాల్సి వస్తుంది" హెచ్చరించింది.



"జంగ్లీ....గుర్తెట్టుకో- 'V' ఫర్ విక్టరీ; 'V' ఫర్ వంశీ. విచారానికి, విచారణకి తేడా ఏమిటో డిక్షనరీ వెదుక్కో....నీవు విచారించాలి అన్నావు! నాకోసం నీవు విచారణ– ENQUIRY చేసుకునే రోజొస్తుందంటున్నాను నన్ను వెదుక్కుంటూ నీవు నా గడప తొక్కే రోజొస్తుందని ఈ బ్లాక్‌బోర్డుమీద రాస్తున్నాను. దమ్ముంటే అలాగే వుంచు; లేదా చెరిపెయ్"- అంటూ బ్లాక్ బోర్డుమీద పూర్వం వున్న గీతలు తుడిచి రాశాడు.

"ఈ రాత నీ నుదుటిరాత- గుర్తుంచుకో" అంటూ అక్కణ్నించి కదిలాడు.

* * * *

సుకుమార్—

పచ్చి మూకుడులో నూనె- ఆగర్త వెలిగించి రెండు చేతులతో పట్టుకున్నాడు. గోచీ మినహా ఒంటిమీద నూలుపోగు లేదు. ఆ దీపం మీదుగా ఆకాశంలోని సూర్యుణ్ని చూస్తున్నాడు.

ఉదయకాలపు సూర్యుడు- ఆకాశంలో సూర్యుడు పులిపంజాకి బలయినట్టు రక్తం కక్కుతున్నాడు. పశ్చిమాన వున్న గుట్టల శిఖరాలు రక్తతిలకాన్ని అద్దుకున్నట్టు రాక్షసంగా కనిపిస్తున్నాయి.

కళ్ళురిక్కించి సూర్యునివేపే చూడసాగాడు.

రక్తవర్ణం క్రమక్రమంగా తరిగిపోతోంది. తెల్లబడుతున్నకొద్దీ తీక్షణత పెరుగుతోంది. ఆకాశాన ఒక బండెడు మెగ్నీషియం తీగ తగలబెట్టినట్టుంది.

నరాలు చిట్లుతున్న యాతన; గోళం బద్దలవుతున్న వేదన; కండపొరల్లో–గుండె అరల్లో బ్లేడ్లతో కోస్తున్నట్టు, సూదుల్తో గుచ్చుతున్నట్టు నరకయాతన. ప్రేవులు మెలిపెడుతున్నట్టు, ఊపిరితిత్తులు పంక్చరయినట్టు గిలగిలలాడుతున్నాయి.

నేలమీదనున్న ఇసుక వేడెక్కుతోంది. రక్షణ లేని పాదా
[illegible]క్కుతున్నాయి.

జ్ఞానేంద్రియాలు చచ్చుబడిపోతున్నట్టు-

శరీరమంతా తూట్లు పడుతున్నట్టు-

ఎముకలు విరుగుతున్నట్టు-

పీడిని మించిన ఏదో ఉద్వేగం నులిమేస్తోంది

మండుతున్న కళ్ళనుంచి ధారాపాతంగా నీరు కారుతోంది
గొంతు పిడచకట్టుకుపోతోంది.

చెక్కుతీసిన క్యారెట్‌లా మిలమిల మెరిసే అతడి శరీరం రో
అవుతోంది.

ఆచ్ఛాదనలేని శరీరంలోని రక్తమంతా విషపూరితమైనట్టు ఒం
రంగు నల్లబడుతోంది.

అంత బీభత్స వాతావరణంలోనూ అతడు స్పృహను కోల్పో
కుండా మంత్రపఠనం గావిస్తున్నాడు.

ఏదో ఉన్మాదశక్తి ఆవహించినట్టు గొంతెత్తి మంత్రాలు చదువు
తున్నాడు.

అది ఇద్దరు బలమయిన ప్రత్యర్థుల మధ్య భీకర సంగ్రామం.

ఒకరు ప్రత్యక్ష నారాయణుడు-సూర్యభగవానుడు;

రెండు మంత్రంతో ఆ నారాయణుడ్నే గెలవడానికి రౌద్ర క
కృతహస్తు కేతువులా బలాన్ని కూడగట్టుకుంటున్న నరుడు!

తెరలు తెరలుగా పొంగుతున్న మంత్రోచ్చరణ—

నరాలు చిట్లించేంత గాంభీర్యం;

నరనారాయణుల మధ్య సాగుతున్న మిథ్యా యుద్ధం!



ఆ సూర్యభగవానుని శరాఘాతానికి మాడి మసయిపోవలసిందే-
అతడా మంత్రోచ్చరణ ఆపిన క్షణాన!

ఆ మంత్రోచ్చరణ ఆగలేదు;

ఉదయభానునివేపు తదేకంగా తేరిపార జూడటంవలన చూపు
పోతుందని భయపడలేదు;

పైన సూర్యుని ప్రతాపం-క్రింద కాలుతున్న ఇసుక - తాను
మాడి మసిబొగ్గయిపోతానని సంశయించలేదతడు!

శరీరాన్ని- పరిసరాల్ని మర్చిపోయాడు. అగర్త మీదుగా
చండప్రచండ మార్తాండుడ్ని చూస్తున్నాడు; పెదవులు మంత్రోచ్చరణ
చేస్తున్నాయి.

—మాపరులకి కనిపించేది ఇదే!

మంత్ర ప్రభావంతో మానవుడు మహనీయుడవుతాడు; ప్రకృతిని
జయిస్తాడు

సుకుమార్-వెన్నెలలోని లాలిత్యాన్ని, చంద్రశిలలోని కాఠి
న్యాన్ని రంగరించినట్టు రెండురకాల భావనలు ఏక కాలంలో చుట్టు
ముట్టాయి. అది మంత్రోచ్చరణ చేసిన ఇంద్రజాలం!

అతడికి కనిపిస్తున్నది ప్రచండభానుడుకాదు—పుచ్చ పువ్వులా
పగలబడిపోయిన వెన్నెల. మంచుకన్నా చల్లగా, తేనెకన్నా తియ్యగా
ఈ సకల సృష్టికి అర్థాన్ని చెప్పే బ్రహ్మస్వరూపాన్ని చూస్తున్నా
డతడు. కళ్ళముందు మెరుపులు మెరిసినట్లు, ఉల్కలు రాలినట్లు—
రెప్పలల్లార్చి మళ్ళీ మళ్ళీ చూస్తున్నాడు చూస్తున్నకొద్దీ శరీరమంతా
ఉద్వేగం పొందినట్లయింది; గొంతు పెగిలింది మంత్రోచ్చరణ పవిత్ర
గోదావరిలా సాగిపోతోంది-వీణమీద వేదం పలికినట్లు!

అతడి ముఖంలో ఎగజిమ్ముతున్న విచిత్రమైన వెలుగుని
గుర్తించవలసినవారు గుర్తించారు.

గుర్తించిన ఆ వ్యక్తి-ఆచార్య కాలనేమి!

అనన్య సాధారణ బ్రహ్మవర్చస్సు-అనంత శేముషీ సంపద-జాజ్వల్యమానంగా మిరుమిట్లు గొల్పుతున్న ఆ క్షుద్రవాని నేత్రాలు చూసి తృప్తిగా తల పంకించారు ఆచార్యులవారు!

"కుమారా— శ్రీవిద్య లోక కళ్యాణానికే వినియోగించాలి. లోక కళ్యాణానికి ఎంతగా వినియోగిస్తే అంతగా ఆ సాధకుడు దైవత్వం సంతరించుకుంటాడు" అంటూ ఆచార్యులవారు కళ్ళు మూసుకుని కుడి చేయి చాచారు. భైరవీముద్ర దాల్చారు ఆచార్యులవారు. ఆ సమయంలో వారినోరు గుహలా తెరుచుకుంది. నాలుక పాములా వెనుకకి మడతబడి అంగిట్లోకి వెళ్ళింది.

మరుక్షణం ఆయన చేతిలో ఓ చలువ అద్దాలజోడు ప్రత్యక్షమైంది.



—ఆచార్య నాగార్జునుడు ప్రబోధించిన శూన్యవాద సిద్ధాంతాన్ని ఔపోసనం పట్టిన ఆ దివ్యపురుషునివేపు మమేకంగా చూస్తుండిపోయాడు సుకుమార్.

"కుమారా! మిథ్యా ప్రపంచంలో పాదం మోపినప్పుడు ఈ కళ్ళజోడు విధిగా ధరించు! సిద్ధపురుషులు అగ్నిలో నిలబడగలరు; హిమంలో నిద్రించగలరు; నీటి అడుగున తపసు చేసుకోగలరు. వారికి అగ్ని-వాయువు-జలము-శీతలము అన్నీ ఒక్కటే! నీవు ఇప్పుడు నిలుచున్న చోటనుంచి కదలకుండా బ్రహ్మాండాన్ని చుట్టివచ్చావు; సమస్త పవిత్ర నదులలో స్నానించావు.

ఒక్క వాక్యంలో చెప్పాలంటే-సూర్యుని కిరణాలు సోకిన యీ జగత్తునంతా సంప్రోక్షించావు. ఎలా? అని నీవు అడగవచ్చు.

పంచరంగులు గల పాప మధ్యంబున
నాద బిందుకళలు నమరియుండె



కళలలోన వెలుగు ఘనపరిపూర్ణంబు
పరమ చిద్విలాస భాను తేజంబు

★ ఎరుపు :

కంటి యందు గల తెల్ల గుడ్డునకు చుట్టూ వుండునది ఇదియే
పృథ్వీతత్వము,
క్రియాశక్తి
బ్రహ్మ అధిదేవత
అకారం మాతృక
అన్నమయ కోశము
సద్యోజాత ముఖ బ్రహ్మ

★ తెలుపు :

కంటియందుగల తెల్లగుడ్డు.
ఇది అపోతత్వము
జ్ఞాన శక్తి
విష్ణువు అధిదేవత
ఉకార మాతృక
ప్రాణమయ కోశము
వాసుదేవ ముఖ బ్రహ్మ

★ నలుపు :

ఇది తెల్లగుడ్డు మధ్యన వుంటుంది.

—ఇది తేజోతత్వము

ఇచ్ఛాశక్తి

రుద్రుడధిదేవత

మకారం మాతృక

మనోమయ కోశము తత్పురుషముఖ బ్రహ్మ.

★ సునీలము :

కంటియందుగల నల్లగుడ్డు మధ్యమందు లీలమైన పాప-

ఇదియే వాయుతత్వము-

ఈశ్వరుడధి దేవత—

అర్ధమాతృక విజ్ఞానమయకోశము

అఘోర ముఖబ్రహ్మ.

★ ఇంద్ర నీలము :

కంటియొక్క నల్లగుడ్డు మధ్య లీనమైయుండు పాప మధ్యను నిరంతరము వెలుగు చుండెడు కళ.

ఇదియే ఆకాశ తత్వం.

పరాశక్తి

అధిదేవత సదాశివుడు

ఓంకార మాతృక

ఆనందమయ కోశము

ఈశాన ముఖబ్రహ్మ



ఈ పంచ రంగులు అయిదు తత్వములు-

అయిదు శక్తులు-

అయిదు దేవతలు-

అయిదు బీజములు-

అయిదు కోశములు-

అయిదు ముఖములు-

అయిదు లింగములు-

అందుబిందువే ఆజ్ఞాచక్రము, అందులోని కళయే సహస్రారము. కంటియందుగల నల్లగుడ్డు- అండాండము; గంగానది, చంద్రమండలం నాదము; ఇడానాడి; కామాక్షి; స్థూల దేహము జాగ్రదావస్థ తమో గుణముతో ప్రకాశించుచున్నది.



కండిపాప-పిండాండము, యమునానది, నీలతోయదము, సూర్యమండలం, బిందువు, పింగళనాడి, మీనాక్షి, సూక్ష్మ శరీరము, స్వప్నావస్థ, రాజస గుణముతో ప్రకాశించుచున్నది.

కంటియందు నల్లగుడ్డునందుగల పాప మధ్యను వెలిగే కళ ఇదియే బ్రహ్మాండము, సరస్వతీనది, విద్యుల్లేఖ, అగ్నిమండలము, నిష్కళ, సుషుమ్నానాడి, విశాలాక్షి, కారణదేహము, మహాకారణము, సుషుప్తి, తుర్యావస్థ.

సాత్విక గుణముతో ప్రకాశించును.

కుమారా!

రక్తమాంస కళేబరం, సూక్ష్మ శరీరం అనేవి రెండు వున్నాయి. మృత్యువుతో రక్తమాంస కళేబరం నశిస్తుంది; సూక్ష్మ శరీరం తన గమ్యాన్ని వెతుక్కుంటుంది. ఈ సూక్ష్మశరీరం భూమిమీద పడినప్పుడు

ఎంత భారరహితంగా వుంటుందో, ఈ భూమిని విడిచేటప్పుడూ అదే విధంగా వుండాలి. ఇక్కడ నేర్చుకున్న విద్యల్ని ఇక్కడే విడిచి పెట్టాలి. లేకుంటే ఈ సూక్ష్మ శరీరం ఈ విద్యల భారం మోస్తూసుదీర్ఘ ప్రయాణం చేయలేదు. అవధూత రామకృష్ణ పరమహంస తన విద్యల్ని వివేకానందునికి ధారపోసినట్లు నీకు నేను నేర్పిన విద్యల్ని ధారపోస్తున్నాను ఈ విద్యల్ని మానవ కళ్యాణానికి వినియోగించాలి. దుర్వినియోగం జరిగితే, సూక్ష్మరూపం చేరిన నా ఆత్మ- నాకు విద్యాదానం చేసిన నా గురువులు మహాసమాధినుంచి మేల్కొంటాం. సిద్ధపురుషులు-
యోగపురుషులకు ప్రత్యేక న్యాయస్థానాలు వుంటాయి అక్కడ.

గురుద్రోహికి విధించే శిక్ష జన్మజన్మలకు

పరిమిత మవుతుంది. నేను సత్ శిష్యుణ్నే ఎన్నుకున్నానని విశ్వసిస్తున్నాను.

ఈ రోజు నుంచి

"జ్ఞాన నిధి"

అని నీకు నామకరణం చేస్తున్నాను.

దైనందిన జీవితంతో నీ పేరు సుకుమార్ అయినా, ఈ జ్ఞాన సమాజంలో నీవు జ్ఞాననిధిగా చెలామణి అవుతావు.
అప్రయత్నంగా చేతులు జోడించి శిరసు వంచాడు జ్ఞాననిధి.

# 4

"ఏప్రిల్ ఫస్ట్!

–ఫస్ట్ అవర్ తెలుగు.



-మాస్టారు:

మెట్టా వెంకటేశ్వరరావు గారు.
ఏ రోజున ఎవరు ఏ క్లాసు ఎగ్గొట్టినా, ఏప్రిల్ ఫస్టన మెట్టావారి క్లాసు మాత్రం ఎవరూ ఎగ్గొట్టరు. మిగతా క్లాసుల్లోనివారు కూడా ఆ అవర్‌కి స్పెషల్ పర్మిషన్ తీసుకొని ఆయన క్లాసులో కూర్చుంటారు. ఆ రోజున ఆయన ఎవర్నీ అభ్యంతర పెట్టరు, వంశీ అండ్ కో కూడా ఆ క్లాసులో చేరింది.

"పిల్లలూ! ఏ పుస్తకానికయినా ప్రింటింగ్ దశలో ప్రూఫ్‌రీడింగ్ వుంటుంది.

అదృష్టం కలిసొస్తే, ఆదరించే పాఠకులుంటే రీప్రింట్ పడుతుంది. అసీ జీవితమనే ఈ పుస్తకానికి ప్రూఫ్‌రీడింగ్ లేదు; రీప్రింట్ అంతకన్నా లేదు  ఈ సంవత్సరంతో మీకు డిగ్రీ పూర్తవుతుంది ఎవరు, ఎక్కడ, ఏం చేస్తారో తెలియదు. ఒక స్వీట్ మెమరీగా ఈ రోజు మీకు గుర్తుండాలి 'హోలీ' రోజున రంగులు పూసుకున్నట్టు ఈ రోజున ఎవరు ఎవరిపైనయినా - అఖరికి నా పైన కూడా- మీరు జోకులేయవచ్చు. టు డే ఈజ్ యువర్ డే....స్పోర్టివ్‌గా తీసుకుని ఎంజాయ్ చేయగలిగినవారే ఈ రోజున క్లాసులో వుండండి. లేనివారు క్యాంటిన్‌కి వెళ్ళవచ్చు. క్యాంటిన్ బిల్ నేను చెల్లిస్తాను- ఈ ఒక్క రోజుకి" అన్నారు.

ఆ రోజుకోసం- ఆ క్లాసుకోసం సంవత్సరకాలం నుంచి ఎదురు చూసే స్టూడెంట్స్ ఒక్కరూ లేవలేదు.

"మాస్టారు....ఈ రోజున అందరికీ నేను T ఇప్పిస్తున్నాను" అన్నది ఒక అమ్మాయిలేచి.

"నాకు T వద్దు; ఆఫ్టర్ T కావాలి" అన్నాడు సన్నాయినొక్కుల శ్రీనివాస్.

శ్రీనుపండు అడిగిందేమిటో అర్థంకాక చూస్తుండిపోయారు క్లాసంతా.

విషయం అర్థమయిన మాస్టారు శ్రీనుపండుకి ఎవరు రిటార్ట్ ఇస్తారా అని ఎదురుచూస్తున్నారు

అప్పుడు లేచింది గాయత్రి: "T తర్వాతది మీకు అర్పించుకోవాలంటే ఆ తర్వాత దాని తర్వాతది మీ దగ్గర ఎంతవుందో ముందుగా విన్నవించుకోండి అప్పుడు 'V' వరిస్తుంది" అన్నది.

"బాగా చెప్పావమ్మా...." మెచ్చుకోలుగా చూస్తూ అన్నారు మాస్టారు.

కానీ మిగతావారికి అర్థంకాక తెల్లమొహాలేశారు.

"ఏరా హీరో.... ఈ కోడ్ లాంగ్వేజీని నీవేమైనా డీకోడ్ చేస్తావా?" మాస్టారు అడిగారు.

"ఈ రోజున హీరో పెద్ద జీరోసార్-" ఒక అమ్మాయి కిసుక్కున నవ్వింది.

చిద్విలాసంగా లేచాడు వంశీ.

"ఇంగ్లీష్ అల్ఫాబెట్స్‌లో 'T' తర్వాత 'U'.

ఆ అమ్మాయి T ఇస్తానన్నది.

కానీ ఆ అబ్బాయి 'U' - అంటే నీవే కావాలి అన్నాడు.

'U' తర్వాతదితర్వాతది – అంటే W – అంటే 'WEALTH' నేంతవుందో చెబితే 'U' తర్వాతది 'V' - అంటే VICTORY నీకే దక్కుతుంది అనిచెప్పింది.

అంతే!



క్లాసంతా కరతాళధ్వనులతో మార్మోగింది.

సరిగ్గా అదేసమయంలో ఓ ఆరుగురు కుర్రాళ్ళు పరుగులాంటి నడకతో వచ్చి డోర్ దగ్గర నిలబడ్డారు.

"పౌల్ట్రీ ఫారమ్ వచ్చింది" అన్నదో అమ్మాయి.

మరొక్కమారు క్లాసు గొల్లుమంది.

కారణం- ఆ వచ్చిన అబ్బాయిలంతా వైట్ ప్యాంటు, వైట్ షర్టు, వైట్ షూలో వున్నారు. కోళ్ళ ఫారంలోని బ్రాయిలర్ కోళ్ళవలె తెల్లగా.

"రండి" అని, ఇప్పటివరకూ ఎక్కడున్నారు?" అనడిగాడు మాస్టారు.

"క్రికెట్ ప్రాక్టీస్ చేస్తున్నాంసార్...." అన్నాడు భీమారావు.



పేరుకి తగ్గట్టే వాడు లావుగా వుంటాడు.

"ఇంత లావున్నాడు- ఇతనేం పరుగెత్తుతాడండీ" లేవకుండానే కూర్చున్న చోటునుంచే కామెంట్ చేసిందొక అమ్మాయి.

"రన్స్ తీయాలంటే పరుగెత్తనవసంలేదు. దొర్లుకుంటూ వెళ్ళి రన్స్ తీస్తాడు" అన్నారు మాస్టారు.

"దొర్లడానికి నేను రెడీ. ఆ అమ్మాయి రెడీగా వుందేమో అడగండి మాస్టారు"

అంతే స్పోర్టివ్ స్పిరిట్‌తో ఛాలెంజ్ విసిరాడు భీమారావు.

"అప్పుడు దానిని క్రికెట్ అంటారా? దొమ్మర్లాట అంటారా?"

అమ్మాయిల సైడునుంచి కోరస్‌గా వినిపించింది.

"దొంతర్లాట అంటారు" అబ్బాయిల సమాధానం.

"విన్నర్స్‌కి ఇచ్చేది మాత్రం రోలింగ్ షీల్డ్—"

"అక్కడ విన్నింగ్ వుండదోయ్, షేరింగ్ మాత్రమే ఉంటుంది"

టాపిక్ గాడి తప్పుతూందని గమనించిన మాస్టారు-"ఓకే-ఓకే. ఈ టీమారావు మ్యాచ్‌లో విన్నర్స్, రన్నర్స్ లేరు-రోలర్స్ మాత్రమే మిగిలారు. రోలింగ్ షీల్డ్ డిక్లేర్ చేస్తూ తదుపరి ఐటమ్‌కి వెళ్తున్నాం" అని అనౌన్స్ చేసారు మాస్టారు.

"మాస్టారూ! మన యువకవి—" అని ఏదో చెప్పబోతుండగా "'కవి' కాదు 'కపి'-స్మాల్ కరెక్షన్ ప్లీజ్" అన్నారు అమ్మాయిలు.

"నారద తంబురలను మరిపిస్తూ ఆడపిల్లలు కోరుకుంటున్న మన యువకవి కాశేశ్వరరావు కవితాగానం చేస్తారు" అని అనగానే టక్ చేసుకున్న ఓ యువకుడు ప్లాట్‌ఫారమ్ దగ్గరకొచ్చాడు. (క్లాసు రూములో ఉడెన్ ప్లాట్‌ఫారమ్ వుంటుంది. దానిమీద మాస్టారి టేబిల్, చైర్.... అక్కడ్నించి చూస్తే క్లాసులో, ఆఖరి వరుసలో కూర్చున్నవారు కనిపిస్తారు.)

"డియర్ ఫ్రెండ్స్....ఇది నా కవిత్వంకాదు గాత్రం మాత్రమే నాది" అని పాట మొదలు పెట్టేంతలో-"విశాలా! తలు పెయ్....గాడిదలు లోపలికి రావచ్చు" అన్నది ముందు బెంచీలో కూర్చున్న ఓ అమ్మాయి నుద్దేశించి.

"లోపలికి రావడానికి ఇంకా బయట గాడిద లేవీ మిగలలేదుగా" అన్నారు మాస్టారు.

కాశేశ్వరరావు కవిత అందుకున్నాడు.

"అడుగు వెయ్యి ఆదివారం
సైగ చెయ్యి సోమవారం
మాటు వెయ్యి మంగళవారం



బీటు వెయ్యి బుధవారం
లవ్ చెయ్యి లక్ష్మివారం
షాట్ వెయ్యి శుక్రవారం
సలమ్ చెయ్యి శనివారం"

అని కవిత పూర్తయ్యేలోపు ఓ అమ్మాయి వచ్చింది.

"రేయ్ గాడిద రాలేదురా, మేక వచ్చింది" గుమ్మం దగ్గర నిలబడి వున్న అమ్మాయిని చూపిస్తూ అరిచాడు వంశీ.

"మేక కాదురా గొర్రె...." కరెక్షన్స్ ఇచ్చాడు ప్రభాకర్.

"ష్....ష్....ష్....జడ కూడా పీకుతుందేమోరా" ధరణి.

ఈ కామెంట్ ముందు బెంచీలో కూర్చునివున్న గాయత్రి ఉలిక్కిపడింది.



ఆమె జడనిండా పూలు....

పరిస్థితి గమనించిన మాస్టారు...."వినండ్రా...మన కాశేశ్వరరావు కవిత విన్నారుగదా! ఛందస్సు ప్రకార అది ఉత్పలమాలా? చంపకమాలా? ద్విపదా? సీసపద్యమా?" అనడిగారు

"చంపకమాలా, ఉత్పలమాల కాదు సార్! అది వైజయంతి మాల" అన్నాడు వేదిక దగ్గరలో వున్న కాశేశ్వరరావు, ఎదురుగా వున్న బెంచీలో కూర్చున్న వైజయంతిమాల అనబడు అమ్మాయివేపు ఓరగా చూస్తూ.

"యు....యు....యు ఆర్ ఎ మంకీ" అందా అమ్మాయి.

"యస్....ఐయామ్ యువర్ 'మన్....కీ'"

'మన్' అంటే మనసు.

'కీ' అంటే తాళం చెవి....

"గడియపడిన నీ మనసు వాకిలి తలుపులు తెరిచిన తాళపుచెవిని నేను"

అంతే!

క్లాసంతా గొల్లుమంది. ఆ హడావుడిలో అందరూ ఎదురుగానున్న బిల్లలు చరుస్తుంటే 'ఫణి' అనే విద్యార్థి ముందు బెంచీలో కూర్చున్న వాడి వీపుమీద బిగ్గరగా చరిచాడు.

"రేయ్ ఫణీ! ఒకర్ని కొట్టడం తప్పు కదా...." అన్నారు మాస్టారు.

"సారీ సార్...." అంటూ మరొకడ్ని బాదికొట్టి "ఒకర్ని కొట్టడం తప్పు అందుకే ఇద్దర్ని కొట్టాను సారీ" అన్నాడు.



వాడి సమయస్ఫూర్తికి మెచ్చుకోలుగా నవ్వారు మాస్టారు.

అప్పుడు వచ్చింది 'హసంతి' అనే అమ్మాయి.

"హసంతీ! యు ఆర్ లేట్" అన్నాడొక అబ్బాయి.

"నో....అయామ్ లేటెస్ట్" స్పాంటేనియస్‌గా అందా అమ్మాయి.

"అయితే రేటెంత?" ఓ కొంటె అబ్బాయి ప్రశ్న.

"కవిత్వానికి—

కన్నెపిల్లకి—

వెలకట్టగల షరాబు లేడోయ్ ఇక్కడ...." అంటూ మునిముని నవ్వులు నవ్వుతూ వెళ్ళి సీట్లో కూర్చుంది.

"వారె వా....క్యా కహా....అన్నదొక సుందరాంగి.



"ఆ అమ్మాయికేమోగాని, ఈ అమ్మాయికి అక్షర లక్షలివ్వచ్చు". మగ కంఠం.

"లక్షల అక్షరాలా—

"అక్షరానికో లక్షరూపాయలా?"

"లక్ష అంటే రెండు అక్షరాలే గదా! మీరు ఎలా అనుకున్నా సరే...."

ఈ నేపథ్యంలో మాస్టారు ఆ గొడవని భగ్నంచేస్తూ అన్నారు-

"నేను చెప్పేది వినండర్రా...." అని "నేను చెప్పేదేమిటంటే" ఏదో చెప్పబోతుండగా వెనుకనుంచి ఎవరో "సోది...." అన్నారు.

"అవును....సోది....మాటల ప్రోది.... నోరమ్మకువి బతికే వాళ్ళంగదా.... ఈ సంవత్సరం ఇలా గడిచింది. నాకు తెలుసు, ప్రస్తుతము ఇక్కడ సెకండ్ ఇయర్....ఫైనల్ ఇయర్ స్టూడెంట్స్ కూడా వున్నారు. సంవత్సరానికి ఒకసారి వచ్చే ఈరోజు కోసం....ఈ గంట కోసం ఎదురుచూస్తుంటాను....హాయిగా నవ్వుకోడానికి. ఏప్రిల్ ఫస్ట్—ఫస్ట్ అవరే ఇంత సరదాగా గడిచిపోయేది. నా స్టూడెంట్ డేస్ గుర్తొస్తాయి....గుర్తుతెచ్చుకుంటాను. మళ్ళీ ఆ యౌవన ప్రాంగణంలో పాదం మోపుతాను"

"మీ అందరికీ నా సలహా-

శరీరానికి వృద్ధాప్యం రావచ్చు, కానీ మనసుకి, ఆలోచనలకి వృద్ధాప్యం రానివ్వకండి.

BE YOUTHFUL&TOUGHTFUL.

కొంతమంది వృద్ధులు జుత్తుకి రంగేసుకోవడం, కుర్రవాళ్ళలా డ్రెస్ చేసుకోవడం. లేటెస్ట్ ఫ్యాషన్ కార్లు, బ్రీఫ్ కేసులు, కళ్ళజోళ్ళు వాడడంలో ఉద్దేశం....ఎక్కడా వృద్ధాప్యపు ఛాయలు తొంగిచూడకూడ

దనే! మీరూ అప్‌డేట్‌గా వుండండి. రేపటి తరంతో పోటీ పడటానికి సిద్ధంగా వుండండి.

"విష్ యూ ఆల్ ది బెస్ట్...." అని ఆయన ఆ వాక్యం ముగించారో లేదో బెల్ మోగింది.

## HE IS SO CALCULATED

అక్కడ నవ్వులు పువ్వులై విరజిమ్ముతున్న సమయంలో ప్రవేశించాడతడు. కళ్ళకు చలువ అద్దాలు, అతడి రాకతో హటాత్తుగా అక్కడ గాంభీర్యం చోటుచేసుకుంది. నవ్వులు మాయమయ్యాయి.

అతడు ఎవరి అనుమతీ తీసుకోకుండా తిన్నగా క్లాసురూమ్‌లోకి ప్రవేశించాడు. మెట్లా వెంకటేశ్వరరావుగారి నిష్క్రమణ, అతడి ఆగమనం దాదాపుగా ఏకకాలంలో జరిగాయి,

అతడు—సుకుమార్.

కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుని క్లాసు రూములోకి ప్రవేశించరాదు- కానీ సుకుమార్ ప్రవేశించాడు

★ ★ ★ ★

పెరిగిన తెల్లటి గడ్డం-

బరువుగా లేచే కనురెప్పల క్రింద డేగలాంటి కళ్ళు-

ఎముకల పోగులా సన్నగా పీలగా వున్నా దృఢంగా వున్నాడు. మెరుపుకన్నా వేగంగా కదులుతున్నాడు.

ఆయన—ఆచార్య కాలనేమి.

ఆయనకు అభిముఖంగా సుకుమార్ పద్మాసనంలో కూర్చుని వున్నాడు.

ఆ సమయంలో సుకుమార్ శరీరంమీద గోచీ మాత్రమే వుంది.



"అపవిత్రః పవిత్రోవా...." అంటూ మంత్రం చదువుతూ ముందుగా తనపై ఉద్ధరిణితో నీళ్ళు చల్లుకుని, తర్వాత సుకుమార్‌పై నీళ్ళు జిలకరించారు ఆచార్యులవారు.

ఆ పిదప పసుపు ముద్దతో హరిత గణపతిని తయారుచేసి ప్రాణ ప్రతిష్ఠ చేశారు. అర్ఘ్యపాద్య, అభిషేకానంతరం ఆది దేవత ప్రత్యధి దేవత సహిత గణపతికి, ఆవరణ దేవతలకు తర్పణం విడిచారు చివరగా మహాప్రసాదం సమర్పించి, దక్షిణ సహిత తాంబూలం- కర్పూర హారతి యిచ్చారు. ఆ తదుపరి మంత్రపుష్పం, అపచార నమస్కారం చేసిన తర్వాతగాని తాను తలపెట్టిన అసలు పూజ ప్రారంభించలేదు.

"కుమారా-

శివ యంత్రం

| | | | | |
|---|---|---|---|---|
| న | శి | య | మః | వా |
| య | మః | వా | న | శి |
| వా | న | శి | య | మః |
| శి | య | మః | వా | న |
| మః | వా | న | శి | య |

"బంగారు రేకుపై వ్రాయించిన యంత్రమిది. 30 రోజులు దీక్షగా పూజించాలి. దీనినే శివ యంత్రమని అంటారు.

ప్రతి రోజూ పూజానంతరం తేనె, మినప గారెలు, సూపిండి నైవేద్యం చేయాలి.

ఆనంతరం....

"ఓం నమః శివాయ"

మంత్రోపదేశం చేశారు.

"ఈ మంత్రాన్ని రోజుకు 1000 సార్లు జపం చేయాలి. అలా చేసిన అన్ని రకాల పిశాచ బాధలూ తొలగిపోతాయి. ఇకపై ఎప్పుడూ సాధకుని జోలికి రావు దీన్ని మించిన పిశాచీని నిరోధ్యం యంత్రం లేదని శాస్త్ర వచనం."

నేలమీద జరుగుతున్న ఆ విచిత్రాన్ని నింగిలోని చంద్రుడు విభ్రాంతితో చూస్తున్నాడు. అప్పుడు సమయం ఒకటీ నలభయ్. రుద్ర భూమిలో రొమ్ములెత్తున పెరిగిన బ్రహ్మజెముడు, జుత్తు విరబోసుకున్నట్టున్న నల్లతుమ్మ కొమ్మల మధ్యగా వీస్తున్న గాలి-సమాధులలోని వారు గురక పెడుతున్నట్టు వినిపిస్తోంది.

సాధారణంగా ఆ ముదుసలి ఎక్కడవుంటే ఆ వైపు వీచే గాలి, ఎగిరే పక్షి కూడా తొంగిచూడవు. కానీ దూదిపోగులా తెల్లని జుత్తు, తెల్లని గడ్డం, ధవళ వస్త్రాలు ధరించిన ఆచార్య కాలనేమి దృష్టంతా ఎక్కడో వుంది. ఆయన రెండు చేతులు పారల్లా కదులుతున్నాయి. చేతివ్రేళ్ళు గునపాల్లా నేలలోకి దిగబడుతున్నాయి. చేతులతో ఎత్తి పోస్తున్న మట్టి తట్టలుతట్టలుగా ఒడ్డున కుప్పలు పడుతోంది.

ఆ ముదుసలి-ఆచార్య కాలనేమి-కదలిక మెరుపుకన్నా వేగంగా వుంది. చేతులతో నేలను తవ్వుతున్న తీరు విభ్రమంగా వుంది. తలమీద అగ్రత, మొలకు గోచీ మాత్రమే పెట్టుకుని నిలబడి వున్న జ్ఞాననిధి అనబడు 'సుకుమార్' ఆలోచించే స్థితి దాటిపోయాడు. గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు. దాదాపుగా నిలువెత్తు లోతున తవ్వేదాకా ఓ శిలా ఫలకం తగలలేదు. చిన్న పిల్లలు పలక మోసినంత సులువుగా ఆ శిలా ఫలకాన్ని తొలగించారు ఆచార్య కాలనేమి. ఆ తర్వాత జరగబోయేది చూడలేక కాబోలు చంద్రుడు మేఘమాలని ముఖాన కప్పుకున్నాడు.

అది సొరంగ మార్గం-



లోపల చీకటి గుయ్యారంలా వుంది.

"జ్ఞాననిధీ, నాతోపాటు లోపలికి వచ్చెయి-" అంటూ ముందుకు అడుగేశారు గోతిలోనున్న ఆచార్య కాలనేమి.

నేలమీద నిలబడి వున్న 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్‌కి ఆ క్షణాన తన తలమీదున్న అగర్త గుర్తురాలేదు. నూనె ఒలికి మీద పడుతుందన్న భయమూ కలగలేదు. అనాలోచితంగా క్రిందకు దుమికాడు. అతడు ఆలోచించే స్థితిని కోల్పోయాడు. గనక తెలియదు, తెలిసివుండే దాదాపుగా పది నిముషాల తర్వాతగాని తన పాదాలు నేలను తాకలేదని గ్రహించేవాడు. అక్కడ రెండు పెద్ద పెద్ద రాళ్ళు ఒకదానిమీద మరొకటి పేర్చినట్టు వున్నాయి. ఆ రాళ్ళకు నలువైపులా నాలుగు ప్రమిదలు వెలుగుతున్నాయి. చిత్రాతి చిత్రమైన విషయం— ఆ సొరంగం మూత తెరిచింది అప్పుడే! కానీ ఆ ప్రమిదల నిండా ఎవరో పట్టించినట్టు నూనె నిండుగా వుంది. ఆ దీపాలు నిశ్చలంగా వెలుగుతున్నాయి. 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ తలమీదున్న అగర్తని ఆ రాళ్ళముందుంచిన ఆచార్య కాలనేమి ప్రాణాధారం పట్టాడు. మంత్రపఠనం ముగించి లేచారు. అప్పుడు జరిగిందీ అద్భుతం.

అక్కడ వెన్నెల సోన కురిసినట్టు విచిత్రమైన కాంతి చోటు చేసుకుంది. మల్లెలు చిమ్మినట్లు కమ్మని సువాసన వ్యాపించింది.

ఈ నేపథ్యంలో నలుగురు మూర్తులు పద్మాసనం వేసుకుని కూర్చుని వున్నారు. ఆకృతి మనిషిదే, కానీ శిలలా బిగుసుకునిపోయి వున్నారు.

4-5 శతాబ్దాల కాలంలో యోగులు 'భూగర్భ స్పర్శ విద్య'ని ఉపాసించిన దాఖలాలున్నాయి.

(ఉచ్ఛ్వాస నిశ్వాసలను బంధించి వీరు భూమిలో వుండగలరు. అదీ కొన్ని వందల సంవత్సరాలు. కొన్నివేల సంవత్సరాల కాలం జీవించినవారూ వున్నారు. వారి జీవితానుభవాలను ఈ సీరియల్‌తోపాటు

అందజేస్తాం. 'వాయు స్తంభన' విద్య ఈ రోజుల్లో కూడా మనం చూస్తూనే వున్నాం. ఈ ఉపాసకులు నీటిపై తేలుతూ కొన్ని గంటల సేపు వుండగలరు.)

-రచయిత

"జ్ఞాననిధీ!

మీరు మా గురుపరపర—" అని ఆచార్య కాలనేమి అనగానే అప్రయత్నంగా ప్రాణాదారం పడ్డాడు జ్ఞాననిధి అనబడు సుకుమార్.

"జ్ఞాననిధీ—

శివశక్త్యాత్మకం బ్రహ్మ!

దీని లక్ష్యం-బ్రహ్మత్వాన్ని అంది పుచ్చుకోవడం!

బాల, ఉన్మత్త, పిశాచ దశలను దాటి అనభూతగా ఎదగడం!!

అజ్ఞానం నుంచే కాదు, జ్ఞానం నుంచి కూడా విముక్తి పొందడానికే నిన్ను ఇక్కడికి తీసుకొచ్చింది.

ఇక్కడికి ఎలా వచ్చావో అలాగే వెళ్ళిపోవాలి నేను నేర్చిన సర్వ విద్యలూ నీకు ధారపోస్తున్నాను. దాని వలన నీకు దక్షిణాచారమే కాదు, హిమాచారమూ వంటబడుతుంది.

దక్షిణాచారంలో 'సాధన ఇవ్వడం' ప్రధానం.

వామాచారంలో- 'బీజవాపనం' (విత్తనం నాటడం) ముఖ్యం.

ఆరోగ్యకరమైన మనసుని ఒకే విషయమై కేంద్రీకరిస్తే అది సమాధి అవుతుంది.

జ్ఞానమార్గ పరమావధిః అర్ధనారీశ్వరత్వం.

వామాచారం నీకు అంతుపట్టినా ఆచరించకు, అక్కడ స్టైరాయిడ్స్ వలె పంచ మకారాలను వినియోగించవలసి వుంటుంది.



అఘోరకి సెక్స్ ఎంత ముఖ్యమో, శవమూ అంతే ముఖ్యం.

తారక-హేరుక-సుగతి-సందర్శన-లోకేశ్వరి-అవలోకితేశ్వరి—దేవతలను అర్చించకు!

నీకు వంటబట్టిన 'మహా సుకవాద విద్య'తో సరిపెట్టుకో! మరికొంత విషయ సేకరణకు నడుం బిగించకు.

ధరణీ విద్యలకు ధరణికోట-ధారాణికోట వైపు వెళ్ళకు.

శాక్తేయంలో అతీంద్రియ శక్తులకు బగిమూలిసీ పూజ చేస్తారు.

-వీటికి దూరంగా వుండు.

"నేను నా గురువుల నుంచి నేర్చిన విద్యలన్నిటినీ నీకు ధారపోసి నేను విముక్తుడ్నవుతున్నాను.

ఈ విద్యలన్నీ లోకకళ్యాణానికే వినియోగించాలి.

ఈ విద్యలు దుర్వినియోగమయినపుడు నేను, నా గురు పరంపర సమాధిస్థితి నుంచి మేల్కొంటాం. నిన్ను జన్మజన్మలకు శాసిస్తాం—శపిస్తాం కాన జాగ్రత్తగా మసలుకో" అని ఆఖరిసారిగా హెచ్చరించి ఆయన రెండుకళ్ళూ మూసుకున్నారు కుడిచేయి 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ తలమీద వుంచారు. అప్రయత్నంగా ఆచార్యులవారి రెండు పాదాలపై తన రెండుచేతులూ వుంచాడు జ్ఞాననిధి.

ఏదో వింతకాంతి....విద్యుత్తుగా.... విద్యుత్తుగా గురువు నుంచి శిష్యునిలోకి ప్రవేశించింది.

గురుపరంపర సరసన చోటుచేసుకున్నారు ఆచార్య కాలనేమి.

కళ్ళు మూసుకున్నాడు 'జ్ఞాననిధి'.

లావా పైకి ఎగజిమ్మినట్టు భూమి ఉపరితలానికి వచ్చాడు. సొరంగం మూతపడింది. ఇప్పుడక్కడ గొయ్యి తవ్విన ఆనవాళ్ళేవీ లేవు.

బాహ్య ప్రపంచంలోకి రాగానే అతడి స్మృతిపథంలో మెదిలింది.

'భగపూజ'

'క్లీం, ఐం, జౌత్యహాః, ఐం క్లీం'

-మంత్రం నోటినుంచి వెలువడింది.

-కళ్ళముందు తన క్లాస్‌మేట్ గాయత్రి కదలాడింది.

* * * *

ఎవరో బాది వెన్నుపై చరిచినట్టు ఉలిక్కిపడి లేచాడు ఆ ఇంటి యజమాని నల్లపిల్లి ఒకటి ఎదురుగానున్న కిటికీలోకి ఎగిరింది ఆ కిటికీలోని డబ్బా జారి క్రిందపడింది.

—నిద్ర లేస్తూనే ఎదురుగా నల్లపిల్లి.

-ఆకులా అల్లల్లాడిపోయిన ఆయన పరుగులాంటి నడకతో పక్క గదిలోకి వెళ్ళాడు.

-పీడకల వచ్చింది కాబోలు గాయత్రి ముఖమంతా భీతావహంగా స్వేదం అలుముకుని వుంది ఒడ్డున పడిన చేపలా ఒళ్ళు విరుచుకుంటోంది.

-ఆమెను పలకరించే ప్రయత్నం చేయకుండా తిన్నగా పూజ గదిలోకి వెళ్ళారు ముద్దహారతి కర్పూరం చేతిలోనే వెలిగించి పట్టుకున్నారు. ఆ అమ్మవారి స్తోత్రపఠనం ప్రారంభించారు.

ఆ అమ్మవారి రూపమొక్కటే తెలుస్తోంది-

చేతిని కాల్చుతున్న హారతి కర్పూరం ఉనికే తెలియడంలేదు.

అమ్మవారి స్తోత్రపఠనం ముగిసింది.

చేతిలో హారతి కర్పూరం హరించుకుపోయింది.



ఆయన అమ్మవారి కుంకుమ తీసుకొని తిన్నగా కూతురున్న గదిలోకి వెళ్ళారు. కుంకుమ దిద్దారు.

విశ్రాంతిగా వెనుదిరిగారు. పడకగదిలోకి వెళ్ళడానికి మనస్కరించక వీధివైపు నడిచారు.

-ఎక్కడ్నించో బుడబుక్కలవాని డమరుకం లీలగా వినిపిస్తోంది.

ఎవర్నో హెచ్చరిస్తున్నాడు బుడబుక్కలయ్య.

చివాలున వెనుదిరిగారు. లోపల గోడకు భక్తాంజనేయుని ఫోటో వుంది. హృదయం చీల్చి సీతారాముల్ని చూపుతున్న ఆ భక్తాగ్రేసరుని రెండు పాదాలపై చేతులుంచి "రామాంజనేయా- భక్తాంజనేయా- ప్రసన్నాంజనేయా- దాసాంజనేయా- నీవిక్కడ వుండగానే ఇదెలా సాధ్యమయింది స్వామీ" అని వేడుకున్నాడు ఆ ఇంటి యజమాని.

దయగల హృదయమే భగవన్నిలయము

* * * *

"గురూ! డింగ్‌డాంగ్ వస్తోంది" అన్నాడు భరణి.

ఆ గురువు — వంశీ!

వారు చెప్పుకునే డింగ్‌డాంగ్- గాయత్రి.

"సవాలు అమలులో వున్నట్టేనా?" గుర్తు చేసాడు శ్రీనుపండు అనబడు శ్రీనివాస్

"యస్....ఆమెతో 'ఐ లవ్ యూ అనిపిస్తాను షి ఈజ్ మైన్— ఈ రోజునుంచి ఆమె వేపు ఎవరయినా కన్నెత్తి చూస్తే ఒక కన్ను కాదు రెండు కళ్ళూ పీకేస్తాను" అన్నాడు వంశీ.

సరిగ్గా అదే సమయంలో-

కాలేజీ ఆవరణ ముందు రిక్షా దిగాడు సుకుమార్.

కూలింగ్ స్పెక్ట్స్ పెట్టుకున్న సుకుమార్ నుద్దేశించి అడిగాడు ఒక మిత్రుడు- "ఏమిటి గురూ- కాలేజీకి కూలింగ్ స్పెక్ట్స్ పెట్టుకుని వస్తున్నావు" అని.

"ఈ అందాలు చూడటానికి రెండు కళ్ళు చాలడంలేదు. నాలుగు కళ్ళతో చూద్దామని"

అప్పుడే బస్ దిగి కాలేజీ ఆవరణలోకి అడుగు పెడ్తున్న గాయత్రి వేపు చూస్తూ అన్నాడు సుకుమార్.

అంతకు క్షణకాలం మునుపే ఆమె వేపు కన్నెత్తి చూసిన వారి రెండు కళ్ళూ పీకేస్తానని వంశీ శపథం చేసాడు.

ఆమె అందాన్ని రెండు కళ్ళతో కాక నాలుగు కళ్ళతో ఆస్వాదించటానికే తాను కూలింగ్ స్పెక్ట్స్ ధరించానని ప్రకటించాడు సుకుమార్!

ఒక సాధారణ మానవుడు-

మరొకరు మంత్ర మహిమాన్వితుడు-

అదే రోజు సాయంత్రం కాన్ఫరెన్సు హాలులో జరిగింది ఈ విచిత్రం-

దాదాపుగా మూడువందలమంది కూర్చునే ఆ హాలులో ఓ విఖ్యాత కవి ప్రసంగం వుంది ఆ ప్రసంగం వినటానికి డిగ్రీ స్టూడెంట్స్ అంతా వచ్చారు.

మొదటి బెంచీ నుంచి ఆఖరి బెంచీ వరకూ అందరూ వేదిక మీద నున్న వ్యక్తికి కన్పించేలా స్టెప్స్ ఉన్నాయి.

ఆ హాలులో....



"గురూ....అవకాశం చిక్కింది. గాయత్రికి మన తడాఖా చూపించాలి" అన్నాడు చిదంబరం వంశీని ఉద్దేశించి.

"అదెంత పని చూద్దాం...." ఆడపిల్లల వెనుక వరుసలో కూర్చుని వున్న వంశీ తదుపరి కార్యక్రమాన్ని రూపకల్పన చేస్తూ భరోసా యిచ్చాడు.

వీరి ముందు కూర్చున్న ఆడపిల్లల్లో గాయత్రి కూడా వుంది.

నాటి ముఖ్య అతిథిని విద్యార్థులకు పరిచయం చేశారు ప్రిన్సిపాల్.

ముఖ్య అతిథి ప్రసంగ కార్యక్రమం ప్రారంభమవుతుండగా జరిగింది-

బ్లాక్ బోర్డు దగ్గర ఉడెన్ ప్లాట్‌ఫారం వుంది. దానికి ఎదురుగా సిమెంటు మెట్లు.... ప్లాట్‌ఫారమ్ దగ్గరున్న వ్యక్తికి మొదటి బెంచీలోని మనిషి ఎంత స్పష్టంగా కనిపిస్తాడో, ఆఖరి బెంచీలోని వ్యక్తి అంతే స్పష్టంగా కనిపిస్తాడు.

ముందు బెంచీలలో గాయత్రి అండ్ కో కూర్చుని వున్నారు. వారి వెనుక బెంచీలో వంశీ అండ్ పార్టీ. గాయత్రికి ఒక అలవాటుంది—క్లాసులో కూర్చున్నప్పుడు కాళ్ళకు వున్న జోళ్ళు విడిచి కూర్చుంటుంది. ఇది గమనించిన వంశీ నెమ్మదిగా తన కాలును ముందుకు చాపాడు. ఆమె చెప్పు ఒకదానిని వెనుకకు లాగాడు. ఆ చెప్పును కాలి సత్తువకొద్దీ తన్నాడు. ఆ చెప్పు జర్రున జారుకుంటూ తిన్నగా వెళ్ళి ముఖ్య అతిథి కాళ్ళ దగ్గర పడింది.

ఈ తతంగం తెలియనివారు అభిప్రాయపడేది-

విద్యార్థులలో ఎవరో కాలి చెప్పు తీసి ముఖ్య అతిథి మీదకు విసిరారు!

ఈ హటాత్పరిణామంతో అందరూ నివ్వెరపోయారు.

ముఖ్య అతిథి సామాన్యుడు కాడు, ఘటనా ఘటన సమర్థుడు.

ప్రిన్సిపాల్, ఇతర సిబ్బంది సమక్షంలో జరిగిందది.

దానితో ప్రిన్సిపాల్ అగ్గిమీద గుగ్గిలం అయ్యారు. చెప్పును చేతిలోకి తీసుకుని "ఈ చెప్పు ఎవరిది.... మర్యాదగా లేచి నిల్చోండి...." అంటూ హూంకరించారు.

ప్రిన్సిపాల్ చేతిలోని చెప్పు చూడగానే తత్తరపాటుగా క్రిందకు చూసింది

ఒకే చెప్పు వుంది. అది తన చెప్పు అని నిర్ధారించుకున్న ఆమె తటాలున లేచి- "క్షమించండి సార్" అంది.

హాలంతా సూది క్రింద పడితే వినిపించేటంత నిశ్శబ్దం ఆవరించింది.



"చెప్పు విసిరినందుకా ఆ క్షమాపణ, లేక...." అని ఆయన యింకా ఏదో చెప్పబోతుండగా "అది విసిరింది నేను కాదు" అంది.

"ఓహో నీ కాలి చెప్పు నీకు తెలియకుండానే ఇక్కడికి పరుగెత్తుకొచ్చిందన్నమాట" అని, "వాదన అనవసరం.... ఘోర పరాభవం. అందరి ముందు కవిగారి కాళ్ళు పట్టుకుని క్షమాపణ కోరుకో.... తర్వాత ఏమిటన్నది నిర్ణయిద్దాం" అన్నారు ప్రిన్సిపాల్ చేతిలోని చెప్పు క్రింద పడేస్తూ.

ఇహ ఆమె తర్జన భర్జన సాగించలేదు. సీటు దగ్గర్నుంచి వేదిక వేపు కదిలింది— అయన కాళ్ళు పట్టుకుని క్షమాపణ చెప్పడానికి.

అప్పుడు విన్పించింది "ఆగండి...." అన్న కేక.

అందరి దృష్టి ఆ కేక విన్పించిన వేపు మళ్ళింది.



'ఆగండి....' అన్న వ్యక్తి 'జ్ఞాననిధి'గా రూపాంతరం చెందిన సుకుమార్.

నెమ్మదిగా కదిలాడతడు.... ఒక మదగజం కదులుతున్నట్లుంది అతడి నడక.... ఆ నడకలో ఒక వెర్సటాలిటీ వుంది.

వేదిక వద్దకు వచ్చి- "మీరు చెప్పు అంటున్నది దీనినేనా...." అంటూ జేబులోని కర్చీఫ్ తీసి అ చెప్పు మీద వేసాడు. చెప్పులో సహా కర్చీఫ్‌ని చేతిలోకి తీసుకున్నాడు ఒక్క నిమిషకాలం తర్వాత కర్చీఫ్ తెరిచాడు ... అందరూ చూస్తుండగా !

ఇప్పుడక్కడ చెప్పులేదు, మల్లెపూల దండ మాత్రమే వుంది.

ఆ దండని అటు ఇటు తిప్పి వాసన చూసాడు. చిత్రంగా క్లాసంతా దట్టమైన మల్లెపూల వాసన వ్యాపించింది.

"గౌరవనీయులయిన ముఖ్య అతిథిగారూ.... పరమ పూజ్యులైన ప్రిన్సిపాల్‌గారూ! మీ కన్ను చెదిరి వుంటుంది.... ఆ అమ్మాయి ముఖ్య అతిథిగారికి పూలమాల వేసే అవకాశం చిక్కక తాను కూర్చున్న చోటు నుంచే పూలమాల విసిరింది- ఆ పూలమాలని మీరు కాలి చెప్పుగా భ్రమపడ్డారు. ఈవిధంగా పూలమాల విసరడం తప్పయితే, అందరి సమక్షంలో ఆమె చేత కాళ్ళు పట్టించి క్షమాపణ చెప్పించండి. లేదా ఈ విషయాన్ని ఇంతటితో మర్చిపోండి" అన్నాడు సుకుమార్.

ఏం జరుగుతుందో తెలియని స్థితి....తాము చూసింది పాదరక్ష? పూలమాల? ఏదన్నది తెల్సుకోలేని స్థితి.

ఆ స్థితి నుంచి ముందుగా తేరుకొన్నది ముఖ్య అతిథి మాత్రమే.

"మాకు సన్మానాలు, అవమానాలు- పూలదండలు, చెప్పుల దండలు- సమానమే పొగడ్తలకు పొంగిపోం, విమర్శలకు కృంగిపోం, ఒక విద్యార్థిని అభినందల మాల సమర్పిస్తుందే గాని పాదరక్ష విసురుతుందా? అలా విసిరితే ఆమె విద్యార్థిని ఎందుకవుతుంది? అన్నారు.

ఆ గండం అలా గడిచినందుకు ప్రిన్సిపాల్, స్టాఫ్‌తోసహా అందరూ గుండెల నిండా గాలి పీల్చుకున్నారు.

పూలమాలతో అక్కడ్నించి కదిలిన 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ ఆ పూలమాలను ఆమె నిలుచున్న చోట క్రిందకు జార విడిచాడు.

చిత్రం– క్రింద పడింది పూలమాల కాదు ఆమె పాదరక్ష!

ఆమె కళ్ళు విశాలమయ్యాయి. ఆమెతోపాటు ఆ బెంచీలో కూర్చున్న మిగతా అమ్మాయిల పరిస్థితి కూడా దాదాపు అలాగే వుంది

జరిగిందేమిటో, జరుగుతున్నదేమిటో అర్థంగాక చూస్తుండిపోయారు వంశీ అండ్ పార్టీ.

వంశీ బృందం కూర్చున్న బెంచీ దగ్గరకు రాగానే కళ్ళజోడు తీసి వారి వైపు చూశాడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్!

చూపులు కలిశాయి.



అది సన్నటి జలదరింపు కాదు. లక్ష ఓల్టుల షాక్- వంశీ బృందానికి.

ఆ క్షణాన తన జీవితానికి గ్రహణం పట్టిందని గాయత్రికి కూడా తెలియదు.

* * * *

"ట్రోయ్...."

"క్యాచ్" అంటూ కుక్కని పిలిచి దూరంగా బంతి విసిరింది గాయత్రి.

ట్రోయ్.... పెంపుడు కుక్క పేరు.

దొర్లుకుంటూ వెళుతున్న బంతిని వెంటాడి పట్టుకున్న ట్రోయ్ అంతే వేగంతో వెనుదిరిగి వచ్చి గాయత్రి కాళ్ళ దగ్గర వదిలింది. తిరిగి



ట్రోయ్‌ని అలర్ట్‌చేస్తూ బంతి విసిరింది గాయత్రి. యథాప్రకారం బంతి వెనుక పరుగెత్తింది ట్రోయ్.

గాయత్రి పెంచుతున్న మరో రెండు మూగజీవాలు-పిల్లి, చిలుక. చిలకకొయ్యకి తగిలించిన ద్రాక్ష గుత్తి నుంచి ఒక్కొక్క ద్రాక్షపండు తీసి క్రిందకు వదుల్తోంది చిలుక, ఆ ద్రాక్షపండు క్రింద పడకుండా పట్టుకుని తెచ్చి గాయత్రీ పాదాల దగ్గర వుంచుతోంది పిల్లి.

పచ్చని పచ్చికలో మూగ జీవాలతో కాలక్షేపం చేస్తున్న గాయత్రి ఇంటి గేటు ముందాగిన రిక్షాని చూడలేదు. రిక్షా దిగి పెరట్లోకి అడుగు పెడుతున్న వ్యక్తినీ చూడలేదు. అందుకే బంతి బలంగా విసిరింది అలవాటు ప్రకారం బంతి వెనుక పరుగు ప్రారంభించిన ట్రోయ్ ఎంత వేగంగా ముందుకి కదిలిందో అంతే వేగంతో తల వెనుకకి త్రిప్పకుండా వెనుకకి పరుగెత్తింది. ద్రాక్ష గుత్తి తెంపి ఒక్కొక్క ద్రాక్షగా విడిచి వేస్తున్న చిలుక రెక్కలు తెగిన దానిలా హఠాత్తుగా గాయత్రి కాళ్ళ దగ్గర వాలింది. కుక్క, పిల్లి ఆమె వెనుక చేరి భయం భయంగా చూస్తున్నాయి.

రిక్షా దిగిన ఆ వ్యక్తి-'జ్ఞాననిధి' అనబడు సుకుమార్!

అతడ్ని గమనించిన ఆమె, "రండి... రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది. "కూర్చోండి....నాన్నగార్ని పిలుస్తాను" అంటూ కుర్చీ చూపించి లోపలికి వెళ్ళింది. ఆమె తండ్రిని వెంటబెట్టుకుని వచ్చేసరికి అతడక్కడ లేడు. ఆమె గమనించలేదు. తన కర్చీఫ్ అక్కడ లేదని!

గాయత్రిని నిత్యం ఉపాసించే ఆమె తండ్రి భృకుటి ముడిపడింది.

గొంతు నులిమినట్టు చిలుక పలుకురాక చిత్తరువులా మిగిలిపోయింది

* * * *

"అగ్ని స్తంభన యంత్రం"

ఆ హోమగుండం నిలువెత్తున వున్నది.

దానిలో అగ్ని రగుల్తోంది.

ఆ అగ్నికి మేడి కలప, ఆవు నెయ్యి అర్పిస్తున్నారు.

హృదయాన్ని చీల్చి చదవటంలో మేటి-

బ్రహ్మాండమైన విగ్రహం-

అగ్నివంటి మనిషి-

ముక్కంటి మూడవ నేత్రం నుంచి వెలువడే అగ్ని జ్వాలల్లా వున్నాయి అతడి చూపులు-

అతడి భీకర వికృతాసనం కాలుడి దున్నపోతు దర్శనంలా వుంది.



దండతాడిత భుజంగం బుస్సున తోకపై లేచి నిల్చున్నట్లున్నాడు.

ఆయన చూపుల ధాటికి తట్టుకోవడం కష్టంగా వుంది.

భూర్జ పత్రం మీద మంచి గంధం-గోరోజనం-అఖండమును కలిపిన దానిలో తన పేరును లిఖించి ఒంటి రేఖతో వృత్తాన్ని ఏర్పరిచాడు దాని నలువైపుల 'వం' అనే బీజాక్షరాన్ని రాసి పైన చతుఃకోణాన్ని లిఖించాడు.

ఆ మంత్రానికి దశమిధ వహ్నికళల ప్రాప్తికి పుష్పాక్షతలతో మంత్రాన్ని పూజిస్తూ మంత్ర పఠనం ప్రారంభించాడు. దీనివలన సాధకుడు అనుష్టించే మంత్రానికి ప్రాణ కళలు ప్రాప్తిస్తాయి.

యం—ధూమ్రార్చిషా కళాయైనమః

రం—ఊష్మాకళాయై నమః



లం—జ్వలినీ కళాయై నమః

వం—జ్వాలినీ కళాయై నమః

శం—విస్ఫులింగినీ కళాయై నమః

షం—సుశ్రీకళాయై నమః

సం—సురూపా కళాయై నమః

హం—కపిలా కళాయై నమః

ళం—హవ్యవాహకళాయై నమః

క్షం—కన్యవాహకళాయై నమః

ఆ యంత్రానికి పూజచేసి బ్రాహ్మణునికి స్వయంపాకం సమర్పించాడు. ఆ మంత్రాన్ని మూడు లోహాలతో చేసిన తాయెత్తు నందుంచి దండము మీద ధరించాడు—'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.

వాస్తవానికి ఈ విద్యలు—ముద్రలు ఆర్జించడానికి కొన్ని సంవత్సరాల సాధన అవసరం. కానీ ఆచార్య కాలనేమివారు తమ సాధన సంపత్తిని ధారపోయడంతో ఆధ్యాత్మికంగా సుసంపన్నుడయ్యాడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.




అప్పుడు దిగాడు హోమగుండంలోకి.

—ఆ యంత్రం ఏ ఇంట్లో వుంటే ఆ ఇంటికి అగ్ని భయ లేదు.

—ఆ యంత్రం ఎవరి శరీరంపై వుంటే ఆ వ్యక్తిని అగ్ని బాధించదు.

—ఆ యంత్రం ధరించిన సాధకుడు అగ్నిదేవుడ్ని పూజిస్తే శీఘ్రంగా దర్శనమిస్తాడు. కోరిన కోరికలు ప్రసాదిస్తాడు.

మంత్ర పఠనంలో ప్రతి అక్షరానికీ, మాటకీ నిర్దిష్టమైన అర్థం వుంది. ధ్యేయం వుంది. మాడ్యులేషన్ - డిక్షన్ అతి ప్రధానం!

హోమగుండంలోని మేడికలప, ఆవునెయ్యి సుడులు తిరుగుతోంది.

నిలువెత్తు అగ్ని జ్వాలల మధ్య నిలబడి వున్నాడతను.

మంత్రం పఠనంవలన అతడిలో వెల్లుబుకుతున్న భావావేశం అతడి కళ్ళతో....కనుబొమ్మల్లో....మొహం అంతా ప్రతిఫలిస్తోంది.

ఆ కంఠధ్వని సమిధలు చేరుస్తూ ఆవునెయ్యి అర్పిస్తున్న వారి శ్రవణ రంధ్రాలలో గిరుగిరు మంటున్నాయి.

జ్ఞాననిధి బాహ్య దృషికి కనిపించే సర్వ చరాచర ప్రపంచమూ అతడి దృష్టి పథాన్నుంచి నిష్క్రమించింది. అతని ప్రపంచమతనిది.

అతని శరీరంలో తీవ్రమైన సంచలనం ప్రారంభమయింది.

ఎర్రని జ్వాలల మధ్య...మెగ్నీషియం తీగ మండినట్లు తెల్లని వెలుగు దర్శనమిచ్చింది.

ఆ వెలుగుని....ఆ తీవ్రతని సామాన్య మానవుడు చూడలేడు. కానీ గురుకృప పొందిన 'జ్ఞాననిధి' ఆ సూర్య భగవానునికి నమస్కరించాడు.

దేవ దేవా....మీ దర్శన భాగ్యంతో నా జన్మధన్యమయింది.



నశించడం, కృశించడం లేని అర్ధనారీశ్వర తత్వాన్ని ప్రసాదించండి స్వామీ...." అని వేడుకున్నాడు.

ఊర్ధ్వరేతస్కత....

రేతస్సు క్రింగకు దిగకుండా, ఊర్ధ్వ భాగానికి నడిపించేవాడు....రేతః పతనం కానివాడు 'ఊర్ధ్వరేతస్కుడు.'

శివునికి వున్న అనేక పేర్లలో ఇదొకటి.

నాడీ మండలంలోని ఉద్రేకాన్ని, ఉష్ణాన్ని తగ్గించేది 'రతి'.

ఈ రతి క్రియలో రేతః పతనం కాకుండా ఊర్ధ్వభాగానికి నడపడం ఒక సాధన.

జన్మరాహిత్యానికి ఉత్తమ సాధన 'భగపూజ'

భగపూజ చేయగలిగినవాడు శివుడవుతాడు.

ఈ భగపూజ అనేది ఓ కఠోర దీక్ష.

ఈ దీక్షని సక్రమంగా నిర్వర్తించలేనివాడు పిచ్చివాడవుతాడు.

ఇది ఒకరు ధారాదత్తం చేస్తే సంక్రమించేది కాదు. ఉపాసించి సాధించాలి.

ఈ భగపూజ రెండు విధాలు.

స్త్రీతో సంగమం

శవంతో సంగమం

స్త్రీతో సంగమం-జన్మ రాహిత్యానికి.

శవంతో సంగమం-ఈ జన్మలో అతీంద్రియ శక్తుల సాధనకు.

పరమేశ్వరుడు ఎప్పుడూ ధ్యానముద్రలో కనిపిస్తాడు.

అంటే-తనలో తాను ధ్యానత్వం చెందుతున్నాడన్న మాట.

ధ్యానానికి ఇది పరాకాష్ఠ.

'శివ శక్త్యాత్మకం బ్రహ్మ' అన్నారు.

'ం' నుంచి ప్రారంభమై అనంతానికి వ్యాపిస్తుంది.

అదే 'అవధూత' తత్వం.

He is the unseen guest in every meal.

He is the silent diftener in every conversation

He is the unknown participant in every five function.

అణిమ-అతి చిన్న

మహిమ–అతి పెద్ద

లఘిమ-అతి తేలిక

గరిమ-అతి బరువయిన

ప్రాప్తి-కోరుకున్నది

ప్రాకామ్యమ్-కావలసిన రూపం

ఈశత్వం-అన్నిటా అధికారం

వశత్వం-అందర్నీ వశీకరించుకోవడం

—ఇవే అష్టసిద్ధులు....

అదే ఈశ్వరత్వం!

అదే 'అవధూత' తత్వం!



అదే జన్మరాహిత్యం.

బాల-పసిపాప తత్వం

ఉన్మత్త-పిచ్చివాడి తత్వం

పిశాచ-నిశాచరుడు, ప్రకృతి శక్తులేవీ వీడ్ని కదిలించలేవు.

తర్వాత దశ-'అవధూత'

సూర్యభగవానుడు ఈ విధంగా ఉపదేశించి అంతర్ధానమయ్యాడు.

హోమగుండం నుంచి బయటకు వచ్చిన 'జ్ఞాన నిధి' అనబడు సుకుమార్ అన్ని సంవత్సరాలు సాధనతో సాధించడానికి ఇష్టపడలేదు. శీఘ్రంగా సాధించడానికి కంకణం కట్టుకున్నాడు.

అతడు ఎన్నుకున్న మార్గం:

అఘోరేశ్వర తత్వం.

బాహ్య ప్రపంచంతో అనుసంధానమయ్యేవాడు బాల:

మరో ప్రపంచంతో అనుసంధానమయ్యేవాడు యోగి

సాధనద్వారా ముక్తిని కనుగొనేవాడు యోగి.

లాజిక్‌ద్వారా విముక్తిని పొందేవాడు అఘోర.

* * * *

కూతురి పేరున శని జపం చేస్తున్నారు నారాయణాచార్యులవారు.

ఆ కూతురి పేరు- గాయత్రి.

శనికి 19,000 సార్లు జపం చేస్తున్నారాయన.

జపమాల మధ్యలో తెగిపోవడంతో ఆ రోజుకి జపానికి స్వస్తి పలికి లేచారు. జపం అనంతరం ప్రసాదం కొంత భాగం తీసుకుని

వెళ్ళి తూర్పు గోడమీద పెట్టి వెనుదిరగకుండా వస్తారు. కాళ్ళు, చేతులూ, ముఖమూ కడుక్కుని పుక్కిలించి గాని ఇంట్లోకి ప్రవేశించరు అప్పటికి గాయత్రి తీర్థప్రసాదాలు తీసుకుంటుంది.

నిర్ణీత సమయానికి నిత్యం ప్రసాదం గోడమీద పెడతారు గనక కాకి ఒకటి వచ్చి ఆ గోడమీద సిద్ధంగా వుంటుంది.

శని వాహనం కాకి-ఆ రూపంలో శని దేవునికి ప్రసాదం అందించని తృప్తిపడతారాయన.

ఆరోజు పూజలో జపమాల పెరిగినందుకు కాదు ఆయన కలవరపడింది-నిత్యం గోడమీద వుండే కాకిస్థానంలో ఓ నల్లపిల్లి కూర్చుని వుంది.

అపశకునం అయిదు రంగులలో కనిపించిందాయనకి.

* * * *



ప్రిన్సిపాల్ గారినుంచి కబురొచ్చినందుకు వారు ఆశ్చర్యపడలేదు.

కాకపోతే తమని వారి యింటివద్ద కలవమన్నందుకు వారు ఆశ్చర్యపడ్డారు.

"అవును గురూ! నీవు ఆ పోరిచెప్పు తీసి ముందుకు తన్నితే ఆ చెప్పుని సుకుమార్ పూలదండ ఎలా చేశాడు గురూ?" వంశీని ఉద్దేశించి అడిగాడు ప్రభాకర్.

"అదేదో కనికట్టు అయి వుంటుంది గురూ..." అని తేల్చేశాడు శ్రీనివాస్

"అది కనికట్టు అయినా, అద్భుత శక్తి అయినా–ఆ సమయంలో హీరో మాత్రం వాడే" అన్నాడు భరణి.



"అది నిజమేరా... ప్రిన్సిపాల్‌గారి దగ్గర్నించి స్టాఫ్-స్టూడెంట్స్ కూడా గొప్ప టెన్షన్‌లో పడిపోతే సిచ్యుయేషన్‌ని సేవ్ చేసిందిమాత్రం వాడే" అన్నాడు చిదంబరం.

"ఎస్! ఆరోజు వాడిదే... మనం చెత్తగా చిత్తయిపోయాలి" కలలో పలవరించినట్టుగా అన్నాడు వంశీ.

"ఆ రోజున కాదు, ఈరోజున చిత్తయిపోతున్నాం. ప్రిన్సిపాల్ గారు కాలేజీలో పిలిచి వుంటే మొహం వాచేట్టు తిట్టేవారు, లేదా సస్పెండ్ చేసి వుండేవారు. కానీ ఇప్పుడు ఇంటికి పిలిచారు. ఏం చేస్తారో ఏమో" భరణి.

"ఇంతకి ఆ ఘనకార్యం మనదేనని ప్రిన్సిపాల్‌కి తెలిసిందంటావా?" ప్రభాకర్ సందేహం.

"ఇంకా అనుమానమా? ఈ కాలేజీలో ఇంత దౌర్భాగ్యం మన ప్రతాపం కాకపోతే మరెవరిది?"–శ్రీనివాస్.

"ఆయనను కలవబోతున్నాంగా! ఇప్పుడే బుర్ర బద్దలు కొట్టుకోవడం దేనికి?" అని సమాధానపరిచాడు వంశీ.

ఆ సాయంత్రం అంతా కట్టకట్టుకుని ప్రిన్సిపాల్‌గారి ఇంటికి వెళ్ళారు.

వారు ఊహించినదానికి భిన్నంగా రిసెప్షన్ లభించింది. కాలేజీలో ఏమీ జరగనట్టే ప్రవర్తించసాగారు.

లాన్‌లో కుర్చీలు వేయించుకొని కూర్చున్నారు!

ప్రతి ఒక్కరి కుటుంబ విషయాలు అడిగి తెలుసుకొంటూండగా వచ్చింది గాయత్రి ట్రేలో కూల్‌డ్రింక్స్ పెట్టుకుని.

"మా అమ్మాయి గాయత్రి" పరిచయం చేశాడు ప్రిన్సిపాల్.

సన్నటి జలదరింపు కాదది, లక్ష ఓల్టుల షాక్!

"'ఐ లవ్ యూ' అని నీతోనే అనిపిస్తాను పందెం"

....ఒకరోజున తాను విసిరిన సవాలు గుర్తుకొచ్చింది వంశీకి.

నిశ్శబ్ద జలాశయపు అడుగున వున్నట్టుండి విస్ఫోటనం జ[రిగి]నట్టు త్రుళ్ళిపడ్డారు వంశీ అండ్ కో.

అరచేతులు చెమటలు పట్టసాగాయి.

"తీసుకోండి...." ట్రేలోని స్నాక్స్, డ్రింక్స్ ఆఫర్ చేసి[ంది] గాయత్రి.

తాము ఇంతకాలం టీజ్ చేసింది ప్రిన్సిపాల్ గారమ్మాయి[ని]!

"బోయ్స్....తీసుకోండి, ఇది కాలేజీ కాదు, ప్రిన్స్‌పాల్ రూ[మ్] అంతకన్నా కాదు. ఇక్కడ మన మధ్య జరిగేదేదీ అఫీషియల్ కా[దు]. స్నేహితులుగా మాట్లాడుకుందాం. సుకుమార్ మల్లెమాలతీశాడు. అదెల[ా] సాధ్యం? పైపెచ్చు ఆ మాల గుబాళింపు కూడా విచిత్రంగా వుంది. కునేగా స్మెల్ వచ్చింది. ఆ టెన్షన్‌లో ఎవరూ ఈ విషయం గమనించ[లే]దు. కొందరు దీనిని కనికట్టుగా భావిస్తున్నారు, మరికొందరు నిజ[ం]గానే మల్లెమాల విసిరేసినట్టు అభిప్రాయపడుతున్నారు. నాకెందుకో ఈ రెండూ నిజం కాదనిపిస్తోంది. ఏదో జరుగుతోంది. అదేమిటో తెలుసు[]కోవాలంటే, ఆ రోజున అసలేం జరిగిందన్నది తెలియాలి—" అన్న[ా]రు గారు ప్రిన్సిపాల్,

సుకుమార్ ఆ సమయంలో ప్రదర్శించింది గారడీ విద్యా? లేక అతడికి అతీంద్రియ శక్తులు వున్నాయా?

ఇంత చిన్న వయసులో అంతటి ధారణీవిద్య లెలా ఆర్జించ[]గలిగాడు?

ఇవీ ఆయన తెలుసుకోవాలనుకుంటున్న అసలు విషయాలు.



గాయత్రి ఖాళీ ట్రేతో లోపలికి వెళ్ళింది.

అప్పటికిగాని వంశీ అండ్‌కోకి ధైర్యం కలగలేదు.

"లేదు సార్....వంశీగాడే గాయత్రి చెప్పుని కాలితో లాగిదయాన్ ముందుకి తన్నాడు...." అన్నాడు ధరణి.

"అవున్సార్...." అంటూ ఆ రోజున జరిగింది జరిగినట్టు పూస గుచ్చినట్టు చెప్పాడు వంశీ.

దాదాపుగా గాయత్రి చెప్పిన విషయం, వంశీ చెప్పిన విషయం ఒక్కటే! ప్రిన్సిపాల్-నారాయణాచార్యులు—ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి.

* * * *



అక్కడ ప్రకృతి అంతా ఫిట్స్ వచ్చి పడిపోయినట్టు స్తంభించి వుంది.

అతడి కళ్ళలో ఏదో భావ పరంపర పెల్లుబుకుతోంది. పెద వులు ఏదో జపించడానికి అన్నట్టు సన్నద్ధమవుతున్నాయి. గొంతు కడుపులోని శబ్దాలను పేర్చుకుంటున్నట్టు గుటకలు వేస్తోంది.

చందమామను పాము పట్టేసినట్టుంది.

నిలువెల్లా విషం వ్యాపించిన ఆ వెన్నముద్ద నల్లగా మారి పోయింది.

అతడి ఎదురుగా ఆమె-ముడివిడిన జుట్టు ముఖమంతా వ్యాపించి వుంది.

ఆమె నగ్నంగా వుంది. పూల పుప్పొడి పులిమినట్టున్న ఎర్రని శరీరంపై గుండెలమీద రెండు కుంకుడు గింజలు పెట్టుకున్నట్టున్నాయి పుగ్రాగ భాగాలు.

ఆమె శరీరంలో ప్రతి అవయవమూ పెద్దదే!

అయితే అతడు ఇదేమీ గమనించే స్థితిలో లేడు.

ప్రతిమలా వుందామె-నిర్జీవ ప్రతిమ ఆమె.

ప్రాచీనులు లోకకళ్యాణం కోసమే తమకు తెలిసిన విద్యలన్నింటినే అంకితం చేశారు. లోకకళ్యాణం కోసమే ఆ విద్యల్ని సాధించాలన్న తపనతో ఎన్నో అద్భుతమైన త్యాగాలు చేశారు. కానీ ఈ భ్రష్టాచారి అడ్డదోవన పరమహంసతత్వాన్ని ఆకళింపు చేసుకుంటున్నాడు. శవంతో సంభోగించబోతున్నాడు. సంభోగించడానికి ముందు కొన్ని ప్రకృతి శక్తుల్ని స్వాధీనం చేసుకుంటున్నాడు.

అతడు— 'జ్ఞాననిధి'గా మారిన సుకుమార్.

నేలమీద పెద్ద ముగ్గువేసి వుంది. దానిదమీ పసుపు, కుంకుమ చల్లివున్నాయి. ఆ ముగ్గుమీద శవాన్ని పడుకోబెట్టాడు.



ఆ శవం తల ఆగ్నేయ దిశకు, కాళ్ళు నైరుతి దిశకు వుండేలా వెల్లకిలా పడుకోబెట్టాడు. ఆ శవంపైనే గాదు, అతడి శరీరంపై కూడా నూలుపోగు అనేది లేదు. ఆ శవంపై పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. కూర్చునే ముందు మంత్రాలు చదువుతూ శవం చుట్టూ ముగ్గలాంటి తెల్లనిపొడి చల్లాడు. ఆ తరువాత శవంమీద కూచున్నాడు. గుప్పెడు హారతి కర్పూరం తీసుకుని శవం నుదుటిపై పెట్టి వెలిగించాడు.

"శరీరేణ జితాస్సర్వే శరీరం యోగి ఖర్జితం"

"శరీరం అందర్నీ జయిస్తుంది, కానీ శరీరాన్ని యోగి జయిస్తాడు" అని ఉపనిషత్తులు ఉద్బోధిస్తాయి.

సరైన సమయంలో—ప్రదేశంలో-పద్ధతిలో యోగాభ్యాసంచేస్తే-

యమ నియమాలను పాటిస్తే-



ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారాలను ఆచరిస్తే-

ధ్యాన, ధారణ, సమాధులను పొందగలిగితే-

అతడికి శరీరం స్వాధీనమౌతుంది.

అతడు మహాయోగి అవుతాడు.

యోగశాస్త్రానికి సంబంధించిన ఇరవైరెండు ఉపనిషత్తులను ఆపోశనం పట్టినవాడు, కాయకల్పం పొందిన 'మహాయోగి' ఆచార్యతాలనేమి ఈ శవ పూజలు, శవ సంపర్కాలు చేయలేదు. అన్ని విద్యలూ ఆయనకు తెలిసినా క్షుద్రాన్ని ఉపాసించలేదు. శాంతి పూజలే చేశారు. ఆయన తనకు తెలిసిన సమస్త విద్యల్ని జ్ఞాననిధికి ధారపోయడం వలన కేచరి, జలంధరి, ఉడ్డీయాణం, వాదబిందు, జ్ఞానబిందు లాంటి క్షుద్ర విద్యలు కూడా అలవడ్డాయి.

యోగ శాస్త్రోపనిషత్తుల లక్ష్యం సమాధి స్థితిని పొందటమే!

క్షుద్రాన్ని ఉపాసించి సమాధి స్థితిని పొందడానికి ప్రయత్నిస్తున్న 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ శవంతో సంభోగిస్తున్నాడు.

పరమహంస స్థాయికి చేరేవారికి ఉచ్చనీచాలుండవు- శవానికి స్త్రీకి తేడా వుండదు, ఇది తినవచ్చు-అది తినకూడదు అని వుండదు—ఇక్కడ పడుకోవచ్చు అక్కడ పడుకోరాదు అని వుండదు.

ఒక్క వాక్యంలో చెప్పాలంటే వారు మానసికంగా ఇవేమీ గమనించే స్థితిలో వుండరు.

కొన్ని సంవత్సరాల తరబడి సాగించే ఉపాసన ద్వారా వారు మానసికంగా ఆ స్థితికి చేరతారు. ఆ స్థితికి చేరినవారు ఏ యే పనులు చేస్తారో, ఎలా జీవిస్తారో ఆలా చేయడం వలన....అలా జీవించడంవలన ఆ స్థితిని అపాదించుకుంటాడు 'అఘోర'.

సంభోగంలో రేతః పతనం కారాదు.

శవంమీద కూర్చోవడంతో, సాధకుని ఖరువుకి శవంలోని గాలి బయటకుపోవడం—శబ్దం రావడం—కదలడం జరుగుతుంది. ఈ హఠా త్పరిణామంతో భయపడేవారు, మతి భ్రమించే సాధకులు ఎందరో!

శవ సంభోగం సామాన్య విషయం కాదు. శరీరం బిగుసుకు పోవడం కద్దు. అంగప్రవేశం బహు కష్టసాధ్యం.

ఒక్కో దేవతను ప్రసన్నం చేసుకోవడానికి ఒకో తరహాపూలతో పూజించినట్లే కొన్ని కొన్ని సిద్ధులను పొందడానికి కొన్ని జాతుల స్త్రీలతో సంభోగించడం, భగపూజ చేయడం కద్దు.

స్త్రీలందరూ అన్ని రకాల పూజలకు పనికిరారు.

జాతకరీత్యా-

వారి వారి శరీర నిర్మాణాన్ని బట్టి-

వారి ప్రవర్తనను బట్టి స్త్రీలను 20 రకాలుగా విభజించారు.

## 1. పద్మినీ :

దయార్ద్ర హృదయం. అమిత ప్రేమ, అనురాగం వలకబోస్తూ అత్యంత సుందరంగా ఈమె వుంటుంది. నడకలో హంసగమనం. విశాలమైన నేత్రాలు, సన్నటి నడుము, పొడుగాటి జడ, లోతైన నాభి కల్గి వుంటుంది. తల్లిదండ్రుల ఎడ ప్రేమాభిమానాలు మెండు. శరీరం నుండి ఒక విధమైన పద్మముల నుండి విరజిమ్మే సుగంధం కలిగి వుంటుంది.

అందానికి తగ్గగుణం, భర్తను సంపూర్ణంగా సుఖపెట్టడం ఈమె లక్షణం. అదృష్టవంతురాలు, తక్కువ సంతతి కలిగివుంటుంది.

## 2. చిత్రాణి:

విశ్వాసం కలిగి ప్రేమానురాగంతో వుంటారు. వారి అందాలకు



వారే మురిసిపోతారు. ఎక్కువ శ్రమపడరు. తెలివి తేటలు కలిగి వుంటారు. ఈ జాతి స్త్రీలు శిరస్సు గుండ్రముగా వుండి, చురుకైన నేత్రాలు గలిగి వుంటారు. గమనంలో ఏనుగువలె వుండి, నెమలివలె మాట్లాడుతారు. ఇట్టి స్త్రీలకు అతి సుకుమార శరీరం, అమిత సిగ్గు. భర్తను నృత్యముతోను, ప్రేమ, అందములతో అలరిస్తారు.

## 3. హస్తిని:

భర్తయొక్క కోర్కెలకు అనుగుణంగా ప్రవర్తించే స్త్రీ ఈమె. అమిత కాముకత్వం ఉండటం సహజం లక్షణం. దృఢంగా వుంటుంది. లజ్జ, సిగ్గు, అమితంగా వుండవు. ముక్కు, పెదవులు, మెడ మందంగా వుంటాయి. నేత్రములు చిన్నవిగా వుంటాయి. అవి పసిమివర్ణంగానూ వుంటాయి పెదములు మందంగా వుండి, నడక ఏనుగువలె వుంటుంది అంతలోనే కోపం, ప్రశ్నలు కురిపించడం వారి సహ లక్షణం. భర్తలో తృప్తి అంతగా చెందక, పర పురుషుల సంబంధం ఏర్పరచుకోవాలని మనసు ఉవ్విళ్ళూరుతుంది.

## 4. శంఖిని:

పొడవుగా వుండి, వేల అదిరేటట్లు నడుస్తారు. నడిచేటప్పుడు పిరుదులు కదుల్తాయి. కళ్ళు వక్రంగా వుంటాయి. శరీరం లావణ్యంగా వుండదు. వీరు అధికృతకోసం ప్రాకులాడుతారు. అనుక్షణం కామప్రకోపులైవుంటారు. మత్తుపానీయాలపట్ల మోజు ఎక్కువ. పరపురుషులపై ప్రేమ అధికం.

## 5. పద్మినీ:

భర్తపట్ల ప్రేమ, అనురాగం. సర్వసాధారణ ప్రవృత్తి. సిగ్గు, బిడియం అందంగా వుంటుంది. మధురమైన గొంతు- భర్తను అన్ని విధాల సుఖపెట్టుటలో ఆరితేరి ఉందురు.

6. మైత్రాయని:

అపురూప సౌందర్య లావణ్యవతి. ఇతరులను ఆకర్షిస్తారు. పని చేసేటప్పుడు నటిస్తారు. అయితే ఈమెకు లభించే భర్త ఈమె అందాన్ని ఇతరులు చూస్తున్నారే అన్న తలంపుతో క్రూరుడిగా ప్రవర్తించే శాడిస్టుగా మారడం ఈ జాతి స్త్రీ చేసుకున్న దురదృష్టం. సంసార జీవితం అంత సుఖప్రదంగా వుండదు. ప్రతివారూ ఈమెను ఆకర్షిస్తారు కానీ.... ఈమె పర పురుషుల జోలికి పోదు-అని శాస్త్రవచనం.

7. కలహకారిణి:

కనుబొమలను తరచూ ఆడిస్తూ వుంటుంది. నడుస్తున్నప్పుడు దున్నపోతులా ఉంటారు. మీద ఇసుక చల్లినా పట్టించుకోరు. ద్వేషం వస్తే-భర్తను సైతం చంపడానికి వెనుకాడదు. ఇతరులతో సంబంధం పెట్టుకోవడం వారి తెలివి తేటలుగా భావిస్తారు.

8. గృహస్థిణి:

పేరులోనే గృహలక్ష్మి ఈమె. సంసారం-తాపత్రయం అధికం. భర్తకు అనుకూలంగా వుంటుంది. మితంగా మాట్లాడుతుంది ఇతరులను మోసం చేయదు. పరపురుషులను ప్రేమించదు. సౌందర్యంకోసం పాటుపడరు. కుటుంబ గౌరవం కోసం పాటుపడే ఇల్లాలు.

9. ఆతుర:

ప్రతి పని చకచక చేయాలనుకుంటారు. సర్వ సాధారణ సౌందర్యం. భర్తపై ప్రేమ-తరచూ భర్తతో ఘోరంగా కలహం వహించడం జరుగుతుంది. ఇటువంటి స్త్రీ మనోభావాలు ఇతరులు అవగాహన చేసుకోవడం కష్టమే మరి.

10. భయాతుర:

అందమైన శరీరఛాయ. నాజూకుతనం. మాటల్లో బెరుకు. ఏకాంతంగా వుండలేరు. అందర్నీ ప్రేమించే మనస్తత్వం. రెలిజియస్ మెంటాలిటీ అధికం.



11. ఢాకిని:

నవ్వుతూ మాటల్తో మోసంచేసే వనిత ఈమె. కళ్ళు ఎర్రగా వుంటాయి. బాహ్యంగా అమితప్రేమను ఒలకబోస్తారు. అంతర్యంలో ఆశపోతు ఇతరులను సులభంగా మోసగిస్తుంది. ఈమె స్నేహం పాముతో చెలిమిలాంటిది. ఈమెతో భర్త జీవితం దుర్లభం.

12. హంసిని:

హంసగమన నడక. చాలా ఆనందమైన జీవితం గడపగలది. సునిశిత పరిశీలన. ఎల్లప్పుడూ నిజానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. అందరితో ప్రేమాస్పదంగా సంభాషిస్తుంది. అదృష్ట చిహ్నం శ్వేతవర్ణ ఛాయ కలిగివుంటుంది.

13. బహువంశిని:

తెల్లని శరీర ఛాయ. గృహ జీవితం పట్ల ఆసక్తి. భర్త ప్రేమానురాగాలు పొందుతుంది. సంఘంలో గౌరవింపబడే వనిత.

14. క్రిపాణి:

సిగ్గు, బిడియం అంటే ఏమిటో తెలియని వనిత. బలహీనంగా సన్నగా వుంటుంది. చెడు ప్రవర్తన కలిగి వుంటుంది ఎవరితో ఏ విషయాన్నైనా నిర్భయంగా మాట్లాడుతుంది ధనం కోసం ఎవరితోనైనా కలిసి నిద్రిస్తుంది.

15. ఘటిని:

తెలివి తన సొత్తుగా ఇతరులను సులభంగా మోసగిస్తుంది. పైకి

తేనె లొలికే పలుకులు పలుకుతూ మనసులో విషాన్ని నింపుకునే మనస్తత్వం-అబద్ధాల పుట్ట ఈమె.

## 16. ప్రేమిని:

అందంగా వుంటుంది. భర్తతో ప్రేమింపబడే స్త్రీ ఇతరులకు సహాయకారిణిగా వుండి త్యాగగుణం కల్గి చిరునవ్వుతో ఇతరులను పలుకరిస్తుంది. పొడవైన జుత్తు ఈమె సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తుంది.

## 17. క్రిష్టాన్వి:

తానే తెలివిగలదానన్న నమ్మకం. కోపదారి గుణం ఇతరులతో పలికేటప్పుడు తత్తరపాటు గుణం కల్గిన వనిత.

## 18. మదమత్తిని:

కామవాంఛ అధికంగా గల్గినది. పురుషులను ఎల్లప్పుడూ తన వేపు తిప్పుకోగల తత్త్వం. వ్యభిచారిణి. ఏ ప్రదేశంలోనూ స్థిరంగా వుండదు.



## 19. కుల్చిహేదిని:

ఈమె Iron Leg.

గౌరవం గూర్చి పట్టించుకోదు. అమె మేలు అమెకుంటే చాలు అన్న లక్ష్యం గలది. వ్యభిచారిణి.

## 20. నరకి:

చిన్న కళ్ళు. పాపం చేయాలనే తలంపులోనుండి పైకి మాత్రం వేదాలను వల్లిస్తుంది. ఇతరులను మోసంచేసే గుణం కలది.

## 21. వర్జిని:

పవిత్రమైన మతపరమైన ఆలోచనలు. అందరిలో సత్ప్రవర్తన భగవత్ ప్రార్థనలన్న మోజు. పెద్దలు-పిల్లల్ని గౌరవించే తత్త్వం, మృదుభాషిణి సంఘంలో గౌరవం. భర్తను గౌరవించడంఈమె లక్ష్యం



తాను సంభోగించబోతున్నది పద్మినీజాతి స్త్రీనని గుర్తించగానే 'జ్ఞానసిధి' అనబడు సుకుమార్‌లో ఒక విచిత్రమయిన ఆలోచన చోటు చేసుకుంది.

### శవాన్ని నిద్ర లేపితే?

శవంలో చైతన్యం తీసుకొచ్చి, శవం నాలుక బయటకు లాగి కత్తిరించి తమ దగ్గర జాగ్రత్తగా దాచుకుంటారు; దండంలా వాడుకుంటారు సాధకులు, ఇది ఎవరివద్ద వుంటే వారికి అతీంద్రియ శక్తులు స్వాధీనమవుతాయని వారి నమ్మకం. అయితే, నిద్రలేచిన శవం వేయి ఏనుగులతో సమానం. వేయి ఏనుగుల బలమున్న ఆ స్త్రీని లొంగదీయ లేకపోతే....

# 9

### అష్టమి చంద్ర విభ్రాజ

విష్టాగరిష్టులు మనసా వాచా చతుర్విధ కర్మలు జరుపుతూ నక్షత్ర, నవగ్రహ, అష్టదిక్పాలక, సప్తఋషులతోపాటు షోడశాక్షర ('అ' నుండి 'అః' వరకు) అమావాస్య మొదలు పౌర్ణమి వరకుగల అధిదేవతలకు, చంద్రకళలకు (16) జరుగు యజ్ఞమే- అష్టమి చంద్ర విభ్రాజ.

ప్రతిరోజు రాత్రి 6-30 గంటలనుండి అమ్మవారికి సుహాసినీ పూజలు సల్పుతూ- పౌర్ణమిరోజు రాత్రికి జరిగే పూజని బయలు ప్రదేశములో చంద్రునకు ఎదురుగా చేస్తారు. భక్తుల మనసెరిగి భగవంతుడు ఆ రూపంలో దర్శనమిస్తాడు.

16 నక్షత్రములు—

16 అంటారూపాలు—

16 అధిదేవతలు—

16 ఆకర్షణ శక్తులకి

జరిపేపూజ అద్భుత ఫలితాన్ని ఇస్తుంది. కానీ సుకుమారుడు శాంతిపూజల్ని ఎన్నుకోలేదు. క్షుద్రపూజల్ని ప్రారంభించాడు. అందులో భాగంగా శవాన్ని నిద్రలేపే ప్రయత్నం చేస్తున్నాడు. లోక కళ్యాణానికి శాంతి పూజలు చేయవలసినవాడు భ్రష్టుడయి క్షుద్రపూజలు చేస్తున్నాడు.

పసుపు-కుంకుమ—సున్నంతో మూడురకాల ముగ్గులేసి వున్నారు నేలమీద!

ఆ ముగ్గుమీద వెల్లకిలా పడివుంది స్త్రీ శవం.

ఆ శవంపీద సుకుమారుడు. ముందుగా నుదుటిపై హారతి వెలిగించాడు. తర్వాత శవం చెవిదగ్గర మంత్రపఠనం ప్రారంభించాడు. మంత్రోచ్చారణ పతాకస్థాయికి చేరుతున్నకొద్దీ శవంలో చలనం ఆరంభమైంది.

శవం కదలికలకు అనుగుణంగా తన శరీరాన్ని మలుచుకోసాగాడు.

అదొక విచిత్రమయిన పరిస్థితి.

శవం చెవివద్ద మంత్రపఠనం ఆగితే జీవం పోసుకుంటున్న శరీరం నిర్జీవమవుతుంది.

శవంలేస్తే, శవంపై అచ్ఛాదనగానున్న అతడు క్రింద పడతాడు.

నిద్ర మేల్కొన్న శవానికి పది ఏనుగుల బలం వుంటుంది. నిద్రమేల్కొన్న శవం ముందుగా దాడిచేసేది శవసాధకునిపైనే....



శవాన్ని నిద్రలేపడానికి మంత్రపఠనం కొనసాగించవలసిందే; సుషుప్తినుంచి మేల్కొన్నట్టు జాగ్రదావస్థకు చేరుకొన్న ఆ శవాన్నుంచి వేరుపడితే మరణం తథ్యం.

ముందుగా శవం తల కదిలింది.

తర్వాత కాళ్ళూ చేతులూ-

శవంపైన పద్మాసనం వేసుకొని కూర్చుని, ముందుకి వంగి శవం చెవివద్ద మంత్రపఠనం గావిస్తున్న సుకుమార్ అప్రమత్తమయ్యాడు.

హటాత్తుగా శవం తల గాలిలోకి లేచింది.

ఇదే పరోకరయితే గుండె గుబగుబలాడటం చిరుచెమటలు పోటుచేసుకోవడం— గుండె ఆగి పోవడం ఖాయం!

ఆ శవం చూపులు మరల్చుకోలేకపోతోంది. ఎవరో హిప్నొటైజ్ చేసినట్లు చూస్తోంది

ఆ చూపుల్నుంచి దృష్టి మరల్చుకోవడం కష్టంగా వుంది.

నిష్ఠాగరిష్ఠుడు— మనసా వాచా చతుర్విధ కర్మలు జరిపిన సత్య వాక్ పరిద్రష్టుడు-మహా ఉపాసకుడు- ఆచార్య కాలనేమి అతడికి ధార పోసిన విద్యలు రక్షాకవచంగా పనిచేస్తున్నాయి.

చుట్టూ వున్నవారి ప్రాణాలు పీచుపీచుమంటున్నాయి; దిక్కు దిక్కుమంటూ నిలబడిపోయారు; ముఖాలు తెల్లగా పాలిపోయాయి.

కాళ్ళు నేలకు తాటించి శవం గాలిలోకి లేవడం ప్రారంభించింది.

అంతే-రెండు చేతులతో ఆమె మెడ చుట్టాడు. క్రిందికి జారిపోకుండా పట్టుకున్నాడు.

శవం పూర్తిగా లేచి నిలబడింది. శివమెత్తినదానిలా ఊగిపోతోంది.

సుకుమార్—

మహాశక్తి సంపన్నుడు కావడమో, విలయమైపోవడమో నిర్ణయ జరిగే దుర్భర క్షణాలవి.

అలాంటి భీతావహస్థితిలోనూ అతడు మంత్రపఠనాన్ని ఆ లేదు. ఊపిరితిత్తులు బిత్తేలా అరుస్తున్నాడు; అతడి నుదురులోనున్న నరాలన్నీ ఉవ్వెత్తుగా లేచి పడుతున్నాయి. ఆమె కాళ్ళ కదలికలక నేలపైనున్న ధూళి పొగలా లేస్తోంది. భూమ్యాకాశాలమధ్య ఏదో పొగలు అలుముకుపోతున్నట్టు అయోమయమై పోతున్నది. ఒక పెద్ద ప్రభంజనం వీస్తున్నట్లుంది

నాంద్రింపు-గోంద్రింపు-ఎడతెగని మహాక్రందన

భూమ్యాకాశాలూ, నదీనదాలూ పెడుతున్న మహాక్రందనం—

మెదడును చీలుస్తున్న మోహ—

సుళ్ళు తిరుగుతున్న మహారావం—

బొంగరంలా తిరుగుతోంది;

గాలిపటంలా పల్టీలు కొడుతోంది;

మొదలు నరికిన చెట్టులా కూలుతోంది;

సముద్రంలా ఉప్పొంగుతోంది.

పర్వతంలా కదులుతోంది;

—పర్యవసానం ఒక్కటే; అతడి మంత్రపఠనం ఆగినా- ఆమె నుంచి అతడు విడివడినా మరుక్షణం— అతడు వేయి పీలికల్వ తాడు.

ఉన్మాదిలా రంకెలు పెడుతూ, గెంతుతూ గందరగోళం సృష్టిస్తో దామె—





అతడు ఆకులా కదిలిపోతున్నాడు; పిపీలికంలా గింగిరాలు తిరుగుతున్నాడు.

ఏదో ఒకవిధంగా అతడ్ని తననుంచి వేరుచేయాలని ప్రయత్నిస్తోందామె....

పది ఏనుగుల బలంతో అతడి పట్టుని ఛేదించడానికి విశ్వ ప్రయత్నం చేస్తోందామె

కొన్ని వందల సంవత్సరాల కఠోర తపస్సుతో సాధించినదానిని ఆచార్య కాలనేమి సుకుమార్‌కి ధారపోశాడు ఆ శక్తే యిప్పుడతన్ని కాపాడుతోంది.

ఆమెను నిలువరించే ప్రయత్నంలో ఆ శక్తి దగ్ధమవుతోంది. తిరిగి అతడు ఆ మూడేవతలను ఉపాసిస్తేగాని ఆ శక్తి అతడికి తిరిగి రాదు. కాలం గడుస్తున్నకొద్దీ అతడిశక్తి క్షీణిస్తోంది; ఆమెశక్తి పెరుగుతోంది

సాధకుల శరీరం ఒక విద్యుత్ ప్రవాహం. సాధకుని స్పర్శతో అవతలివ్యక్తి ఆ శక్తిని పొందుతాడు. ఇప్పుడు జరుగుతూందదే.... గురువునుంచి పొందిన శక్తులు అతడినుంచి ఆమెకు ప్రసారమవుతున్నాయి.

ఈ పెనుగులాట....మరికొంత సేపు జరిగితే కథ తారుమారవడం ఖాయం. ఈ స్థితిలో జరిగిందొక విచిత్రం.

ఎంతయినా ఆమె స్త్రీ....

ఆ పెనుగులాటలో, ఆమెనుంచి విడిపోకుండా తనని తాను కాపాడుకునే ప్రయత్నంలో అతడి రెండుచేతులూ ఆమె రెండు స్తనాలపై పడ్డాయి.

ఆ పెనుగులాటలో- ఆ రాపిడిలో- ఆ ఒరిపిడిలో ఆమెలోని పైశాచికత్వం సన్నగిల్లి స్త్రీత్వం మేల్కొంది. ఆమె కళ్ళు, పెదవులు

కాంక్షతో భగ్గుమన్నాయి. అరమోడ్పు కన్నులకింద ఆరాటం మొదలయింది. ఏదో ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయింది.

—ఆ స్థితి; ఆమె స్థితి సుకుమార్‌కి అర్థమయింది.

ఆమె బలహీనతను పసిగట్టాడు ఇహ ఆలస్యం చేయలేదు. ఆమెను రెచ్చగొట్టాడు.

కోరికతో బరువెక్కిన కళ్ళతో-తమకం భరించలేనట్టు అతన్ని రెండు చేతులతో బంధించి పెదవులపై నోటిని గట్టిగా అదిమింది. ముఖంపై నాలుకతో రాసింది. వక్షస్థలాన్ని బలంగా అతని ఛాతీకి అదిమింది ముఖంలో ముఖంపెట్టి వున్న ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అతడికి వెచ్చగా తగులుతున్నాయి.

ఆ స్పర్శ ఆమెలో మహేంద్రజాలాన్ని సృష్టిస్తోంది. రక్తం ఎక్కడెక్కడికో మహోధృతంగా ప్రవహిస్తోంది!

అది రెండు శరీరాల కలయిక కాదు. ఆత్మ-ఆత్మ-శరీరం అనుసంధానం. పంచేంద్రియాలను పణంగా ఒడ్డి సాధించుకున్న అపురూపమైన రాసక్రీడ.



గురువునుంచి అన్ని విద్యల్నీ అందుకున్న సుకుమార్ ముందుగా 'సందంశిక' ప్రయోగించాడు

ఆమె ఆ అనుభూతినుంచి తేరుకునేలోపే 'కీల' ప్రహణాన్ని ప్రయోగించాడు.

కళ్ళు తేలిపోతున్నాయి; శరీరం దూదికన్నా భార రహితంగా వుంది; డ్రీమీగా వుంది.

ఆమె బలహీనతని సకాలంలో సరిగా వినియోగించుకున్నాడు.

ఒక శక్తిలా కదిలిన ఆమె పురుష స్పర్శతో సగటు స్త్రీలా మారిపోవడాన్ని తనకు అనుకూలంగా తిప్పుకున్నాడు.



అన్ని క్రీడలవలెనే రతి క్రీడకూ కొన్ని నియమ నిబంధనలు, బంధనాలు, సూత్రాలు వున్నాయి. అయితే సగటు స్త్రీకి అవన్నీ తెలియవు. స్త్రీల సంగతి ఎందుకు, ఎందరో పురుషులకి కూడా ఈ విషయాలు తెలియవు. ఒకవేళ తెలిసినా అశ్వబంధనం, సర్పబంధనం మాత్రమే తెలియడానికి అవకాశం వుంది. గజబంధనం, మకర బంధనం తెలియడానికి అవకాశంలేదు. ఆమెకు ఆ అవకాశం ఇవ్వదలుచుకోలేదు.

అతడు ప్రాణాంతకమైన బంధాన్ని తనపై ప్రయోగించబోతున్నాడని ఆమెకు తెలియదు.

శవంతో సంగమం మహాప్రమాదం.

యోని కండరాలు బిగుసుకుపోవడంవలన అంగప్రవేశం దుర్లభమవుతుంది. బలవంతాన అంగప్రవేశం జరిపినా సహజసిద్ధంగా యోనిలో స్రవించే ద్రవాల స్రావం నిలిచిపోవడంతో రతి చాలా కష్టం

శవంతో సంగమించే అఘోరలు వీటికి అతీతులు. స్త్రీతో ఏ విధంగా రమించగలరో శవంతోనూ అదే విధంగా రమించగలరు.

అయితే శవానికి ప్రాణంపోసి సుకుమార్ సాధారణ అఘోరేశ్వరులు ఎదుర్కొనే సమస్యను అధిగమించాడు పది ఏనుగుల బలాన్ని సంపాదించుకున్న ఆమెపై గజబంధనం ప్రయోగించబోతున్నాడు.

మహారణ్యాలలో మదగజాలను బంధించడానికి వేటగాళ్ళు నిలువు లోతు గొయ్యి తవ్వుతారు. దానిపై నామ మాత్రంగా ఆచ్ఛాదన ఏర్పాటు చేస్తారు. దానిపై ఏనుగుని ఆకర్షించడానికి అది ఇష్టపడే తినుబండారాలను వుంచుతారు తిండి కోసం వచ్చిన ఏనుగు ఆ గోతిలో పడుతుంది. ఆ గోతిలో వుండలేక, ఆ గోతిలోనుంచి బయటకు రాలేక అది పెట్టే ఘీంకారంతో అడవి దద్దరిల్లుతుంది.

ఇప్పుడూ అదే జరగబోతోంది.

శృంగారంలో ఎవరుపైన ఎవరు క్రింద; ఎవరు ఏ అవయవాన్ని ఏ విధంగా తాకుతున్నారు అన్న ధ్యాస వుండదు.

అదొక మైమరపు

అదొక యుద్ధం!

ఈ యుద్ధానికి నియమ నిబంధనలు లేవు.

భావప్రాప్తి పొంది ఆమె;

రేతఃపతనం కాక అతడు-

ఆమె 'లతావేష్ఠితకం' ప్రయోగించాలని చూస్తోంది.

తన కాలితో అతడి కాలు నొక్కిపట్టి, రెండో కాలు అతని తొర మీదుగా నడుముచుట్టి, ఒక బాహువును వీపు వైపుగా చుట్టి రెండో బాహువుతో అతడి మెడ వంచుతూ ముద్దు పెట్టుకోవడానికి చెట్టు ఎక్కినట్టుగా అతడి పైకి ఎక్కడానికి ప్రయత్నిస్తోంది ఆమె చేస్తున్న ప్రయత్నాన్నే 'వృక్షాధిరూఢకం' అంటారు.

అయితే సుకుమారుడు ఆమె ఆట సాగనివ్వడంలేదు.

పైపెచ్చు ఆమె భావప్రాప్తి పొందింది.

ఆమె బలహీనతని గమనించిన అతడు 'గజబంధనం' ప్రయోగించడానికి ముందు

'తిల తిండులకం' ప్రయోగించాడు.

ఒకరి తొడతో ఒకరి తొడను, ఒకరి బాహువుతో ఒకరి బాహువును గట్టిగా కౌగలించుకోవడాన్ని 'తిల తిండులకం' అంటారు.

ఆమె ఎముకలు విరిగిపోయేదీ, ఒడలు చీరుకుపోయేదీ గమనించే స్థితి దాటిపోయింది.



భగ లింగాలు తాగిస్తూ నఖక్షత్రాలతో, ప్రణయ తాడనలతో ఆరాటంతో దూకుతున్నాడు. ఆమె ముఖంతో ముఖం పెట్టి, కళ్ళలో కళ్ళు పెట్టి ఫాల భాగాన్ని ఫాలభాగంపై మోపి 'లాలాటికం' ప్రయోగించాడు. చుంబన పంచకంతో- చుంబనం, ఆలింగనం, దంతక్షత్రం, నఖక్షత్రం, ప్రణయతాడనం-ఆమెను వశం చేసుకున్నాడు.

నుదురు, ముంగురులు, బుగ్గలు, కళ్ళు, వక్షస్థలం, పెదవులు, నాలుక, గజ్జలూ, చంకలూ, భగమూ ముద్దులతో నింపాడు. ఆమె తనని తాను మరచిన స్థితిలో వుండగా ఆమె రెండు కాళ్ళూ అతడి రెండు భుజాలపై ఆన్చి తలక్రిందకు వాల్చింది. అలా వాల్చడంలో ఆమె తల అతడి రెండు కాళ్ళ దిగువన చిక్కుకుంది. పెదరెక్కలు విరిచినట్టు ఆమె రెక్కలు రెండు ఒరిసి పట్టుకున్నాడు చతుష్షష్ఠి కళల్ని ఆచరణలో పెడుతూ ఆమెను పిపీలికం చేశాడు.

కాళ్ళూచేతులూ కదల్చలేని స్థితి ఆమెది. క్రమ క్రమంగా ఒళ్ళంతా మొద్దుబారిపోతోంది. శ్వాస పీల్చడంకూడా కష్టమవుతోంది. నోటితో గాలి పీల్చడానికి విశ్వప్రయత్నం చేస్తోంది. కళ్ళు తేలిపోతున్నాయి. అప్పుడు ఆమె నాలుకను తన నోట్లోకి తీసుకున్నాడు. పదునయిన కత్తితో కత్తిరించినట్టు పళ్ళతో ఆమె నాలుక కొరికాడు.

అంతే!!

చెట్టు కూలినట్టు ఆమె శవమైంది నేలకూలింది.

ఆ నాలుకను భద్రపరుచుకున్నాడతడు.

శవంతో సంభోగించిన అఘోరలున్నారు. కానీ శవాన్ని నిద్రలేపి రేతః పతనం కాకుండా సంభోగించినవారు; నిద్రలేచిన శవం నాలుకను కత్తిరించినవారు దాదాపుగా కనిపించరు.

గురు కృపతో అసాధారణమైన తాంత్రిక వస్తువుని సాధించాడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.

శవాన్ని నిద్రలేపిన జ్ఞాననిధి తన తదుపరి కార్యక్రమాన్ని 'శీతలా ప్రయోగం'గా నిర్ధారించాడు. ఆ సన్నాహాలు ప్రారంభించమని అనుచరులకు పురమాయించాడు.

* * * *

"గురూ డింగ్ డాంగ్ వస్తోంది...." అన్నాడు భరణి.

భరణి చెప్పిన ఆ డింగ్ డాంగ్ గాయత్రి.

వంశీ పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా మారింది. ఆమె ప్రిన్సిపాల్ గారమ్మాయి.

ప్రిన్సిపాల్‌గారు తనను చాలా అభిమానంగా ఇంటికి పిలిచారు. గౌరవంగా చూశారు. గాయత్రితో కాఫీ ఇప్పించారు అటువంటి గాయత్రిని ఆటపట్టించడమా? ఎలా?

అతడి ఆలోచనలు ఎక్కడ ఆగిపోయాయో అక్కడ గాయత్రి స్వరం వినిపించింది. "ఏమిటండీ వంశీగారూ- చార్లీ చాప్లిన్‌లా ఫేస్ మాస్క్ చేసుకొని చూస్తుండిపోయారు. ఇది మూకీల కాలం కాదు-టాకీల యుగం. వాకీటాకీల యుగం" అన్నది గాయత్రి.

ఒక అబ్బాయిని, అందునా వంశీవంటి వాగుడుకాయని ఓ అమ్మాయి అంత పబ్లిక్‌గా కామెంట్ చేసేసరికి చుట్టూవున్న అమ్మాయిలు కిసుక్కున నవ్వారు. దానితో ఖంగుతిన్న అబ్బాయిలు 'తక్షణ కర్తవ్యం ఏమిటి గురూ" అన్నట్టుగా వంశీవైపు చూశారు.

కళ్ళకదలికతో తదుపరి కార్యక్రమాన్ని నిర్దేశించారు. అయితే అతడికాక్షణాన తెలియదు 'జ్ఞాన నిధి' అనబడు సుకుమార్ రూపంలో ఓ పెద్ద ప్రమాదం పొంచివుందని; తాను ఆమెను పులిముందు 'ఎర'గా విసరబోతున్నానని!

* * * *



ఆత్మాత్వం గిరిజా మతిః

సహచరః ప్రాణాః శరీరమే గృహవే

సంచారం పదమోః ప్రదక్షిణ విధిః

స్తోత్రాణి సర్వాగిరో

పూజాతే విషయోప భోగరచన

నిద్రాసమాధి స్థితిః

మద్యతూర్మ కరోమ

ఏతతఖిలం శంభోతవారాధనమే.

అంటే-

శివా! నీవే నా ఆత్మ-

గిరిజ బుద్ధి-

ప్రాణాలే ప్రథమ గణాలు-

శరీరమే నీ గృహం-

నేను నడిచిందంతా నీ ప్రదక్షిణం-

నేను మాట్లాడిందంతా నీ స్తోత్రం-

నేను విషయ వాంఛల్ని అనుభవించడమే నీ పూజ-

నా నిద్రే నీ సమాధి స్థితి-

నేను ఏ పని చేస్తున్నానో శివా-

అదంతా నీ ఆరాధనమే!

-అని ఆ రుద్రుణ్ని ప్రార్థిస్తున్నాడు ఓ బుడబుక్కలవాడు.

అప్పుడు సమయం తెల్లవారుజామున రెండు గంటలయింది.

ఆ స్థలం: ఊరుకి దక్షిణాన వున్న రుద్రభూమి.

ఎందరెందరో ప్రశాంతంగా భూగర్భంలో శయనిస్తున్న చోట;

సగంకాలిన కట్టెల మధ్య; బూడిద ముగ్గుల మధ్య కూర్చుని అతడు ఆ ముక్కంటిని ఆరాధిస్తున్నాడు.

* * * *

గాయత్రి తండ్రి- కాలేజీ ప్రిన్సిపాల్- నారాయణాచార్యులుగారు తన గదిలో వున్నారు. ఎప్పుడూ అర్థరాత్రి దాటేవరకు ఏదో ఒకటి చదవడం ఆయనకు అలవాటు. కానీ ఆ రోజున మనసు పుస్తక పఠనం మీద నిలవలేదు. అలాగని వేరొకపని చేయబుద్ధి కాలేదు.

బయట వాతావరణమంతా ప్రశాంతంగా వుంది.

తుపాను వచ్చే ముందు ప్రశాంతత!



మెయిన్ లైటు ఆర్పేసి బెడ్ లైట్ వేశాడు.

నీలివర్ణం గదంతా అలముకుంది. రాక్లో ఓ వేపు బుక్స్: మరో వేపు ఆడియో క్యాసెట్స్, ఆ గదంతా నిశ్చల ఛాయా చిత్రంలా వుంది. ఆయనకు ఏం చేయాలో తోచని స్థితి టేప్ రికార్డర్ 'ఆన్' చేశాడు. "నీల్ కమల్" సినిమాలో ముఖేష్ గాత్రం- తన ప్రియురాలిని మర్చిపోలేని రాజ్ కుమార్ ఆత్మ పాడేపాట అది!

ఆ పాట వింటూనే త్రుళ్ళిపడ్డాడు. ఆ సమయంలో ఆ పాట వినడానికి మనస్కరించక వెళ్ళి టేప్ రికార్డర్ 'ఆఫ్' చేశాడు. అప్పుడు గమనించాడు ... ఛాయ ఒకటి కిటికీకి అవలివేపున కదలాడుతున్నట్టు. లటాలున బయటకు నడిచాడు. అప్పటికే ఆ ఛాయ ఆ గది విడిచి గాయత్రి గదివేపు వెళుతోంది. అర్ధరాత్రి వరకూ చదువుకోవడమో, క్యాసెట్ పెట్టుకుని వినడమో చేస్తుండటం వలన మాస్టారి శ్రీమతి



సాధారణంగా హాలులోని దివాన్ మీద నడుం వాలుస్తుంది. గాయత్రికి వేరే గది వుంది. తన గదిలో తానుంది.

ఆ ఛాయ గాయత్రి గదివేపు వెళ్ళడం గమనించిన మాస్టారు వడివడిగా ఆ వేపు నడిచారు.

సరిగ్గా ఆ సమయంలో—

తెగిపోయిన మల్లెచెండు పోగుపడినట్టుగా నవ్వారుమంచంమీద వుందామె.

కంటిమీదికి వాలిన అల్చిప్పల్లాంటి రెప్పల్ని తెరిచి, శూన్యంలోకి చూస్తున్నట్లుందామె. పెదవులు భయంవల్లనో, బలహీనతవల్లనో కాని సన్నగా అదురుతున్నట్టుగా అనిపిస్తున్నాయి. తెల్లని నుదురుమీద నల్లని ముంగురులు జీరాడుతున్నాయి. ఇయర్ డ్రాప్స్ ఫానుగాలికి ఉయ్యాల లూగుతున్నాయి. ఊర్పులు దీర్ఘతరంగా తీస్తుండటంవలన గుండె రవ్వంత ఎగసి ఎగసి పడుతోంది.

ఆమెను ఆ స్థితిలో చూసిన నారాయణాచార్యులు గారిలో నరాలు తెగే టెన్షన్!

నిశ్శబ్దం గుండెల్ని పిండేసే శ్మశాన నిశ్శబ్దం....

అగ్నిపర్వతం బద్దలవబోతూ ఆఖరి క్షణంలో చల్లారిపోయిన భావన.

గగుర్పాటుతో ఆయన గొంతు తడారిపోయింది. ఏనాడూ ఇటువంటి దృష్టాంతరాలను చూడని నారాయణాచార్యులుగారు ఎంతగా కలవర పడ్డారూ అంటే, అప్పటికే ఆయన శరీరం చెమటతో తడిసిపోయింది.

కనిపించకూడని ఏ అపశ్రుతి ఆయన కళ్ళముందు కదిలిందో మనసు అట్టడుగు పొరల్లో నున్న ఏ రాగబంధం కల్లోలితమయిందో- ఏ స్మృతి కలశం గొంతుక్కడ్డం పడిందో- భావానికి ఆ భావానికీ మధ్య నిలబడి పోయాడు.

అప్పుడు ఆరంభమయింది: దూరాన ఏదో చప్పుడు భూతాల్లా నిలబడ్డ చెట్లమధ్య నుండి ప్రేతాత్మల ఘోషలా అతణ్ని తాకతున్న చీకటి గాలులు.

వేదమంత్ర పఠనంలా సాగే నదిలా- యుక్తాయుక్తాలను ప్రబోధించే పురాణంలా- రంజింపజేసే కావ్యంలా- పారుతున్న గోదావరిలా అక్కణ్నించి కదిలాడాయన.

ఎవరో తనను అనుసరిస్తున్న అనుభూతిని తరుముతూ, గుండె వేగాన్ని అణచుకుంటూ కాళ్ళను కూడదీసుకుని కదిలాడు.

మరొకరు, వేరొకరు అయితే కంగారుపడి గాయత్రికి సపర్యలు చేయడమో, ఇంట్లోవాళ్ళని నిద్రలేపటమో చేసేవారు. కానీ ఆయన అదేమీ చేయలేదు. తిన్నగా స్నానాలగదికి వెళ్ళాడు. తలమీదుగా రెండు బకెట్లు ఎత్తి పోసుకున్నాడు. మడిబట్ట కట్టుకుని పూజగదికి వెళ్ళాడు. నుదుట కుంకుమ దిద్దుకుని దీపారాధన చేశాడు. పద్మాసనం వేసుకుని జపమాల ధరించాడు.

గుండెలో ప్రారంభమైన ప్రకంపన సెకండ్లలో శరీరం మొత్తం వ్యాపించింది.

టెన్షన్‌లో కూడా దైవంపట్ల విశ్వాసాన్ని విస్మరించలేదు. మెదడు పొరల్లోకి; గుండె అరల్లోకి రప్పించుకుని మంత్ర పఠనం కొనసాగించాడు.

ఏ పాశం ఆతడి గుండెల్ని మెలి పెట్టి ఉద్రేకపరచిందో గాని ఆయన పూర్తిగా పరిసరాల్ని మర్చిపోయాడు. 'గాయత్రి' జపంలో తాదాత్మ్యం చెందాడు.

సరిగ్గా అదే సమయంలో మరికొన్ని సంఘటనలు చాలా వేగంగా జరిగిపోయాయి. అంతవరకూ మౌనంగా వున్న ప్రకృతి హఠాత్‌గా మొదలయిన ఉరుములు మెరుపులతో మరింత భీతావహంగా మారిపోయింది.



ఆకాశం గుండె పగిలిన హోరుమంటూ వర్షం.

ఇక్కడ ఇలా జరుగుతుండగా—

జనావాసానికి బహుదూరంగా ఆవు పేడతో అలికి ముగ్గులు పెట్టి ఇష్టదేవతను ఆవాహం చేసిన అతడు కాలిమడమను లింగమునందు, గడ్డమును కంఠ మూలమందు, వెన్నును నిటారుగా వుంచి భ్రూమధ్యమును చూస్తున్నాడు

దీనిని సిద్ధాసనం అంటారు.

దీనివలన త్వరగా సిద్ధి పొందుతారని సాధకుల ఉవాచ.

సిద్ధాసనం చేసిన ఆ సాధకుడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.

అతడి చేతుల బొటనవేళ్ళు రెండూ రెండు చెవులను-

చూపుడు వేళ్ళతో కళ్ళను-

మధ్య వేళ్ళతో ముఖాన్ని-

ఉంగరం వేళ్ళతో ముక్కుని బంధించాడు.

'హుం' అని బీజాక్షరాన్ని పఠిస్తూ మానసిక జపం చేస్తున్నాడు.

(దీనిని 'యోగముద్ర' అంటారు. శివశక్తుల కలయిక వంటి బ్రహ్మానందాన్ని సాధకుడు పొందుతాడు)

సిద్ధాసనం వేసి, యోనిముద్ర ధరించిన 'జ్ఞాననిధి' కుండలిని మేల్కొలిపాడు.

కోటికోటి సూర్యకాంతులవంటి 'కాంతి', కోటికోటి చంద్రులతో సమానమైన చల్లదనముగల కాంతి పరివేషము- మధ్యలో అగ్నివలె ప్రకాశిస్తున్న 'మహాశక్తి'ని భావన చేశాడు.

జీవుడు సుషుమ్నా నాడిలో బ్రహ్మబిముఖంగా పయనిస్తున్నాడు; శక్తి సహస్రారంలో శివునితో విహరిస్తుండగా జరిగిందీ ప్రకృతి బీభత్సం.

రగులుతున్న నెగడు ఆ ఝంఝూమారుతానికి దశ దిశలా చెల్లా చెదురయింది.

అతడి ఉపాసన భగ్నమయింది. జాగ్రదావస్థకు చేరుకున్నాడు. ఎర్రగా కాలిన చింతనిప్పుల్లో గాయత్రీదేవిని ఆరాధిస్తున్న నారాయణాచార్యులు, పూజగది గుమ్మం వద్ద నిలబడి వున్న ఆయన భార్య కన్పించారు.

దెబ్బతిన్న పులి మేనీటర్‌గా మారుతుంది.

మేనీటర్ సాగించే మారణకాండను అక్షరాలలో పొదగడం కష్టం.

ఉపాసన భగ్నమైతే ఆ సాధకుడు సాగించే నరమేధాన్ని నిలువరించగలవారుండరు.

పగతో ప్రతీకార జ్వాలలా లేచి నిలబడ్డాడు సుకుమార్.

* * * *

తలలో ముళ్ళు గ్రుచ్చినట్లు-

కాళ్ళలో మేకులు దిగబడినట్లు-

బ్లేడుతో ఒళ్ళంతా గాట్లు పెట్టినట్లు వుంది.

అసలు తనకేం జరిగిందో; నిలువెత్తున నిస్సత్తువ ఎందుకు వ్యాపించిందో అర్థం కావడంలేదు. మత్తుగా కళ్ళు కూరుకుపోతున్నాయి. తంత్రి ప్రోద్బలంతో గుడికి బయల్దేరింది. గుడి ముందు వేప- రావిచెట్లు కలిసున్నాయి.



"గాయత్రీ.... మహాలక్ష్మమ్మ మానుకి ప్రదక్షిణం చేసిరామ్మ" ఆదేశించారు నారాయణాచార్యులు. పట్టు ధోవతి కట్టుకుని, పైపంచ వేసుకున్న ఆయన నుదుట తిరుచూర్ణం బొట్టు భాసిస్తోంది....

రావి–వేప కలిసి వున్న మాను చుట్టూ మండపం వుంది. ప్రదక్షిణం చేయడానికి మండపం మెట్లెక్కసాగింది గాయత్రి. ఎదురుగా ఉన్న దేవాలయం వేపు నడిచారు నారాయణాచార్యులుగారు.

ముకుళిత హస్తాలతో మంత్ర జపం చేస్తూ ప్రదక్షిణం చేస్తున్నదల్లా, "గాయత్రీ.... ఈ దీనుడ్ని కనికరించు, ఈ దీనుడిపై నీ కరుణా కటాక్ష వీక్షణలు ప్రసాదించు" అన్న మాటలు వినిపించిన వేపు చూసింది.

ఎవరో మహాలక్ష్మమ్మ మ్రానువద్ద సాష్టాంగదండ ప్రణామంచేస్తూ ఆ గాయత్రీదేవిని స్మరిస్తున్నారు.

'గాయత్రీ....' అని ఆ దేవదేవిని స్మరిస్తున్నాడని అర్థం చేసుకున్న ఆ గాయత్రి ముందుకు వెళ్ళబోయింది. కానీ ప్రాణాచారం పడిన ఆ భక్తుడు "గాయత్రీ.... గాయత్రీ" అంటూ అంగపూజ ప్రారంభించదంలో అతడి ముఖంలోకి చూసింది.

ఆతడు– వంశీ. అతడి కొంటెతనానికి అప్రయత్నంగా నవ్వింది ఆమె.

"ఎక్కడ.... ఎక్కడ, ఇక్కడే ఎక్కడో పడ్డాయి" అంటూ వెదకసాగాడు.

"ఏమిటి బాబూ వెదుకుతున్నావ్?" అప్పుడే వచ్చిన ఓ ముత్తయిదువ అడిగింది.

"రత్నాలు రాలి పడ్డాయి...."

"రత్నాలా?!"

"అవునండీ... ఈ అమ్మాయి నవ్వింది"

"ఈ అమ్మాయా?" అన్న ప్రశ్నకు తలెత్తాడు.

ఎదురుగా ముత్తయిదువ కూడా వచ్చిన పనిపిల్ల కనిపించింది. సిగ్గుతో చితికిపోయిన వంశీ ఒక్క ఉదుటున గుడి మెట్లెక్కుతున్న గాయత్రి వేపు పరుగుతీశాడు.

అణువుకన్నా సూక్ష్మమయింది, శక్తివంతమయింది బీజాక్షరం.

బీజాక్షరసయిత మంత్రాన్ని నియమనిబద్ధలతో ఎవరయితే పఠిస్తారో వారు కాలాన్ని, మృత్యువుని జయించగలరు.

ఒక ఉపాసకుడు మరో ఉపాసకునితో వైరం పెట్టుకోడు.

ఒకరి శక్తి సంపదలను మరొకరు ఛాలెంజ్ చేయరు.

కానీ 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ తన ప్రయత్నం విఫలం కావడంతో రెచ్చిపోయాడు. జ్యేష్ఠ పూర్ణిమ లోపు గాయత్రిని వశపరచుక తీరాలని శపథం చేశాడు.



# 10

దూరాన ఎక్కడో ఓ తీతువుపిట్ట అరుస్తోంది.

ఆ రోజు ఏకాదశి- పగలంతా ఉపవాసం వుండి రాత్రికి భోజనం చేస్తారు.

ఆ ఇంట్లో!

ఆ ఇంటి యజమాని- కాలేజీ ప్రిన్సిపాల్- నారాయణాచార్యులుకి తిండి ధ్యాసలేదు, దేవుని ధ్యాస, చింతన తప్ప.



పగలంతా ఉపోషణం వున్న ఆ కుటుంబ సభ్యులు తండ్రి ఎంగిలి పడితే గాని తాము ఎంగిలి పడరు. అంతా కలిసే భోజనము చేస్తారు.

ఆ రోజున ఉమ్మి కూడా మింగకుండా కఠోర నియమాన్ని పాటిస్తారు.

ఆ ఇంట్లో వారికి అపశకునం అయిదు రంగులలో దర్శనం యిచ్చింది.

అప్పుడు సమయం- రాత్రి తొమ్మిది గంటలు. అయినా ఆకాశం మేఘావృతమై పెనుచీకట్లు దట్టంగా అలుముకున్నాయి.

ప్రకృతి బీభత్సాన్ని నారాయణాచార్యుల్లో ఆందోళన ఎక్కువవుతోంది- చీకట్లు దట్టమవుతున్న కొద్దీ ఆయనకు నేలపై కాలు నిలవడం లేదు.

"గాయత్రీ...." అని పిలిచాడు అయన.

ఆయన పిలుపుకి జవాబు రాలేదు.

అప్పుడు గమనించారు- గాయత్రి తమ మధ్య లేదని.

"గాయత్రీ.... గాయత్రీ...." అన్న పిలుపులో ఆ ఇల్లు మార్మోగింది

పిలుస్తూనే ఆమె కోసం చూడసాగారు తన మీదున్న గాయత్రిని కుడిచేతితో పట్టుకుని గాయత్రీ జపంచేస్తూ గాయత్రి కోసం వెదుకుతున్న ఆయన ఆ క్షణాన లోపల బడాబాగ్నిని దాచుకుని, పైకి నిర్మలంగా కనిపించే అగ్నిపర్వతంలా వున్నాడు. "గాయత్రీ.... గాయత్రీ...." అన్న కేకల్ని పట్టించుకోవడం లేదాయన. ఏదో అతీంద్రియ శక్తి లాక్కుపోతున్నట్లు నడుస్తున్నారు. అలా నడుస్తున్న వాడల్లా బాత్రూమ్స్ పక్కనున్న స్టోర్‌రూమ్ దగ్గర ఆగిపోయాడు.

అపస్మారక స్థితిలో- స్టోర్ రూమ్‌లోని పాత సామాన్లలో ఒక పాత వస్తువుగా పడి వుందామె ముఖమంతా కమిలిపోయివుంది. నేరేడు తిన్న నోరులా వుంది పెదవుల రంగు. చెమట జిగట ముఖమంతా చోటు చేసుకుంది. గుండె ఎగసి పడుతోంది. వెక్కిళ్ళు వచ్చినట్లు శరీరమంతా కదిలిపోతోంది.

ఒక్క చూపులో ఆమెని చదివేసిన నారాయణాచార్యులు తిన్నగా పూజ గదిలోకి వెళ్ళారు. గాయత్రీదేవి పాదాల వద్ద ఉన్న కుంకుమ, తీర్థం తీసుకొని వచ్చారు. ఆమె నుదుట అమ్మవారి కుంకుమ దిద్ది తీర్థం నోట్లో పోశారు. ఆ తర్వాత ఆమెను రెండు చేతులతో లేవనెత్తి పెరటిలోని ఔదంబర వృక్షం మొదలు దగ్గర పడుకోబెట్టారు. ఆ తరువాత ధ్యాన ముద్రలో మునిగిపోయారు.

* * * *

ఆకాశాన చుక్కల చీర పరచినట్లుంది.



మహాప్రస్థానం— బతికిన సమాధులపై బ్రహ్మ జెముడు మొక్కలు, చిన్న చిన్న ముళ్ళపొదలు, జుట్టు విరబోసుకున్న దయ్యంలా మర్రిచెట్టు—

దక్షిణ స్థానం యమస్థానం.

వూరుకి శ్మశానం దక్షిణాన వుంటుంది.

క్షుద్ర దేవతోపాసకులు దక్షిణం వేపు తిరిగి తమ కార్యక్రమాన్ని నిర్వర్తించేది అందుకే!

ప్రేతాత్మలు దక్షిణం వేపు నుంచి మనిషిని గమనిస్తుంటాయని ఆర్యులు పేర్కొన్నారు.

మనిషి నిలువెత్తు నున్న అగ్నిగుండం- చింతనిప్పలు భగభగ మండుతున్నాయి.



చింతనిప్పుల ఎర్రదనం అతడి మొహంమీద ప్రతిబింబిస్తోంది అతడి ఎదురుగా పసుపు, కుంకుమ, ముగ్గుతో చిత్ర విచిత్రమయిన రేఖలతో రూపొందించిన ముగ్గు వుంది. ఆ ముగ్గుపైన విచిత్రమయిన ఆకృతి వుంది. కోసిన నిమ్మకాయలు, తలతెగిన కోడి పడివున్నాయక్కడ.

ముగ్గుముందు నిలబడి వున్న అతడు పెనంమీద వేసిన గింజలా వున్నాడు.

అతడి రెండుకళ్ళ మధ్యా రక్తవర్ణంలో కుంకుమ బొట్టు

జాగ్రత్తగా చూస్తే లోతయిన అతడి కళ్ళలో కదలాడే కసి, ముఖంలో బుసకొడుతున్న క్రూరత్వం, బిగించిన పెదాల మధ్య పట్టుదల కనిపిస్తాయి

అతడు 'జ్ఞానసిధి' అనబడు సుకుమార్

అతడు ప్రయోగించిన శీతలా ప్రయోగం బెడిసి కొట్టింది.

ఏ వనితపై శీతలాప్రయోగం చేస్తాడో ఆమె తనకు తానుగా హోమగుండం దగ్గరికి నడచి వస్తుంది. భోగపూజకు సహకరిస్తుంది. భోగపూజచేసిన వాడికి 'పుంసత్వం' అమరత్వంగా మారుతుంది. ఆమె జవసత్వాలు అతడి పరమవుతాయి. ఆమె తనకు తానుగా తన శరీరావయవాల్ని ఖండించి హోమ గుండంలో వేసి క్షుద్రదేవతల్ని తృప్తి పరుస్తుంది. చివరకు తాను ఆ హోమగుండంలోకి దూకడం ద్వారా తనని తాను ఆ క్షుద్రదేవతలకు అర్పించుకుంటుంది.

ఆటువంటి శీతలా తంత్రాన్ని గాయత్రిపై ప్రయోగించాడు. 'జ్ఞానవిధి' అనబడు సుకుమార్. కానీ తంత్రం పారలేదు తంత్రం తిరగబడితే ఆ తంత్రాన్ని ప్రయోగించినవాడు చస్తాడు....మహా దారుణంగా.... రక్తం కక్కుకుంటూ, కొన ప్రాణాలతో విలవిల్లాడుతూ గంటలు రోజులు తరబడి నరకవేదనని అనుభవిస్తూ హేయమైన చావు చస్తాడు.

'జ్ఞాననిధి' అనబడు సుకుమార్‌కి ఆ దుస్థితి రాకపోవడానికి కారణం- ఆచార్య కాలనేమీ ధారపోసిన శాంతి పూజల ఫలం!

తాను ప్రయోగించిన శీతలామంత్రం 'గాయత్రి'పై పనిచేయక పోవడంతో 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ అహం దెబ్బతిన్నది. అటు వంటి సమయంలో సాధకుడు ఏం చేయవలసిందీ అనుభవమే నేర్పుతుంది. కానీ జ్ఞాననిధికి అనుభవం శూన్యం అయినందున తెల్లమొహ మేశాడు. అప్పుడు వినిపించింది- సన్నగా ఈలవేసినట్టు- ఒక నిష్ప రింగ్ వాయిస్!

ఆ వైపు చూశాడు జ్ఞాననిధి

చిన్న తువాలు మినహా అతడి ఒకటిమీద ఇతర ఆచ్ఛాదన ఏమీ లేదు.

పొడవాటి గడ్డం.

మెడలో పాము ఎముకలు గుదిగుచ్చిన మాల.

కళ్ళు ఉబికి రక్తం గడ్డకట్టినట్టున్నాయి

క్షుద్రదేవతల్ని ఉపాసించేవారు వెలుగుని ఇష్టపడరు; వేదపఠనాన్ని ఆలకించరు; తక్కువగా మాట్లాడతారు

అతడి రెండు చేతుల్లో రెండు కపాలాలు వున్నాయి ఒక కపాలంలో మేకమూత్రం వుంది

రెండవ కపాలంలో పేల్చిన మనిషి కనుగుడ్లు వున్నాయి.

మానవమాత్రుడెవరూ ఆ మూత్రం వాసనని భరించలేరు. అతడి శరీరంనిండా-శవాలను కాల్చగా వచ్చిన భస్మం పూసుకున్నాడు. జుత్తు అడపగట్టుకు పోయింది.

**ఉపాసకులకు అతి ముఖ్యమయినది మంత్రోచ్ఛరణ.**



ఉపాసకులకు నియమనిష్టలు అతిప్రధానం. నిర్ణీత సమయంలో నిర్దేశింపపడిన మంత్రాన్ని ఆరోహణ అవరోహణక్రమంలో పఠించాలి. శబ్ద ఉచ్చారణలో తేడా వస్తే ఫలితాలు దారుణంగా వుంటాయి. కనుకనే ఫలానా వ్యక్తి మంత్రగాడు- అన్న అనుమానం వస్తేచాలు ఆ వ్యక్తి పళ్ళు పీకేస్తారు జనం!

రెండు కపాలాలు రెండు చేతుల్లో పట్టుకుని వచ్చిన అతగాడికి దంతాలన్నీ సవ్యంగా లేవు.

ఆ విధంగా క్షుద్రోపాసనకి అనర్హుడైన అతడు తన జీవితాశయాన్ని జ్ఞాననిధి ద్వారా సాధించ సంకల్పించాడు.

"జ్ఞాననిధీ! ఉపాసకుడు ప్రయోగించిన మంత్రం విఫలమయితే అది ఆ ఉపాసకుడ్ని హరిస్తుంది. ఏ వ్యక్తిపై నీవు శీతలామంత్రం ప్రయోగించావో ఆ వ్యక్తి నీకు వశమయ్యేవరకు నీవు విశ్రమించకు. నీ గురువు సర్వశక్తులూ నీకు ధారపోశాడు ఏ ఉపాసకునికయినా పరమ పద సోపానం- పరమ హంసతత్వం!"

"కావచ్చు- కానీ కొన్ని వందలసంవత్సరాలు ఉపాసించే ఓపిక నాకులేదు."

"అందుకే.... సూక్ష్మంలో మోక్షాన్ని ప్రబోధిస్తున్నాను- 'అఘోర'గా మారు- పరమహంస పథాన్ని చేరుకో! తీసుకో- ఈ ఫలహారాన్ని, తీర్థాన్ని తీసుకో.... నీ ఆకలి తీరిన తర్వాత నీ ఉపాసనా కార్యక్రమాన్ని ప్రారంభించు' అంటూ రెండు చేతులలోని కపాలాలను ముందుకు చాచాడు.

ఏ ఉన్మాదం ఆవహించిందోగాని కపాలంలో పేల్చిన కనుగుడ్లని తీసుకొని గుటుక్కున మింగి, రెండవ కపాలంలోని మేక మూత్రాన్ని గటగటా త్రాగాడు.

* * * *

దారుణ హోమం ఆరంభమయింది.

ఏ ఇంట్లో ఔదంబర వృక్షం వుంటుందో ఆ ఇంట్లోవారికి రక్షా కవచంగా ఉపయోగపడుతుంది. దత్తాత్రేయుని శిష్యులకు ఈ వృక్షం కల్పతరువువంటిది. ఈ వృక్షం ఏ ఇంట వుంటే ఆ ఇంటివేపు పిశాచ గణాలు కాలుకదపలేవు. ఈ ఔదంబరలే వృక్ష కాండాన్ని హోమ సమిధలుగా వాడతారు. ఈ ఔదంబర వృక్షం మెడిసిన్‌గా కూడా ఉపయోగ పడుతుంది. ఈ ఔదంబవే వృక్షానికి పౌరాణికగాధ ఒకటి వుంది.

క్షీరసాగరమధనంలో ఉద్భవించిన అమృతాన్ని సేవించిన దేవతలకు అమరత్వం సిద్ధించింది. ఇక రాక్షసులు తమనేమీ చేయలేరని భావించిన దేవతలు తమ శక్తిని, ఆయుధాలను దధీచి మహర్షికి ధారపోశారు. అయితే రాక్షస బలంముందు నిలువలేక పోయారు. రాక్షసుల్ని ఎదుర్కొనడానికి తమ ఆయుధ సంపత్తి అవసరమయింది. ఆ సరికే దధీచి మహర్షి ఆ సర్వశక్తుల్ని తనలో హరించుకున్నాడు. దేవతలంతా వచ్చి దధీచి మహర్షి పాదాలపైబడి తమ వేదనను ఆయన ముందుంచగా ఆ మహర్షి దయాళుడై తనని చంపి తన శరీర భాగాల్ని వాడుకోవలసిందిగా చెప్పారు. ఆ మహర్షి వెన్నెముక దేవేంద్రునికి వజ్రాయుధమయింది. ఆ విధంగా ఆ మహర్షి దేవతలకు ఉపయోగపడ్డాడు. ఆ సమయానికి ఆ మహర్షి భార్య నిండు చూలాలు. ఆమె తన భర్త మరణవార్తవిని శోకించి, తన భర్తని చంపిన దేవతలను శపించబోగా ఆ దేవతలంతా వచ్చి ఆమె కాళ్ళపైబడి క్షమాపణ కోరారు. "రేపు పుట్టబోయే నా బిడ్డకు తండ్రి ఎవరు?" అని ప్రశ్నించగా, ఆ శ్రీహరి "నీకు పుట్టబోయే బిడ్డ ముల్లోకవాసులకు పూజనీయుడవుతాడు. ఔదంబరుడుగా విరాజిల్లుతాడు" అని వరమిచ్చాడు.

"అదిగో ఆ ఔదంబర వృక్షం ఆ ఇంటికి రక్షాకవచంగా వుంది.

ఆ ఇంట్లోనే గాయత్రి వుంది.



ఆ ఇంట్లోనే గాయత్రీ దేవిని ఉపాసిస్తున్న నారాయణాచార్యుల వారున్నారు.

గయత్రిపై శీతలామంత్రం ప్రయోగించాలంటే ముందుగా ఆ ఇంటి పెరట్లోని ఔదంబర వృక్షాన్ని తొలగించాలి. తర్వాత గాయత్రీ ఉపాసకుడయిన నారాయణాచార్యులుని తన మంత్రశక్తితో నిర్వీర్యం చేయగల శక్తి జ్ఞాననిధికి వుండాలి.

* * * *

"గురూ! ఈ ఐదు నల్లకుక్కపిల్లల్ని ఎక్కడికి తీసికెళ్తున్నావ్?" వంశీని ఉద్దేశించి అడిగాడు భరణి.

"నా ప్రేమ కానుకగా గాయత్రికి ఇద్దామని...."

"ఎవరయినా పాలరాతితో చేసిన తాజ్‌మహల్ ఇస్తారు. వీనస్ బొమ్మ ఇస్తారు. కానీ నల్లకుక్కపిల్లల్ని ఇస్తారట్రా?" అనడిగాడు చిదంబరం.



"నా స్టైయిలేవేరు—" అంటూ కుక్కపిల్లల్ని తీసుకొని మాస్టారింటికి వెళ్ళాడు వంశీ.

సరిగ్గా అదే సమయానికి ఆరుబయట లాన్‌లో తండ్రీ-కూతుళ్ళు కూర్చుని వున్నారు.

ఆ సమయంలో కుక్కపిల్లల్ని చూసి గ్రాయత్రిని ఎలా ఆట పట్టించాలో తెలియక సందిగ్ధంలో పడ్డాడు వంశీ

కానీ ఆ అయిదు కుక్కపిల్లల్ని చూడగానే దత్తాత్రేయుని వద్ద కుక్కపిల్లల రూపంలో నున్న అయిదు వేదాలు స్ఫురణకు వచ్చాయి మాస్టారికి

వంశీ తమాషాకి తీసుకొచ్చిన కుక్కలు వేదాలుగా కనిపించాయి ప్రిన్సిపాల్-నారాయణాచార్యులుగారికి.

ఋషులను పరీక్షించడానికి దత్తాత్రేయుడు చండాలుని రూపంలో వచ్చాడు. వంశీకి ఆ దత్తాత్రేయుడెవరో, ఆ కథ ఏమిటో తెలియదుగాని ప్రిన్సిపాల్‌గారి అమ్మాయిని గాయత్రిని ఆటపట్టించడానికి కుక్క పిల్లలి తీసుకొచ్చాడు.

వంశీ తీసుకొచ్చిన ఆ అయిదు కుక్కపిల్లలు అయిదు రంగులలో వున్నాయి.

తంత్రంలో 'కుక్కుటేశ్వరం' అని ఒకటి వుంది.

విశిష్ట సాధనతో మనిషిని పశువుగాను, పక్షిగాను మార్చగల దివ్యశక్తి వారికి వుంది. పశువుగా, పక్షిగా మారినవారు తిరిగి మనిషి రూపం పొందుతారు.

ఆ సాధకుల ముఖాలలో తేజస్సు ఉట్టిపడుతుంది. వారి శిరస్సు చుట్టూ కాంతి మండలం తిరుగుతున్నట్టుంటుంది.

—అయితే వంశీలో ఆ లక్షణాలేవీ కనిపించలేదు. కానీ ప్రిన్సిపాల్‌గారు ఆ కుక్కపిల్లల్ని చూడగానే భక్తి పారవశ్యంతో పూగిపోయారు. ఆ కుక్కపిల్లల్ని మహాప్రసాదంగా స్వీకరించారు.

తాను గాయత్రిని ఆటపట్టిద్దామని తీసికెళ్ళిన కుక్కపిల్లలు గాయత్రికి రక్షా కవచంలా పని చేయబోతున్నాయని వంశీకి తెలీదు.

యమధర్మరాజు అంతటివాడే భైరవరూపంలో ధర్మరాజుని అనుసరించాడు!

—రావి చెట్టు

—ఔదంబర వృక్షం

—తులసి మొక్క



—నాలుగు కుక్కలు (వేదాలు) కలసివున్నచోట క్షుద్రవిద్యలు పనిచేయవు.

* * * *

మేఘం ఉరిమినట్టు వినిపిస్తోంది 'సుకుమార్' అనబడు జ్ఞాననిధి స్వరం.

తంత్రానికి పవిత్ర స్థలం మనోహర ప్రదేశం 'శ్మశానం'

'తార' పుర్రెల మాల ధరించి నృత్యంచేసే కంకాళ వేదిక ఇది: 'షోడశి' విహరించే ప్రశాంత భూమి ఇది; 'భువనేశ్వరి' సిద్ధపీఠం ఇదే; కాళి ప్రసన్నమయ్యేది ఇక్కడే; 'చిన్నమస్త' అష్టనృత్యం చేసేది.... 'ధూమవతి మాతంగి' విహరించేది ఇక్కడే?

శ్మశాన జాగరణ— అష్టాధారభైరవ- వ్యోమభైరవ- భూతనాథ భైరవ తదితర భైరవ తంత్ర విద్యలలో సిద్ధిపొందినవారు మాత్రమే "ప్రత్యంగిరి"ని ప్రసన్నం చేసుకోగలరు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ ఆ అమావాస్య రోజున-శ్మశానంలో "ప్రత్యంగిరి"ని ప్రసన్నం చేసుకొనే ప్రయత్నం చేస్తున్నాడు.

యజ్ఞకుండం దక్షిణ దిశ మహాకాలుని ఆవాసస్థలం. ఆ దిశగానే మహాకాలునికి ఆహుతి సమర్పించాలి.

మంత్రపఠనం-ఆహుతి 'జ్ఞాననిధి' కార్యక్రమం అయితే-నిర్ణీత వ్యవధిలో సాగే మంత్రపఠనానికి అనుగుణంగా ఆహుతి ఇవ్వవలసిన హోమద్రవ్యాలను అందిస్తున్నాడు దయ్యంలా వున్న ముసలివాడు.

తెల్లటి ముగ్గు- పసుపు— కుంకుమలతో దిద్దిన పంచకోణం: ఆ పంచకోణాల్లో స్థాపించిన పంచ భైరవులు, మధ్యలో కంకాళధారి భైరవుడు! అష్టదిగ్బంధనం చేసి చేతులు రెండూ గాలిలో వూపుతూ-మాలయ మాలయ క్షోభిణి క్షోభిణి హోంఫట్" అంటూ గుప్పెట తెరిచాడు చేతిలో ఆవాలు, మిరియాలు, లవంగాలు-హోమద్రవ్యం హోమగుండంలో వది

లాడు. హోమద్రవ్యం హోమగుండంలో పడగానే గుండంలో పెద్దజ్వాల పైకిలేచింది ఆకాశాన్ని మింగేసేట్టు!

ఆవాలు, మిరియాలు, లవంగాలు పడగానే అంత పెద్దమంట ఎలా లేచిందో తాంత్రికులకే తెలియాలి!

ఆ తర్వాత ఆలస్యం చేయలేదు జ్ఞాననిధి. తన కుడిచేతి చిటికెన వ్రేలు నరికి హోమగుండంలోకి విసిరాడు—మహాకాలుణ్ని ఆవాహన చేస్తూ!

పక్కనే వున్న ముసలివాడు అందించిన సారాసీసాలోని సారా తీసి భైరవునికి భోగం చేశాడు. ఆ తర్వాత గతంలో వలెకాక రహస్య మంత్రాలు తనలోతానే గొణుక్కుంటున్నట్టు చదవసాగాడు. మంత్ర పఠనం పూర్తయ్యేసరికి తెగిన చిటికెన వ్రేలు దానికి అదిగా తిరిగి వచ్చి అతుక్కుంది.

"ప్రత్యంగిర" ప్రసన్నమయితే తలపెట్టిన పని పూర్తికాకపోవట మన్నది లేదు. ప్రత్యంగిరి ప్రసన్నమైన మరుక్షణాన గాయత్రిపై శీతలా ప్రయోగం చేస్తాడు. గాయత్రి ఆ రుద్రభూమిలోకి అడుగిడిన మరుక్షణాన భగపూజ చేస్తాడు.

భగపూజవలన నిత్య యవ్వనం సంక్రమిస్తుంది.

ఆమె తనకు తానుగా తన శరీరావయాల్ని కోసి, హోమగుండములో అగ్నికి ఆహుతి ఇస్తుంది. అపుడు 'కృత్య' తన వశం అవుతుంది.

"ప్రత్యంగిరి" ప్రసన్నం కావడానికి ఏకనిష్ఠతో బీజమంత్రాలు వల్లించాలి. బీజమంత్రాలు వల్లిస్తూ ప్రతిసారీ స్వరక్తాన్ని హోమగుండములో ఒలికించాలి. తన తొడనుంచి ఒక మాంస ఖండం బయటకు తీయాలి-ఆ మాంస ఖండాన్ని ముక్కలుచేసి భోగం చేయాలి.

ఈ ఉపాసనా విధానం బహువిచిత్రంగా వుంటుంది. ఒక పుర్రెని



తీసుకొచ్చి హోమగుండంలో ముందు నేలలో పాతిపెట్టాలి. ముష్టికా ప్రహారంచేసి ఆ పుర్రెకు అప్పుడే కాల్చిన శవ భస్మం రాసి కుంకుమ బొట్టు పెట్టాలి. ఆ పుర్రె కళ్ళలో రెండు మేకులు కొట్టాలి—రాతిముక్కలతో ఆ పుర్రె చెవులు మూయాలి-నాసికా పుటాలలో కుంకుమ దట్టించాలి.

ఆ విధంగా కంకాళదశ ద్వారాలూ బంధింపబడాలి.

తరువాత కార్యక్రమానికి ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి.

జ్ఞాననిధి 'కృత్య' వశమైతే 'ప్రత్యంగిరి' ప్రసన్నం కావడం తథ్యం. అప్పుడతడు గాయత్రిపై శీతలా ప్రయోగాన్ని దిగ్విజయంగా పూర్తిచేయగలడు.

గాయత్రి గంగానది అంతటి పవిత్రురాలు. కన్నెపొర తొలగని పవిత్రకన్నె ఆమె శరీరంలోని ప్రతి రక్తపు బొట్టూ ఒక పూజా పుష్పమే! ఆమె శరీరంలోని ప్రతి అవయవమూ క్షుద్ర దేవతలకు మహా ప్రసాదమే!

క్షుద్ర దేవతోపాసకులు కోరుకునేది ఆ వ్యక్తి పరిపూర్ణ ఆరోగ్యవంతుడా? కాదా? అని కాదు.

రోగాలపుట్ట అయినాసరే మంచి వంశం, సదాచార సంప్రదాయ కుటుంబంనుంచి వచ్చిన వ్యక్తిని పూజ్య వస్తువుగా స్వీకరిస్తారు.

గాయత్రి సదాచార సంపన్నురాలు. ఆమె తండ్రి నిత్యం సూర్య నమస్కారాలు, గాయత్రీ జపం చేయనిదే పచ్చి గంగ కూడా సేవించరు.

అటువంటి కన్నెపిల్లను బలి ఇస్తే....?'

గాయత్రిని అర్పించడానికే శీతలా ప్రయోగం చేయబోతున్నాడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.

అందుకు అవసరమైన క్రతువులకి ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి.

అయితే ఆమె ఇంట నిత్యం గాయత్రీదేవి నామస్మరణ జరుగుతుంది.

ఆ ఇంట ఔదంబర వృక్షం వుంది. తాజాగా కుక్కపిల్లలుకూడా చేరాయి.

మనిషికి అగుపించని ప్రేతాత్మలు,దుష్టశక్తులు ఆ భైరవులకన్ను కప్పలేవు.

ఒక రాత్రివేళ కుక్కలు భయంకరంగా మొరుగుతుంటాయి. హడావిడిగా లేచిచూస్తే మనకు ఎవరూ కనిపించరు. కుక్కలు ఎందుకు అరిచాయో అర్థంకాక మన నిద్రను పాడుచేశాయని విసుక్కుంటూ వెళ్ళి పడుకుంటాం. గాని శుచిగా గాయత్రీదేవిని కొద్దిసేపు జపించండి కనీసం ఆంజనేయున్నయినా తలుచుకోండి.

—ఆ క్షణాన మనకా ఆలోచనేరాదు.

ఈ సృష్టిలో మన కంటికి కనిపించేవేగాదు, కనిపించనివి కూడా చాలా తిరుగుతుంటాయి.

అర్ధరాత్రివేళ- గోడగడియారం ఒకటిన్నర చూపుతున్న సమయంలో గాయత్రి తన గదిలో వత్తిగిలి పడుకొని వున్నది. అప్పటి వరకూ నిశ్చలంగావున్న చెట్లకొమ్మలు ఎవరో కదిపినట్లు అల్లల్లాడినాయ్. నిశ్చలంగా వ్రేలాడుతున్న ఆ గది కర్టెన్లు కొద్దిగా కదిలాయి. గాయత్రి ఒంటిమీదున్న దుప్పటి ఎవరో లాగినట్టు క్రిందకు జారిపడింది

ఆ నిశ్శబ్ద నిశీధిలో కొద్దిగా కదలిక—

ఆ ఇంట్లో వారంతా గాఢనిద్రలో మునిగి వున్నారు.





ఎవరో అరికాలితో గిరినట్టు గబుక్కున లేచి కూర్చుంది గాయత్రి.

ఆ సమయంలో ఆ యింటి వాతావరణంలో హటాత్తుగా మార్పు వచ్చింది. ప్రతి వస్తువులోనూ చిన్న కదలిక; గాలికి రెపరెప! కానీ ఆ పెరట్లోని ఒకే ఒక చెట్టు ఆకుకూడా కదలడంలేదు అది ఔదంబర వృక్షం.

అంతకు మించిన మార్పొకటి స్పష్టంగా కనిపిస్తోంది.

అంతక్రితం రోజునే ఆ యింటికి వచ్చిన అయిదు కుక్కపిల్లలు ఏదురు బోదురుగా అరుస్తున్నాయి ఆ కుక్కపిల్లలకు మెడలో గొలుసులు లేవు. ఆ అయిదింటినీ కలిపి ఒక జాబులో పడేశారు. వెదురు కర్రలతో తయారుచేసిన ఆ జాబుని తమ ముట్టెలతో ఎత్తివేయాలని కొన్ని ప్రయత్నిస్తుంటే, వెనుక కాళ్ళమీద నిలబడి ముందుకాళ్ళతో వెదురు జాబుల్ని గీరుతున్నాయి మరికొన్ని.

ఈ కుక్కల అరుపులకి ఇంట్లో వారంతా నిద్రలేచారు.

ముందుగా మేల్కొన్న నారాయణాచార్యులుగారు లైట్లువేస్తూ కుక్కపిల్లల దగ్గరకొచ్చారు. ఆ జాబులోకి పురుగూ పుట్రా ఏదయినా వచ్చిందేమోనని అనుమానంగా చూసారు. అటువంటిదేమీ కనిపించకపోవటంతో "కొత్తగదా.... అలవాటులేక అల్లరి చేస్తున్నాయి కాబోలు" అనుకున్నారు. వాటిని సముదాయించి వెనుదిరిగారు

గాయత్రి పడుకునివున్న గదిపక్కగా వెళ్తూ యాదృచ్ఛికంగా ఆ గదిలోకి చూసారు-అప్పుడే గాయత్రి క్రిందపడివున్న దుప్పటి తీసుకుని కప్పుకుంటోంది.

"ఈ గోడవకి నిద్రలేచినట్లుంది........" అనుకున్నారుగాని, "ఏమ్మా.... నిద్రపట్టడం లేదా?" అని కూతుర్ని అడిగివుంటే బాగుండేది.

ఆయన యధాలాపంగా వెళ్ళిపోయారు.

గాయత్రి దుప్పటికప్పుకుని పడుకుంది.

వెదురు జాబులోని కుక్కపిల్లలు నాలుకజార్చి రొప్పుతున్నాయి; వాటికళ్ళలో నీలినీడలు ఇంకా దోబూచులాడుతూనే వున్నాయి.

సరిగ్గా అదే సమయంలో—

బుడబుక్కలవాడొకడు వూరుకి దక్షిణాన వున్న నదిలో స్నానించి, భస్మం ధరించి పూజాదికాలు పూర్తిచేసి ఢమరుకమ్మోగిస్తూ ఊళ్ళోకి ప్రవేశించాడు.

బలిపీఠం దగ్గరకు తిన్నగా వెళ్ళాడు.

దేవాలయంలో అధిదేవతలుంటారు.



ఆ అధిదేవతలకు ప్రత్యధిదేవతలు మరికొందరు వుంటారు దేవాలయాన్ని ఆశ్రయించుకున్న వున్న దేవతలకోసం అర్పించే నివేదనా స్థలమే బలిపీఠం.

బలిపీఠం దగ్గర నిలబడి గాలిగోపురంవేపు దృష్టి సారించాడు ఆ బుడబుక్కలవాడు.

ఒక్క శ్రీరంగంలోనే గాలిగోపురం సప్త ప్రాకారాలుగా ఉంటుంది. అంటే- సప్తలోకాలు/అగ్నికి సప్తజిహ్వలు/సప్తఋషులు/సప్త పూజావిధానాలు- అన్న భావాన్ని స్ఫురింపజేస్తుంది.

కానీ యిక్కడ ఒకే ఒక గాలిగోపురం వుంది.

"ఓ పురజనులారా- అంబ పలుకుతోంది; జగదాంబ పలుకుతోంది గరుడధ్వజం వెంటనే లేపండి"

—ధ్వజస్తంభం ఆ గ్రామానికి/పట్టణానికి రక్షాకవచం.



—గరుడధ్వజం ఆ గ్రామంలోకి దుష్టశక్తులు అడుగిడకుండా నిరోధిస్తుంది.

'గరుడ ధ్వజం' లేపమన్న హెచ్చరిక—

దుష్టశక్తులు/క్షుద్రశక్తుల రాకని తెలియజేస్తున్నాయి.

ఆ రోజున ఆ బుడబుక్కలవాడు పదేపదే యీ హెచ్చరిక చేసాడు.

* * * *

"అయ్యో ఇదేమిటండీ- తులసి కుంపటి పగిలిపోయింది" నొచ్చుకుంది నారాయణాచార్యులగారి శ్రీమతి సుందరమ్మ.

ఆమె నిత్యం తులసిపూజ చేస్తుంది. ఆ యింట్లో తులసిమొక్క లేకపోవడంతో ఆమె ఓ కుండీ తెప్పించి అందులో తులసిమొక్క నాటింది. ఆ మట్టికుండే ముక్కలయింది. మొక్క చిందరవందరయింది.

"చూడండి మీ కుక్కపిల్లల నిర్వాకం...." కుక్కపిల్లలే ఆ తులసి కుండీని పాడుచేశాయనుకొని కంప్లెయింట్ చేసిందామె.

"కుక్కపిల్లలకి తులసిమొక్కతో పనేమొచ్చిందబ్బా.... అయినా నోరులేని కుక్కపిల్లల్ని ఆడిపోసుకుంటే పాపం వస్తుంది. మరో మొక్క తెచ్చుకో" అన్నారు మునిమునిగా.

సరిగ్గా అప్పుడే ఓ ఆటోవచ్చి యింటిముందాగింది.

ఓ నడివయసు వాడు ఆటోదిగాడు.

ఆయన- నారాయణాచార్యులుగారి బావమరిది, సుందరమ్మగారికి స్వయాన తమ్ముడు.

లల్లాచారి- డాక్టర్ చల్లాచారి- సంప్రదాయ బ్రాహ్మణ కుటుం

ఇంలో జన్మించినా వృత్తిరీత్యా కొంత; సహవాసరీత్యా మరికొంత నాస్తికభావాల్ని జీర్ణింపచేసుకున్నారు.

సూర్య నమస్కారాలు పూర్తికానిదే గంగనయినా ముట్టని అక్కగారు, గాయత్రికి హారతి యివ్వనిదే ఇల్లు కదలని బావగారు ఆయన దృష్టిలో పరమఛాందసులు.

ఆయన బాధ అక్కా-బావల గురించి కాదు, మేనకోడలు-గాయత్రి గురించే!

ఈ పోటీ ప్రపంచంలో డిగ్రీ చదువుతున్న ఆడపిల్లలో కనిపించవలసిన డేషింగ్ నేచర్ ఈమెలో కనిపించడంలేదు; పూజలు-వ్రతాలు-ప్రదక్షిణలు అని కాలయాపన చేస్తోంది, ఈ సమయాన్ని కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కి కేటాయించవచ్చు గదా!

—అన్నది ఆయన అభిప్రాయం.



ఆ సమయంలో ఆయన ఆ యింటికి రాకుండా ఉన్నట్టయితే నారాయణాచార్యులు నిత్యం కొలిచే గాయత్రీదేవి; సుందరమ్మగారు పూజించే తులసి ఆ యింటిని ఏ విధంగా కాపాడేవో ...!

* * * *

**పసుపు-**

పసుపు రంగులోనే వుంటుంది. కానీ జ్ఞాననిధి ముందున్న పసుపు నలుపు రంగులో వుంది. ఇది మధ్యప్రదేశ్‌లో నర్మదా తీరంలో మండలా ప్రాంతంలో లభిస్తుంది. మధ్యప్రదేశ్ - ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో వున్న బస్తర్ అడవుల్లోకూడా లభిస్తుంది. నేపాల్‌లో మక్వాన్‌పూర్ లోపల దొరుకుతుంది.

—దీని రుచి పసుపు రుచే: రంగు మాత్రం నలుపు. అంతే!

—తాంత్రిక ప్రయోగాలలో ఈ నల్లపసుపును కాళికాదేవి నుదుట తిలకంగా దిద్దుతారు. కాళికాదేవికి ఈ నల్ల పసుపు చాలా ఇష్టమట!



దీనిని కాలీ హల్ది అంటారు.

కాలేతుంబిలోని ద్రవాన్ని తీసి కాలీ హల్దిలో పోసి ముద్దచేశాడు జ్ఞాననిధి.

కాలీ తుంబిలో నీళ్ళు నింపి కాళికాదేవిని పూజిస్తే సాధకుని మనో వాంఛితం నెరవేరుతుందని తాంత్రికుల నమ్మకం.

మామూలుగా సొరకాయను/గుమ్మడికాయను ఒకవైపు పగులగొట్టి పావ పాత్రగా సాధువులు వాడతారు. అయితే రాజస్థాన్ అడవులలో-మణిపూర్ కొండ ప్రాంతాలలో గంగోత్రి వద్ద తాటిచెట్టులా ఓ చెట్టు వుంటుంది. దీని పండ్లు క్రింద రాల్తాయి వీటి రంగు నలుపు, బాగా ఎండిన ఆ పండ్లతో పాత్రలు తయారుచేస్తారు.

కాళికాదేవిని ప్రసన్నం చేసుకున్న తర్వాత 'జ్ఞాననిధి' విరబోసుకున్న జడలోంచి రుద్రజడను చేతిలోకి తీసుకున్నాడు. అప్పుడే కాల్చిన శవభస్మం దానికి దాని అలంకరించాడు. కుంకుమ పెట్టాడు. కార్యసిద్ధికి నైవేద్యం సమర్పించాడు.

(దక్షయజ్ఞాన్ని భగ్నం చేయడానికి పరమశివుడు కూడా రుద్రజడను యజ్ఞగుండంలోకి జారవిడిచాడు. ఆ యజ్ఞగుండం నుంచి వెలువడిన వీరభద్రుడు స్వయానా కాళికాదేవి సోదరుడే! కాళికాదేవి ఆలయంలో వీరభద్రుడ్ని ముందుగా స్తుతించడం ఆనవాయితీ అయింది. భైరవ గణాలు- 108)

విపరీత కాళీక్రియ చేపట్టాడు జ్ఞాననిధి.

తెల్లని ఆవాలు చేతిలోకి తీసుకుని—

"వజ్రి రోచనీయే దేహి దేహి

ఏహి ఏహి, గృహ్ణ గృహ్ణ

మమ సిద్ధి దేహి, దేహి

మమ శత్రూన్ మారయ, మారయ

కరాళికే యాంఫట్"- అంటూ ఉచ్చైస్వరంతో ఉచ్చరిస్తూ తెల్లని ఆవాలను విసిరేశాడు.

చూస్తూండగానే ఒక పెద్ద అగ్నిజ్వాల లేచింది. వెంటనే తన బ్రహ్మశిఖను చేతులతో లాగి అగ్నిశిఖకు సమర్పించాడు.

ఆ అగ్నిజ్వాల సుడిగుండం గాలిలోకి లేచినట్లు లేచింది.

అగ్నిశిఖ చూస్తూండగానే తెల్లని పొగలా మారింది. ఆ పొగ మానవాకృతిని ధరించింది.

ఇహ ఆలస్యం చేయలేదు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.

కృత్యాప్రయోగానికి పూర్వం బ్రహ్మశిఖను చేతులతో తెంపి యజ్ఞకుండంలోకి విసిరేయడం అనవాయితీ-సమస్త బంధవాలను ఛేదించి కృత్యకు లొంగిపోతున్నానని దీని అర్థం.

ఆ సమయంలో ఉపాసకుని ముఖంలోకి చూడటానికి ఎవరైనా సిద్ధపడ్డారంటే దాని అర్ధం—చావుకి తెగించారనే!

'హూం ఫట్' అంటూ గుప్పెట గట్టిగా పట్టాని అగ్నిలోకి ఆహుతులు కసికొద్దీ విసురుతున్నాడు పళ్ళు నూరుతూ దవడ కండరాలు బిగపట్టి మంత్రోచ్ఛారణ చేస్తున్నాడు.

తన చేతి వేలుకి గాయంచేసి రక్తం యజ్ఞకుండలంలోకి జారవిడుస్తున్నాడు.

యజ్ఞకుండలంలో సమర్పించిన రక్తం లక్షలకొలది బిందువులుగా వికీర్ణమై నలువైపులా చిమ్మింది.

ముడివడిన అతడి భృకుటి చూసి ప్రకృతే వణికింది—

—అన్నట్టు మానవాకృతి ధరించిన పొగ అక్కడ్నించి ఆకా





శమార్గాన బయల్దేరింది. అతడి మంత్రోచ్ఛారణ వేగాన్ని పుంజుకుంటున్నకొద్దీ ఆ పొగమనిషి వేగం హెచ్చింది.

భగపూజ వాంఛ జ్ఞాననిధి అనబడు సుకుమార్ కళ్ళలో మెరుస్తోంది. నుదుటిమీద ముడుతలు మామూలే. నాసికా పుటాలు అదురుతున్నాయి. అతడి కళ్ళు ఎర్రగా రక్తపు గడ్డల్లా వున్నాయి.

* * * *

కృత్యా ప్రిన్సిపాల్ నారాయణాచార్యులు గారింటికి చేరుకోవడానికి కొద్ది నిమిషాలు మాత్రమే పట్టింది. కృత్యా ఆగమనంతో ఆకాశం అల్లకల్లోలమయింది. కారుమబ్బులు దొంతరు దొంతర్లుగా ఆకాశాన్ని కప్పేశాయి.

ప్రతి గృహానికి కొంతమంది దేవతలుంటారు. భూమి పూజ చేసేటప్పుడు ఆ భూమిని ఆశ్రయించి వున్న ప్రత్యధి దేవతల్ని తృప్తిపరచడం జరుగుతుంది.

—ప్రత్యేకించి నిత్యం అనుష్టానం జరిగే ఇంట్లో ఈ దేవతలందర్నీ ఆవాహనం చేయడం, ఉద్వాసన పలకటం జరుగుతుంది.

అయస్కాంతానికి ఆకర్షణశక్తి ఎలా వుంటుందో, అలాగే నిత్యానుష్టానం జరిగే ఇంటికి కొన్ని శక్తులుంటాయి. 'బెర్ముడా ట్రయాంగిల్'లోకి ఓడలు ఏ విధంగా ప్రవేశించలేవో ఆదే విధంగా తులసి మొక్క, ఔదంబర వృక్షం వున్న పెరట్లోకి దుష్టశక్తులు ప్రవేశించలేవు. అయితే ఆ ఇంట్లోని తులసి కుండీ పగిలిపోయింది. ఇహ మిగిలింది ఔదంబర వృక్షం మాత్రమే....

ఆ చెట్టు ఆ ఇంటి పెరట్లో వున్నంతకాలం ఏ దుష్టశక్తి ఆ ఇంట్లో వాళ్ళని ఏమీ చేయలేదు.

కృత్యా ఆ ఇంటి పెరడులోకి ప్రవేశించలేక కొట్టుమిట్టాడుతూంది.

ఒక సాధకుడు ఒక శక్తిని ఒక వ్యక్తిపై ప్రయోగిస్తే ఆ శక్తి అవతలి వ్యక్తిని పీడించి తీరవలసిందే. లేకుంటే ఆ శక్తిని ప్రయోగించిన వ్యక్తికి అశుభం కలుగుతుంది

—వంశీ బహూకరించిన కుక్క పిల్లలు భయంకరంగా మొరుగుతున్నాయి.

—వాతావరణంలో హఠాత్తుగా వచ్చిన మార్పుకి కాబోలు కుక్క పిల్లలు మొరుగుతున్నాయి అనుకున్నారంతా. అంతలో కరెంటు కూడా పోయింది. జడలు విరబోసుకున్న దేవతలా ఊగిపోతున్నాయి చెట్లు.

—చీకటి నాట్యమాడుతున్న వేళ గాయత్రి భయంకరంగా కేక పెడుతూ పడిపోయింది.

ఎమర్జెన్సీ లైట్లు వెలిగించారు.

నారాయణాచార్యులు బావమరిది- డాక్టరు రంగంలోకి దిగారు పరీక్షలు జరిపి ప్రమాదమేదీ లేదని నిర్ధారించాడు.

"తమ్ముడూ, ఎందుకిలా పడిపోయింది... ఈడొచ్చిన పిల్లఏదైనా కన్ను చెదిరిందేమో" అన్నది సుందరమ్మ.

'ఈడొచ్చిన పిల్ల.... కన్ను చెదిరింది' అనడంలో వేరొక అర్థం స్ఫురించింది డాక్టరుకి.

"అదేం లేదక్కా.... హిస్టీరిక్ రియాక్షన్, అంటే షాక్ తగలడం వలనగాని, ఏదయినా చూడరానిది చూస్తేగాని ఇలాగే రియాక్ట్ అవుతారు. ప్రస్తుతానికి ప్రమాదమేం లేదు.... ఇంజక్షన్ ఇస్తాను, బాగా నిద్ర పడుతుంది. మనిషికి కొంచెం నిస్సత్తువ అనిపించవచ్చు.... టానిక్స్ వాడడం మంచిది" అంటూ మెడిసిన్స్ రాసిచ్చాడు.

మిగిలినవారు కూడా అయన అభిప్రాయంతో విభేదించలేదు.... మందులు తెప్పించాడు నారాయణాచార్యులు గారు.

* * * *



తెల్లవారింది—

అంతక్రితం రోజు తాలూకు ప్రభావం ఇంకా తొలగిపోలేదు.

వాస్తవానికి ఆ సమయానికి నారాయణాచార్యులుగారు పూజచేసి ఇంటిల్లిపాదికీ తీర్థం ఇస్తారు. కానీ గాయత్రి అస్వస్థత ఆయనను కలవరపరిచింది. డాక్టరు బావమరిది లేకపోతే పూజచేసి తీర్థంతోపాటు విభూది కూడా కూతురినోట్లో వేసేవారాయన.... డాక్టరు ఇంట్లో వుండడంవలన ఆయన తాను నిత్యం పూజించే గాయత్రి కన్నా డాక్టరు పైనేఎక్కువగా ఆధారపడ్డాడు.

కూతురు కొద్దిగా నలతపడితే ఆ తండ్రి పడుతున్న ఆరాటాన్ని చూసి ముసి ముసిగా నవ్వుకుంది సుందరమ్మ.

"కూతురి పెళ్ళి చేసి పంపుతున్నప్పుడు ఈయనను పట్టుకోలేం కూతురు ప్రసవ వేదన పడుతుంటే ఈయన తట్టుకోగలడా?" అనుకున్న సుందరమ్మ, "అమ్మాయి లేచి తన పనులు తాను చూసుకుంటుంది గాని, మీరు వెళ్ళి పూజాకార్యక్రమం ముగించి రండి" అన్నది.

కూతుర్ని విడిచి వెళ్ళాలని అనిపించకపోయినా పూజా కార్యక్రమం వుంది గనక తప్పనిసరై వెళ్ళాడు.

మరో గంటకు అందరికీ తీర్థంయిచ్చి ఇంటిముందరకు వెళ్ళాడు. అక్కడ వాతావరణమంతా కొత్తగా వుంది, గందరగోళంగా వుంది

ప్రశ్నార్థకంగా బావమరిది నిల్చున్న వేపు నడిచాడు. -బావా.... ఈ చెట్టు కరెంట్ తీగల్ని తాకుతున్నాయి. పచ్చచెట్లుకదా.... షాక్ కొడుతుందని కొట్టించేశాను అయినా నీకు ఇంత అజాగ్రత్త అయితే ఎట్లా బావా....పైగా పెద్ద పెద్ద చెట్లు వుండే పిడుగులు పడతాయంటారు గదా?" అంటూ ఇంకా ఏదో చెప్పుకుపోతున్నాడు.

నారాయణాచార్యులవారికి అవేమీ వినిపించటంలేదు. ఆ చెట్టుని కొట్టిన వ్యక్తినే చూస్తున్నాడు.

పౌడవాటి గెడ్డం-

చిన్న తువ్వాలు మినహా అతడి ఒంటిమీద ఇతర ఆచ్ఛాదన ఏమీలేదు.

మెడలో పాము ఎముకలు గుది గుచ్చిన మాల-

కళ్ళు ఉబికి రక్తం గడ్డ కట్టినట్టున్నాయి

అంతక్రితం రాత్రి ఒక కపాలంలో మేక మూత్రం, రెండవ కపాలంలో పేల్చిన కనుగుడ్లు 'జ్ఞాననిధి'కి అందజేసిన 'కాలుడు' వాడు!

ఆ 'కాలుడు' నరికిన చెట్టు ఔదంబర వృక్షం!

క్రితం రాత్రి 'కృత్యా' క్షుద్రదేవత ఆ ఇంటి పెరట్లోకి ప్రవేశించకుండా ఏ ఔదంబర వృక్షం ప్రతిఘటించిందో, ఆ ఔదంబర వృక్షాన్ని నరికేశాడు.

ఆ ఇంటి పెరట్లోని తులసి మొక్క నశించింది. ఔదంబర వృక్షం నరికివేయ బడింది. ఇహ మిగిలింది నారాయణాచార్యులుగారు ఆరాధించే గాయత్రి, వంశీ బహూకరించిన కుక్కపిల్లలు.

గాయత్రితో భగ పూజ!

'జ్ఞాననిధి' అనబడు సుకుమార్ సుందర స్వప్నమది.

జీవితాశయం కూడా!

# 11

సన్నగా గాలి వీచింది. అప్పటివరకూ నిశ్చలంగా వున్న చెట్ల కొమ్మలు కదలడం మొదలెట్టాయి. చూస్తూ వుండగానే గాలి ఉధృత



మయింది. ఈ హఠాత్పరిణామానికి విస్తుబోతూ కిటికీ తలుపులు వేయడానికి లేచింది గాయత్రి తల్లి సుందరమ్మ.

అప్పుడు చూసిందామె. పెరట్లోని దుమ్ము కదలికలో ఓ ప్రత్యేకత వుంది వేస్తున్న కిటికీలను ఎవరో బలవంతాన తెరుస్తున్నట్టుంది. ఎండుటాకులపై ఎవరో నడుస్తున్న శబ్దం.

పెరట్లోని వెదురుజాబు క్రింద దాచిన కుక్కపిల్లలు ఎలా బయటపడ్డాయో తెలియదు. ఒకటికి ఐదు మోరఛాచి చెవులు రిక్కించి, కళ్ళు చికిలించి, గొంతు చించుకుని అరుస్తున్నాయి.

ఆ వేపు చూసింది సుందరమ్మ. ఎవరూ కనిపించలేదు. కానీ ఎవరో వున్నట్టు ఐదు కుక్కలూ ఆ వ్యక్తివేపే చూస్తున్నట్టు, ఆ వ్యక్తిని ముందుకు కదలనీయకుండా నిలేసినట్టు మొరుగుతున్నాయి.

ఆ కుక్కల అరుపుకి నిద్రలేచారు ప్రిన్సిపాల్‌గారు, ఆయన బావమరిది.

సుందరమ్మగారికి ఏమీ అర్థం కావడంలేదు. ఏదో జరుగుతోందని మాత్రం సిక్స్‌సెన్స్ చెబుతోంది తెల్లగా రక్తం లేనట్టు మొహం పాలిపోయింది ఏదో ఉన్మాదం ఆవహించినట్టు పెద్దగా కేకలు పెట్టింది. కేకలు పెడుతూ మొదలు నరికిన చెట్టులా కూలింది. ఆ తర్వాత ఏం జరిగిందో ఆమెకు తెలియదు.

ఆ తర్వాత ఏం జరిగిందన్నది తర్వాత తెలుసుకుందాం. అంతకుముందు ఏం జరిగిందన్నది ముందుగా తెలుసుకుందాం.

ఆదివారం-

అమావాస్య కలసిరావడం చాలా అరుదు.

ఎప్పుడూ ఏ భావమూ కనిపించని అతడి ముఖంలో ఇప్పుడు ఓ భావం కనిపిస్తోంది.

అతడు 'కాలుడు'

'ఆందోళన.... ఆతృత.... ఆశ' కాక్‌టెయిల్ అయిన భావనలతో ఎగ్జయిట్‌మెంట్‌తో అతడి నరాలు తెగిపోయేట్టు వున్నాయి. అతడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్‌నే చూస్తున్నాడు.

కోసి రాసిపోసిన నిమ్మచెక్కలు, తెగిన కోడి తలలు, వెదజల్లిన పసుపు కుంకుమలు, హోమగుండంలో పేలుతున్న తెల్ల ఆవాలు, చిటపటలాడుతున్న పేళ్ళు, హోమగుండంనుంచి సుడులు తిరుగుతున్న మంటలు.

ఎర్రగా కందిన మొహం.

ఆవేశంతో అదురుతున్న పెదవులు.

భయంకరమైన నిశ్శబ్ద నేపథ్యంలో వేగంగా కదులుతున్న పెదవులు;

ఆరోహణ అవరోహణ క్రమంలో దశదిశలా వ్యాపించిన మంత్ర పఠనం.

కళ్ళనిండా ముక్కునిండా నీళ్ళు సుడులు తిరుగుతున్న పేగుల తెగిపోయేలా వున్నా అతడు మంత్రోచ్ఛారణ ఆపలేదు.

ఆ స్మశానంలో దక్షిణ భాగాన జరుగుతున్న ఈ ఘోర మారణ హోమాన్ని చూసి ప్రకృతి కూడా భయంతో బిగుసుకుపోతున్నట్లుంది.

'అటో ఇటో' తేల్చుకునే సమయమది.

కంటినిండా నిద్ర, కడుపునిండా తిండి లేక చిక్కి శల్యమైన 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్‌కి తెలుసు. కాలుడికీ తెలుసు-ఈ తతంగంలో ఏ చిన్నతేడా వచ్చినా ఫలితం దారుణంగా వుంటుందని!



మంత్రోచ్చారణలోనే కాదు, కూర్చున్న భంగిమలో హోమ ద్రవ్యాల విడుదలలో ఓ నియంత్రణ, నిబద్ధత వుంది. ఆ పద్ధతి ప్రకారం జరగకపోతే ఫలితం దారుణంగా వుంటుంది. ఉపాసకుడే తొలి బలిపశువవుతాడు.

కళ్ళుచూసి సాధకుని లక్షణాన్ని చెప్పొచ్చు.

కళ్ళలో మెరుపు వున్నవాడే యోగి!

"ఆరోగ్యకరమైన మనసుని ఒకే విషయంపై కేంద్రీకరిస్తే అది సమాధి."

—బుద్ధ

ఆరోగ్యం - No excitement

-non emotional



-non exhaugaratioe

తంత్రం ఇక్కడే ఆరంభమవుతుంది.

పంచమకారాలు స్టెరాయిడ్ వలె పని చేస్తాయి.

అయిదోది- మండలం- శారీరక దిగ్బంధం!

సమయం గడుస్తున్న కొద్దీ కాలుడిలో ఆతృత ఎక్కువవుతోంది. దిగులు దిగంతాలకు వ్యాపిస్తోంది.

క్షుద్రోపాసనకి నియమ నిబంధనలున్నట్టే నిర్ణీతకాల వ్యవధి వుంది. ఏ నిర్ణీత కాలంలోనే కార్యక్రమం ముగియాలి. క్షుద్రదేవత కనిపించాలి. లేకపోతే విపరీత పరిణామాలు కనిపిస్తాయి.

దెబ్బతిన్న పులి మేన్ ఈటర్‌గా మారి ఎటువంటి భీభత్సాన్ని సృష్టిస్తుందో ఆవిష్కరింపబడని క్షుద్రదేవత అంతకు వందరెట్లు భీభత్సాన్ని సృష్టిస్తుంది.

దూరాన ఎక్కడో రెండు గంటలు కొట్టినచప్పుడు వినిపిస్తోంది.
భేతాళుడ్ని ఆవాహం చేస్తున్నాడు 'జ్ఞాననిధి'.

వేగాన్ని పుంజుకున్న పెదవుల్ని బిగ్గరగా వినిపిస్తున్న మంత్రాలను బట్టి జ్ఞాననిధి మానసిక స్థితిని అంచనా వేయవచ్చు.

అతడి కదలికలు అతడిలో పడగవిప్పిన ఆవేశాన్ని చెప్పక చెబుతున్నాయి.

అప్పుడు జరిగింది విచిత్రం.

జ్ఞాననిధికి, హోమగుండానికి మధ్యనున్న ఖాళీ ప్రదేశంలో పిండితో గీసిన భేతాళుడు నైవేద్యాన్ని భక్షిస్తున్నాడు.

కళ్ళు పెద్దవిచేసి మరీ చూశాడు- నైవేద్యానికి కాళ్ళు వచ్చాయో, భేతాళుడి రెక్కలు విచ్చుకున్నాయోగాని నైవేద్యం భేతాళుడి నోటిదగ్గరకు నడిచివెళుతోంది.

కాలుడి పెదవులపై నవ్వు- వరద గోదారిలా- ఉప్పొంగింది. చెదిరిన కలలా స్మశానమంతా వ్యాపించింది.

క్షుద్రదేవత కృత్యాప్రయోగం ఔదంబర వృక్షంతో విఫలం కావడంతో మరుసటి రోజున భేతాళుడ్ని ప్రయోగిస్తున్నాడు జ్ఞాననిధి.

* * * *

ఒక మంచుకొండ భగ్గుమని మండినట్టయింది.

ఆమె కళ్ళలో సెలయేళ్ళు చిమ్ముతున్నాయి.

మనసంతా గందరగోళంగా వుంది. అపశకునం అయిదు రంగులలో కనిపిస్తోంది. ఇల్లంతా చీకటి అలముకున్నట్టు వుంది - ఆ చీకటి శాశ్వతం అవుతుందేమోనని ఆమె భీతి! సన్నగా వణకడం ప్రారంభిం





చింది. భార్యను ఆ స్థితిలో చూసిన నారాయణాచార్యులుగారు తట్టుకోలేకపోయారు. "శ్రీ...." అంటూ గావుకేక పెట్టారు.

ఎప్పుడూ గాంభీర్యంగా, నెమ్మదిగా వుండే నారాయణాచార్యులుగారు "శ్రీ...." అని భీతిగా కేకపెట్టడం డాక్టరు అల్లాదారికి విస్మయం కలిగించింది.

అప్పటికే సుందరమ్మకి స్పృహ తప్పింది. ఆమెను ఆ స్థితిలో విడిచిపెట్టి బావా మరుదులు యిద్దరూ పరుగెత్తారు. డాక్టరు లల్లాచారి తన మెడికల్ కిట్ తీసుకొస్తే, నారాయణాచార్యులుగారు పూజగదిలోకి వెళ్ళి తీర్థం, కుంకుమ తీసుకొచ్చారు.

నారాయణాచార్యులు తీర్థం నోట్లోపోసి నుదుట కుంకుమ దిద్దితే, డాక్టరు లల్లాచారి ఇంట్రావీనస్ ఇంజక్షన్ ఇచ్చాడు.

అంతకు కొద్దిక్షణాల క్రితం ఆమె ముఖంలో దోబూచులాడిన ఆవేదన యిప్పుడులేదు. నిద్రలోకి జారుకున్నట్టుంది. ఎగశ్వాస దిగశ్వాసతో గుండెలు ఎగిరిపడుతున్నాయి. ఆమెను మంచంమీద పడుకోబెట్టారు,

కళ్ళుమూసుకుని గాయత్రిని చదువుతున్న నారాయణాచార్యులు కళ్ళు తెరిచారు.

"లల్లా.... ఎందుకిలా జరిగింది?" అని అడిగారు.

"ఏదో షాక్ తిన్నట్టుంది"

"కన్ను చెదిరిందంటావా?" రెట్టించారాయన.

"ఆ కుక్కపిల్లల్ని తీసుకొచ్చావు గదా, ఒకటికి అయిదు- కొత్త ప్రదేశం కావడంతో గిబర గాబరాగా అరుస్తున్నాయి. మంచి నిద్రలో ఆ అరుపులు వినిపించి వుంటాయి" అని ఆయన యింకా ఏదో చెబుతుండగా బయటనుంచి ఓ విచిత్రమయిన శబ్దం వినిపించింది.

అంతకుపూర్వం- అయిదు కుక్కలూ ఎవరో ఒక వ్యక్తిపై దాడి చేస్తున్నట్టు అరిచాయి. ఇప్పుడు అలాకాదు. ఎవరో ఒక కుక్కపిల్లను క్రిందపడేసి పీకమీద కాలేసి తొక్కుతుంటే అది చేస్తున్న ఆర్తనాదం భీకరంగా వినిపిస్తోంది. మిగిలిన నాలుగు కుక్కలూ ఆ వ్యక్తిపై పడి పీకుతున్నట్టున్నాయి. ఆ వ్యక్తి ఎవరో 'నేకెడ్ ఐ'కి కనిపించడం లేదు.

"బావా, ఎవరయినా పెంచితే ఒక కుక్కపిల్లని పెంచుతారు. లేదా రెండు కుక్కల్ని పెంచుతారు కానీ నీ వలె అయిదు కుక్కపిల్లల్ని పెంచరు. చూడు, ఆ అయిదూ ఎలా దెబ్బలాడుకుంటున్నాయో ఒకదాన్నొకటి పీక్కుంటున్నాయి...." అన్నాడు డాక్టరు లల్లాదారి.

అసలు విషయం బోధపడక యింటితలుపు తెరుచుకుని నారాయణాచార్యులుగారు పెరట్లోకి వెళ్ళేసరికి ఒక ఘోరం జరిగింది.

ఆ అయిదు కుక్కల్లో ఓ కుక్కపిల్ల అచేతనంగా పడివుంది. దాని పీకమీద కాలువేసి నులిమినట్టు, పదునయిన గోళ్ళతో పొట్ట చీల్చి పేగులు లాగినట్టు భీకరంగావుంది ఆ దృశ్యం.

మిగిలిన నాలుగు కుక్కల కళ్ళలో భీతి, మెరుగుతున్నాయి- విషాదంగా!

ఇక్కడ ఇంత హడావిడి జరుగుతున్నా ప్రిన్సిపాల్ గారమ్మాయి గాయత్రి ఎక్కడుంది? ఎందుకు రాలేదు? మెలకువ రాలేదా?

—అన్న ఆలోచనలు ప్రిన్సిపాల్ గారికి, డాక్టర్ లల్లాదారికి రాలేదు! వస్తే బాగుండేది!

ఆ సమయంలో గాయత్రి తన గదిలో మంచంమీద లేదని, నేలమీద స్పృహతప్పి పడిపోయి వుందని గ్రహించేవారు.

* * * *



మూర్తీభవించిన విషాదంలా నిలబడ్డ ప్రిన్సిపాల్ గార్ని చూడగానే ఖాదర్ కి కడుపులో దేవినట్లయింది.

ఖాదర్- కాలేజీలో ప్రిన్సిపాల్ గారి దగ్గర పనిచేసే ప్యూను.

చనిపోయిన కుక్కపిల్లను బయట పారేయడానికి ఖాదర్ ని పిలిపించారు ప్రిన్సిపాల్ గారు.

"ఎందుకు బాబుగారూ, ఇటువంటి పనులు చేయడానికే గదా మేమున్నది" అంటూ వచ్చాడువాడు..

పొదవాటి గెడ్డం, మెడలో పాము ఎముకలు గుదిగుచ్చిన మాల, ఉబికి గడ్డకట్టినట్టున్న కళ్ళు—మొలకు తువ్వాలు!

వాడు 'కాలుడు'.

ఔదుంబర వృక్షాన్ని నరికి ఆ యింటి రక్షాకవచాన్ని ఛేదించిన క్షుద్రదేవతోపాసకుడు; 'జ్ఞాననిధి'.... అనబడు సుకుమార్ అనుచరుడు.

భేతాళుడు వేటాడిన భైరవుడ్ని భక్షిస్తే శక్తి లభిస్తుందని వారి నమ్మకం. అందుకే ఆ మృత శరీరంకొరకు వచ్చాడతడు. అది వారికి మహాప్రసాదం.

కాలుడు

—మెడలో పాము పూసలమాలను ధరించిన అతడ్ని చూడగానే ఖాదర్ దృష్టి సూదంటురాయిలా అతడ్ని అతుక్కుపోయింది.

వీడ్ని ఎక్కడో చూసాను....

ఎక్కడ?
ఎక్కడ?

—ఫాదర్ ఆలోచనలనుంచి తేరుకోకపూర్వమే చచ్చిపోయిన కుక్కపిల్లని తీసుకుని కాలుడు అక్కడ్నించి కదిలాడు.

డాక్టర్ లల్లాచారికి అంతా కన్‌ఫ్యూజన్‌గావుంది. తన సోదరి సుందరమ్మగారికి బి పి, షుగర్ చెక్ చేయించాడు. ఏ సమస్యాలేదు. ఆమెకు జీవితంలో ఒడిదుడుకులనేవి లేవు సంఘంలో హోదా, గౌరవం వున్నాయి. ఆర్థికంగా ఏ లోటూ లేదు. అయినా ఆమె మానసికంగా ఆందోళన చెంది కొత్త సమస్యలు తెచ్చిపెట్టుకుంటోంది. ఆమెకువున్న ఆ సమస్యలేమిటి?

—అని తన అక్క గురించే ఆలోచిస్తున్నాడుగాని మేనకోడలు గాయత్రి రూపంతో ముంచుకొస్తున్న ప్రమాదాన్ని పసిగట్టలే దాయన!

ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారు కూడా!



# 12

ఎవరి భృకుటి ముడిపడితే ప్రకృతి భయంతో కంపిస్తుందో—

ఎవరి పేరు చెబితే తాంత్రికులు గడగడలాడిపోతారో—

ఆ కపాలనాథుడ్ని ఆవాహనం చేస్తున్నాడు సుకుమార్!

అతడి కుడిచేతిలో కపాలం వుంది. అది మానవరక్తంతో నిండి వుంది.

పెదవులు- కనురెప్పలు- ఎడమచేయి ఒక క్రమంలో కదుల్తున్నాయి. అతడి ఎదురుగానున్న అగ్నిగుండంనుంచి జ్వాలలు పైకి లేస్తున్నాయి. అతడి చేతిలోని రుధిర కపాలాన్ని అందుకోవడానికి నాలుకలు చాస్తున్నాయి.



హటాత్తుగా అతడి స్వరం హెచ్చింది.

"శ్రీం హ్రీం క్లీం ఇం వజ్రావైరోచ వీయే హూం హూం ఫట్ స్వాహా"

—అంటూ కుడిచేతిలోని రుధిర కపాలాన్ని అగ్నికుండంలోకి జారవిడిచాడు.

కపాలాన్ని యజ్ఞకుండంలోని జాజ్వల మానమైన జ్వాలలలో ఆహుతిగా సమర్పించగానే భయంకరమైన గర్జన వినపడింది. రక్తంతో నిండిన పుర్రె ఎంత వేగంగా అతడి కుడిచేతి నుంచి యజ్ఞకుండంలోకి జారిందో అంతే వేగంతో పైకి— గాలిలోకి— ముక్కలు ముక్కలై చిందరవందరగా లేచింది. ఆ రక్తం లక్షలకొలది బిందువులుగా వికీర్ణమై నలువైపులా చిమ్మబడింది. ఆ పుర్రె వేలకొలది ముక్కలై గాలిలో కలిసిపోయింది. నలువైపులా దృశ్యం భయానకంగా వుంది.

కాలివేలితో చుట్టూ గిరి గీసి మధ్యలో నిలబడిన సుకుమార్ ముఖంలో వింత తేజస్సు పడగవిప్పిన త్రాచులా కనిపిస్తోంది. ఎర్రని కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి.

అప్పుడు అందించాడు కాలుడు— కుక్క మాంసాన్ని- మహా ప్రసాదంగా!

"ఓం కాళీ కంకాళీ కిలకిలా క్లీం రక్త కంబలే మహాదేవీ మృతుక యుత్థాపయ, చాలయ చాలయ, పర్వతాం కంపయనీలయ హూం హూం భూతనాథాయ భూతేశ్వరాయ అజ కింకరోత్తమ కంకాళీ మహాకాళీ కేలీ కలాభ్యాం హూం హూం"

—అంటూ ఆ కుక్కమాంసాన్ని మహాప్రసాదంగా యజ్ఞకుండంలోకి జారవిడిచాడు, తాను స్వీకరించాడు.

అప్పుడు లేచిందొక దట్టమైన పొగ. కాలుడి మెడలోని సర్ప అస్థికల మాలజీవం పోసుకున్నట్టు గాలిలోకి లేచింది. నలువైపులావింత

శబ్దాలు. శ్మశానంలో నలువైపులా భూత, ప్రేత పిశాచాలు విచిత్ర వికృత ధ్వనులతో వింత ఆకృతులతో పుట్టుకొస్తున్నాయి. యజ్ఞకుండం నుంచి లేచిన పొగ సుడిగాలిలా మారింది. శ్మశానానికి నైరుతిదిశవేపు లేచిపోసాగింది. ఆ వేపున ఊరుంది- గాయత్రి ఇల్లు వుంది.

సత్తువంతా కూడదీసుకోవాలని ప్రయత్నిస్తోందిగాయత్రి. నుదురు మీద చెమట చుక్కలు బంగారంమీద తాపిన ముత్యాల్లో మెరుస్తున్నాయి. ఆమె చేతులు వణుకుతున్నాయి. అంత రాత్రివేళ అందరూ ఆదమరచి నిద్రపోతున్నారు. శరీరంలోని భాగాలన్నీ పారలైజ్ చేయబడినట్టున్నాయి. గొంతు తడారిపోతోంది. ఏం జరుగుతుందో అర్థం కావడంలేదు. దక్షిణ దిశ నుంచి ఎవరిదో పిలుపు వినిపిస్తోంది. రుద్రభూములు ఊరికి దక్షిణాన వుంటాయి. ప్రేతాత్మలు మనిషిని దక్షిణం వేపు నుంచి గమనిస్తుంటాయి, క్షుద్ర దేవతోపాసకులు దక్షిణం వేపే తిరిగి అన్ని పనులూ చేస్తారని ఆమెకు తెలియదు. ఆ సమయంలో గాయిత్రీ మంత్రం పఠించినా, హనుమాన్ చాలీసా చదివినా ఆమెకు ఆ గండం గడిచేదే! ఇవేమీ తెలియని ఆమె ఈ రెంటిలో ఏదీ చేయలేదు.

పాములు పగబడతాయని మనవాళ్ళు నమ్ముతారు. కానీ వశీకరణాన్ని నమ్మరు 'హిప్నోటిజమ్'కి ఈ రోజులలో అత్యంత ప్రచారం లభించింది. హిప్నోటిజాన్ని విశ్వసిస్తే ఒక వ్యక్తిని మరో శక్తి అదుపులోకి తీసుకునే విషయాన్ని కూడా మనం నమ్మితీరాలి.

ఆ ఇంట్లో ఇప్పుడు అదే జరిగింది. ఎవరో మత్తుమందు చల్లినట్లు ఆ ఇంటిల్లిపాదీ గాఢ నిద్రలోకి జారుకున్నారు. అప్పుడు సమయం సరిగ్గా రెండు గంటలు.

ఆ సమయంలో ఆ ఇంటి పెరట్లో ఒక సుడిగాలి తిరిగింది. ఆ సుడిగాలి మానవ రూపం ధరించింది. ఆకాశం నుంచి పొగ మేఘం సుడిగాలిలా నేల మీదకు దిగడం గమనించిన జీవులు నాలుగే నాలుగు అవి- కుక్కపిల్లలు.



పేగులు తెగేలా మొరగడం ప్రారంభించాయి.

ప్రాచీనులు లోక కళ్యాణం కోసమే తమకు తెలిపిన విద్యలన్నిటినీ అంకితం చేశారు. లోక కళ్యాణం కోసమే ఆ విద్యల్ని సాధించాలన్న తపనతో ఎన్నో అద్భుతమైన త్యాగాలు చేశారు ఆచార్యకాలనేమి ఆ ఉద్దేశంతోనే తాను ఆర్జించిన విద్యలన్నింటినీ సుకుమార్‌కి ధార పోశాడు.

అఘోరగా మారి అర్ధదారిన పరమహంసగా మారాలని, నిత్య యవ్వనాన్ని సాధించాలని-మృత్యువుని పారద్రోలాలని కంకణం కట్టుకున్నాడు సుకుమార్.

అఘోర రతిక్రియకు ఎన్నుకునేది రోగిష్టి మనిషినా? సంపూర్ణ ఆరోగ్యవంతురాలా? —అంటే రోగిష్టి అయినా అభ్యంతరం లేదు. కానీ ఆ అమ్మాయి మంచి వంశం నుండి వచ్చి వుండాలి, దైవచింతన వుంది వుండాలి.

అందుకే సుకుమార్ గాయత్రిని ఎంచుకుంది భగపూజకు.

ఆ సుడిగాలి యువకునిగా మారింది.

గాయత్రి గది ముంగిట ఆగింది. తలుపులు వాటంతట అవే తెరచుకున్నాయి.

ఆమె పడుకుని ఉన్న మంచం మీద కూర్చున్నాడతడు. "గాయత్రీ.... గాయత్రీ" అని పిలుస్తున్నాడు.

ఆ మాట తీరు.... ఆ పిలుపు.... ఆ మధురమైన కంఠస్వరం.... ఎక్కడెక్కడికో దూర తీరాలకు తీసుకెళుతోంది. మెస్మరైజ్ చేస్తోంది. అతి కష్టం మీద కళ్ళు తెరిచింది...

ఆ కంఠం విన్న తర్వాత అతడ్ని చూడాలన్న కోరికలను అణచుకోలేక కళ్ళు తెరిచింది.

అంతటిసౌందర్యం మగవాళ్ళలో వుండదు. అంతటిసౌకుమార్యం మగవారిలో అసంభవం.

నందయిన విగ్రహం, ఐదడుగుల పది అంగుళాల ఎత్తు, కోల మొహం, కళ్ళు మిల మిల మెరుస్తున్నాయి. సూదంటురాయిలా ఎదుటి వ్యక్తి చూపుల్ని లాగేసుకుంటున్నాయి.

ఆ కళ్ళ నుంచి చూపు తిప్పుకోవడం కష్టం.

"కమాన్ గాయత్రీ.... కమాన్ ...." అంటూ చేయి అందించాడు అతడు.

అతడెవరో తెలియదు. తన గదిలోకి ఎలా వచ్చాడో అంతకంటే తెలియదు– ఎక్కడికి వెళదామంటున్నాడో కూడా తెలియదు. తెల్సుకునే ప్రయత్నం చేయడం లేదామె

ప్రతిఘటించే, ప్రశ్నించే స్థితిలో లేదామె. ఆమె మనసు ఆమె స్వాధీనంలో లేదు. ఆమె ఏమీ ఆలోచించే స్థితిలో కూడా లేదు. అతడు చెయ్యి అందించాడు ఆ చెయ్యి ఆసరాగా పట్టుకుని మంచం దిగింది ఆమె.

మనిషి పంచభూతాత్మకం- మానవ శరీరం నిప్పు, నీరు, నేల, గాలి, ఆకాశంతో తయారు చేయబడింది. ఇందులో భూతత్వం ఎక్కువ, అందుకే నేలను అంటి పెట్టుకుని వుండేది. కానీ భూత ప్రేత పిశాచ రాశులు త్రివార్ణాత్మకం.

వీటికి పొడవు, వెడల్పు, ఎత్తు వుంటాయి లోతు వుండదు ఇవి తమ ఆకారాన్ని మార్చుకోగలవు భూమ్యాకర్షణ శక్తి వీటిపై పని చేయదు. గాల్లోకి క్షణంలో ఎక్కడికయినా వెళ్ళగలవు

గాయత్రి గదిలోకి వచ్చిన అతడి పాదాలు నేల మీద ఆనడం లేదు. నేల మీద నిలబడి వున్న గాయత్రి ఈ విషయము గమనించ లేదు.



గాయత్రిని తన వెంట బయటకు తీసికెళ్ళిన అతడు ఆమెను భగపూజ కోసం బలిపశువుగా సుకుమార్ ముందు నిలబెట్టేవాడే కానీ నాలుగు కుక్కలూ నాలుగు దిశల నుంచి వచ్చి కమ్ముకోవడంతో ఆగిపోయాడు. మంత్రజలం చిలకరించినట్లు ఆ కుక్కల నోటి నించి కారుతున్న చొంగ అతడ్ని నిర్వీర్యుడ్ని చేశాయి

మరికొద్దిసేపే అక్కడే వుంటే రక్షా కవచంలా వున్న ఆ నాల్గు కుక్కల్ని తరిమికొట్టటం మాట ఎలా ఉన్నా తాను అక్కడ్నించి కదలలేనేమోనన్న అనుమానం వచ్చిందతనికి. గాయత్రిని అక్కడ విడిచి ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు. అప్పటి వరకూ ఆచ్ఛాదనగా నిలబడి వున్న అతడు హఠాత్తుగా తప్పుకోవడంతో ఆమె కుప్పకూలిపోయింది.

ఇసుక బస్తా నేలమీద పడినట్లు దబ్బున క్రింద పడింది.

ఆమెకు రక్షణగా నలువేపులా నాలుగు కుక్కలు. పూర్వం ఆ యింటిని క్షుద్ర శక్తుల నుంచి కాపాడిన ఔదంబర వృక్షం, తులసి మొక్క, ఆంజనేయుని క్యాలెండరు ఇప్పుడు ఆ యింట్లో లేవు ఉన్నవి కుక్కలు మాత్రమే

కపాలనాథుడు అంతటివాడు రిక్త హస్తాలతో తిరిగి రావడంతో లావాలా లోలోపల ఉడికిపోయాడు సుకుమార్.

శత్రువుకి కోపం తెప్పించి అతడ్ని ఓడించడం తంత్ర శాస్త్రంలో ఓ కిటుకు.

పొంచి వున్న ప్రమాదాన్ని పసిగట్టిన కాలుడు రంగ ప్రవేశం చేశాడు- "గురుదేవా! ఆ యింట్లో గాయత్రీ ఉపాసకుడయిన నారాయణాచార్యులు, చతుర్వేద రూపాంతరాలయిన నాలుగు కుక్కపిల్లలు ఉన్నంత కాలం మన ప్రయత్నాలు ఈ విధంగానే బెడిసి కొడుతుంటాయి. ఆ నారాయణాచార్యులు చెయ్యి నోరు పడిపోతేగాని ఆ యింట్లో గాయత్రీదేవి వశం ఆగదు.

అప్పుడు గాని నీవు ప్రయోగించే శక్తులు ఆ యింట్లో బీభత్సాన్ని సృష్టించలేవు. ఆ కుక్కపిల్లల్ని చంపే బాధ్యత నాది. నారాయణాచార్యులు నోరు, చెయ్యి పడిపోయేలా చూసే బాధ్యత నీది. కానివ్వు...." అంటూ తక్షణ కర్తవ్యాన్ని ప్రబోధించాడు.

తృటికాలంపాటు సుకుమార్ కళ్ళు మూతలు పడ్డాయి.

ద్రవాణ తంత్ర సాధనతో సమస్త శక్తులను అధీనం చేసుకోవడానికి నిర్ణయించుకున్నాడు స్నానం చేసివచ్చి సాధనకు కూర్చోవాలని నిశ్చయించుకున్నాడు, రేవు వేపు నడిచాడు.

వేద పండితుడు ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారి కాలు, చేయి, పడిపోవటానికి నేపథ్యం సిద్ధమౌతోంది.

* * * *

ఒకప్పుడు ఆ ఇల్లు పూజాపునస్కారాలతో కళ కళ లాడుతూ వుండేది,

ఇప్పుడు ఆ ఇంటి పెరట్లో మొదలు నరికిన ఔదంబర వృక్షం వుండే వుండేచోట బోసిగా కనబడుతోంది పెరట్లో మొదలు నరికిన చెట్టులా పడివుంది గాయత్రి

మార్నింగ్ వాక్‌కి బయల్దేరిన డాక్టరు లల్లాదారి గాయత్రిని ఆ స్థితిలో చూసి మొదట కంగారుపడ్డాడు. పల్స్ చూసి స్థిమిత పడ్డాడు. రెండు చేతులతో ఆమెను లేవనెత్తి లోపలికి తీసుకొస్తూండగా రెండు సంఘటనలు జరిగాయి.

ఒకటి—

ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారి వద్ద కాలేజీలో పనిచేసే ఖాదర్ రాత్రంతా నిద్ర లేకుండా నిరాహార దీక్షలో వుండి తావీదు తయారుచేసి తీసుకొచ్చాడు. ఆ తావీదు ఆమె ఒంటి మీదున్నంతకాలం ఏ క్షుద్రశక్తి గాయత్రిని సమీపించలేదు.



రెండు—

బ్రహ్మ ముహూర్తంలో గాయత్రీ జపం పూర్తిచేసిన నారాయణాచార్యులుగారు కూతురుకి తీర్థం యివ్వడానికి తీసుకొస్తున్నారు. ఒక్క చుక్క ఆమె గొంతులోకి దిగితే చాలు అణుబాంబు కన్నా శక్తివంతంగా పనిచేస్తుంది, దుష్ట శక్తుల్ని పటాపంచలు చేస్తుంది !

# 13

రాత్రి నీరవ వాతావరణంలో కాళీ స్తోత్రం చేస్తున్నాడు జ్ఞాననిధి అనబడు సుకుమార్.

కష్ట కాళికలను అర్చించి తాజా శవ భస్మం తెచ్చి విశాలాక్షి నుదుట తిలకం దిద్దాడు తాజా శవ మాంసం తెచ్చి విశాలాక్షికి భోగం చేసాడు

బటుక్ భైరావుడు— కాల భైరావుడు- ముండీ భైరావుడు- రక్త భైరావుడు- సిద్ధి భైరావుడు— కంకాల భైరావుడు- కంకాల భైరావుడు- ముండీ భైరవుడు— రక్త భైరవుడు— సిద్ధి భైరవుడు- కంకాల భైరవుడు- త్రినేత్ర భైరవుడు— ఘనద భైరవుడు- అనంత భైరవుడు- అదిగా గల భైరవ గణాలను ఆవాహనం చేశాడు, ప్రసన్నం చేసుకున్నాడు.

తర్వాత ఆగ్నేయ దృష్టితో దక్షిణం వేపుగా ముఖం పెట్టి మహాకాల యజ్ఞకుండంముందు కూర్చున్నాడు. మూడు ముంతల సారా తాగాడు. మిగిలిన సారా నెత్తిన కుమ్మరించుకుని స్మశాన భైరవుడయ్యాడు.

నిత్యం గాయత్రీజపం చేసే నారాయణాచార్యుని నిర్వీరుణ్ని చేయడానికి 'మహాభైరవ ప్రయోగం' చేస్తున్నాడు జ్ఞాననిధి ఖడ్గమాల సిద్ధి పొందినవాడు-కుండలిని జాగృతపరచి జిహ్వ ద్వారా కపాలాన్ని

స్పర్శించి 'అమృతీకరణ క్రియ' సాధించిన నారాయణాచార్యులు గాయత్రీ జపం చేస్తున్నంతకాలం, ఆయన కుమార్తె గాయత్రి తన వశం కాదు. గాయత్రిని వశం చేసుకోవాలి. భగపూజ చేయాలి. ఆమెను అష్ట కాళికలకు అర్పించాలి. ఆమె రక్తాన్ని హోమగుండంలో తర్పణం చేయాలి. ఆమె మాంసాన్ని మహాప్రసాదంగా అర్పించాలి.

ఒక వ్యక్తి పక్షవాతంవచ్చి కాలు, చెయ్యి కదపలేక-నోట మాట రాక పడిపోయేలా చేయడానికి అభిచారక్రియతో సంక్షోభిణీ కృత్యం ప్రారంభించాలి.

యజ్ఞకుండంలో అగ్ని ప్రజ్వరిల్లింది. గురువునుంచి అయాచితంగా 'వ్యోమచారిక్రియ' సాధించిన జ్ఞాననిధి శూన్యంలో చేతులుతిప్పి మానవ రుధిర పాత్ర సృష్టించాడు. తాజాశవ భస్మం తన ఆసనంకింద చల్లి, మిగిలిన భస్మాన్ని తన శరీరం అంతా పూసుకున్నాడు. కరాళ భైరవుడిగా మారాడు. అతడి కళ్ళలో పైశాచికత్వం కుబుసం విడిచిన త్రాచులా బుసలు కొడుతోంది.

మాంసంతో నిండిన ఒక నిశిష్ట పాత్రని శూన్యంలోంచి సృష్టించాడు. మంత్రాలు ఉచ్ఛరిస్తూ మాంసం ముక్కలు ముక్కలు చేసి ఆహుతి ఇస్తున్నాడు. మాంసం, మదిర- ఈ రెండూ ఆహుతి చేసిన వాసనతో వాతావరణం వికారంగా విచిత్రంగా వుంది. చిటచిటమని సమిధలు మండుతున్నాయి.

వామాచార క్రియలు ముగించి పక్కనేవున్న కత్తితో ఎడమచేయి చిటికెనవ్రేలుని అతి దారుణంగా చీల్చుకున్నాడు దానినుంచి వచ్చే రక్తాన్ని యజ్ఞకుండంలో సమర్పించాడు.

ఏకనిష్ఠతో బీజ మంత్రాలు వల్లిస్తూ ప్రతిసారీ స్వరక్తాన్ని సమర్పిస్తున్నాడు, మంత్రం మొదలు చివరలో మాంసం ముక్కలు సమర్పించి కృత్య ఆవిర్భావం కోసం మార్గం సుగమం చేస్తున్నాడు.





క్షేత్ర పాలకుని తనముందు ప్రత్యక్షం చేసుకుని కృత్యను ఆవాహం చేశాడు. బ్రహ్మ శిఖను చేతులతో తెంపి యజ్ఞకుండంలో వేశాడు. సమస్త బంధనాలను తెంచుకొని కృత్య వెలువడబోతోంది. మారణకాండ ప్రారంభం కాబోతోంది.

సరిగ్గా అదే సమయంలో- ఆ బ్రాహ్మీముహూర్తానికి-పూజ్కి చేయడానికి నారాయణచార్యులవారు తలారా స్నానంచేసి పట్టు వస్త్రం ధరించి పూజ గదిలోకి అడుగుడే ముందు పూలకోసం పెరట్లోకి వెళ్ళాడు.

ఇక్కడే జరగరానిది జరిగింది-

పూలకోసం పెరట్లోకి వెళ్ళకుండా ఆయన తిన్నగా పూజ గదిలోకి అడుగిడితే ఏ క్షుద్రశక్తి ఆయనను సమీపించేదికాదు. కనీసం పెరట్లో ఔదంబర వృక్షం వున్నా ఆ ప్రాంగణంలోకి క్షుద్రశక్తులు రాగలిగేవి కాదు.

నారాయణాచార్యులగారి శ్రీమతి మడిదుస్తులతో మహా ప్రసాదం తయారుచేస్తోంది.

అప్పుడు జరిగిందది-

రుద్రభూమిలో జ్ఞాననిధి పళ్ళు నూరుతూ దవడ కండరాలు బిగపట్టి మంత్రోచ్చారణ చేస్తున్నాడు, గుప్పెట గట్టిగా మూసి 'హాంఫట్' అంటూ అగ్నిలోకి ఆహుతులు విసురుతున్నాడు.

ఆ యజ్ఞకుండంముందు కపాలంవుంది. అది మానవరక్తంతో నిండి వుంది. దానిపై కుంకుమతో 'హాంఫట్' అని రాసివుంది.

ఆ రుధిర కపాలాన్ని యజకుండంలోని జాజ్వల్యమైన జ్వాలలలో ఆహుతిగా సమర్పించగానే భయంకరమైన గర్జన వినబడింది. యజ్ఞకుండంలో సమర్పించిన ఆ రక్తం లక్షల కొలది బిందువులుగా వికీర్ణమై నలువేపులా చిమ్మింది. ఆ పుర్రె ముక్కలు గాలిలో కలిసింది.

యజ్ఞకుండం బద్దలై పొగ దుమారం లేచింది. ఆ దుమారం క్రమక్రమంగా ఒక ఆకృతి ధరించింది.

భైరవ సాక్షాత్కారంతో ఉన్మాదిలా మారాడు జ్ఞాననిధి. రుధిరం-మాంసం-మద్యం మహాప్రసాదంగా సమర్పించి తక్షణ కర్తవ్యాన్ని నిర్దేశించాడు.

ఆ భైరవుడు గగన మార్గాన నారాయణాచార్యులగారి ఇంటివేపు బయల్దేరింది.

పెరట్లోని పూలు, ఆకులు తెంచుకుని-బావిలోని నీటిని తీసుకుని ఇంటిలోకి అడుగు పెట్టబోతున్న నారాయణాచార్యులుగారు కుక్కపిల్లలు భయంకరంగా మొరగడం చూసి లోపలకు వెళ్ళబోతున్నవాడల్లా అప్రయత్నంగా ఆగాడు. అంతలో ఒక బలమైన కెరటంలా గాలి ఆయనను ముందుకు పడవేసింది. చేతిలోనివస్తువులన్నీ చెల్లాచెదురయ్యాయి. గుండెలమీద ఎవరో కూర్చున్నట్టు ఊపిరి పీల్చడమే కష్టంగా వున్నట్టు ఆతలాకుతలమయ్యారాయన. జవసత్వాలు ఉడిగిపోతున్నట్టు, ఆకులా ఊగిపోయారు. ఆయన మూలుగులకి వంటఇంటిలోని సుందరమ్మగారు ప్రసాదాన్ని అలాగే విడిచిపెట్టి ఒక్క ఉదుటున పెరట్లోకి వచ్చింది.

కోడిపిల్ల రెక్కలు విరిచినట్టు ఆయన కాలు, చెయ్యి పీక్కుపోసాగాయి. మూతి ఒక వేపుకు తోసుకుపోసాగింది

డాక్టర్ అయిన ఆయన బావమరిది వచ్చేలోపే జరిగిందది

కుంకుమపూజ చేయడానికి-తీర్థం ఇవ్వడానికి-హారతి ఇవ్వడానికి యిప్పుడాయన కుడిచేయి కదలదు.

ఇప్పుడాయన మంత్రపఠనం చేయలేరు. నోట్లోంచి మాట రావడమే కష్టం!

ఆ ఇంటిని కాపాడే ఔదంబర వృక్షం లేదు. తులసిమొక్క లేదు.



గాయత్రీ జపంచేసే నారాయణాచార్యులుగారు లేరు.

నారాయణాచార్యులుగారి కుమార్తె గాయత్రిని బగళ పూజకు తీసి కెళ్ళడాన్ని ప్రతిఘటించేశక్తి ఏదీలేదు-నాలుగు కుక్కపిల్లలు మినహా!

తుంగ పరకలు ఒకటిగా చేరి మదగజాన్ని బంధించగలవా?

ఎక్కడో స్మశానంలో యజ్ఞకుండం ముందు కూర్చుని ఇంత బీభత్సాన్ని సృష్టించే శక్తి అతడికి వుండగా-ఆ చిన్న కుక్కపిల్లలకు మాత్రం ఆ శక్తిని ప్రతిఘటించే శక్తి లేదని ఎలా చెప్పగలం?

* * * *

ప్రిన్సిపాల్ గారికి పక్షవాతం వచ్చిందట!

ఈ వార్త బయటకు పొక్కడంతో స్టాఫ్, స్టూడెంట్స్ ఆయనను అడ్మిట్ చేసిన హాస్పిటల్‌కి వెళ్ళారు.

ఈ హడావిడిలో మరో ఘోరమైన పొరపాటు జరిగింది. నారాయణాచార్యులుగార్ని హడావిడిగా హాస్పటల్‌కి తీసుకెళ్ళే ప్రయత్నంలో ఎవరికివారు ఆ రోజున ఆ ఇంట్లోని పూజగదిలో దీపారాధన చేయలేదని, నైవేద్యం పెట్టలేదని మర్చిపోయారు. సుందరమ్మగారు ఇంట్లో వున్న గాయత్రినికూడా గుర్తుచేసుకోలేదు. గాయత్రి గదిలోకి తొంగి చూసినా ఆమెకు విషయం బోధపడేది.

గాయత్రి అసలు టార్గెట్.

నారాయణాచార్యులు-తమకు ప్రతిబంధకం కాకూడదనే మొదటగా ఆయనను తమ దోవనుంచి తప్పించింది.

ఆ ఇంట్లోని వారెవరయినా పరిశీలనగా చూసివుంటే కేవలం ఆ ఇంటిమీదే మేఘంలా ఆవరించివున్న విచిత్రమైన ఆకారాన్ని గమనించి వుండేవారు, ఏ ఒక్కరూ ఆ మేఘాన్ని గమనించలేదు.

ఆంజనేయం చేస్తున్న ఏ ఉపాసకుడయినా ఆ ఇంటి పెరట్లోకి అడుగుపెట్టినా-

గాయత్రీ స్తోత్ర పఠనం అక్కడ వినిపించినా ఆ మబ్బు మటు మాయమయ్యేదే?

వీటిలో ఏ ఒక్కటీ జరగలేదు.

ఇంతకు మించిన విచిత్రం ఒకటి అక్కడ చోటుచేసుకుంది.

ఆకాశంలో పయనిస్తున్న పక్షి సయితం ఆ ప్రాంగణ ప్రాంతానికి రాగానే తన దిశ మార్చుకుంటోంది.

ఒక వాక్యంలో చెప్పాలంటే—అక్కడ ప్రకృతి స్తంభించి పోయింది.

ఆ నిశ్శబ్ద నీరవంలో కుక్కల తాలూకు ప్రకంపనాలు భయంకరంగా వ్యాపిస్తున్నాయి. ఒక విస్ఫోటపు భ్రాంతిని కలిగిస్తున్నాయి.

ఆకాశంలో ఫ్రిజ్ అయినట్టున్న మేఘాన్ని, నేలమీద తోకలు ముడిచి- మోరలు చాచి మొరుగుతున్న కుక్కల్ని చూస్తే తాంత్రిక విద్యలలో పరిచయం వున్న వారెవరికైనా వెన్నులో సన్నటి జలదరింపు మొదలవడం ఖాయం!

ఆ సమయంలో గాయత్రి తన గదిలో నేలమీద పడివుంది. ఆమె స్పృహలో వున్నట్టు కనిపించడంలేదు. గాఢనిద్రలో వున్నట్టు గాలిని పీల్చి వదిలినపుడు గుండెలు ఎగిసి పడుతున్నాయి!

ఆమె మొహంలో ఆదోరకమైన కళ తాండవిస్తోంది.

ఆకాశంలో తారట్లాడుతున్న భైరవుడు ఆమెను పూర్తిగా ప్రభావితం చేయలేకపోతున్నాడు. కుక్కపిల్లల ప్రతిఘటన లేకపోతే భైరవుడు గాయత్రిని కదిలించేవాడు.

ఇక్కడ మరొక విశేషంకూడా వుంది-క్షుద్రశక్తులు రాత్రిపూట విజృంభిస్తాయి, పగటిపూట క్షీణిస్తాయి.



గాయత్రిని భైరవుడు చేయవలసినంతగా ప్రభావితం చేయక పోవడానికి ఇది కూడా ఒక కారణం!

చీకటి పడితే....?

ఆ కుక్కపిల్లలు భైరవుడ్ని నిరోధించగలవా?

అపస్మారకంగా పడున్న గాయత్రి గతి ఏమిటి?

* * * *

ప్రిన్సిపాల్‌గారిని చూడటానికి వచ్చిన వారితో ఆ హాస్పిటల్ కిటకిటలాడుతోంది. ఎవరికి తోచినట్టు వారు మాట్లాడుకుంటున్నారు. కానీ ఆ హాస్పిటల్ ప్రాంగణంలో ఓ చెట్టుకింద అచేతనంగా కూర్చున్నాడు ఒక వ్యక్తి. అతడి మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది.

అతడు-ఖాదర్-కాలేజీ ప్యూన్!

ప్రిన్సిపాల్ గారింట్లో వరుసగా జరుగున్న పరిణామాలు అతడ్ని పరిపరి విధాల ఆలోచింప చేస్తోంది.

తాను తాయెత్తు సార్‌కి ఇవ్వకుండా తప్పుచేశాడా?

తాయెత్తు కట్టుకుంటే సార్‌కి ఈ ప్రమాదం వాటిల్లేది కాదేమో?

ఇది ప్రారంభమా? పరాకాష్టా??

సరిగ్గా అప్పుడే అతడి ఆలోచనలు భంగపరుస్తూ మోటార్ సైకిల్ శబ్దం వినిపించింది.

వంశీ-మోటార్ సైకిల్ మీదొచ్చాడు.

ఖాదర్ మెదడులో ఏదో మెరిసినట్టయింది. చటుక్కున లేచాడు. అతడి మొహం పెద్ద పెన్నిధి దొరికినట్టు ఆనందంతో నిండిపోయింది. ఒక్క ఉదుటున వంశీని సమీపించాడు.

ఖాదర్‌వేపు విచిత్రంగా చూసిన వంశీ అతడు చెబుతున్నది వింటుంటే అప్రయత్నంగా నవ్వాడు.

ఖాదర్ ఇదేమీ గమనించే స్థితిలో లేడు. తాను చెప్పదలచుకున్నది చెప్పుకుపోతున్నాడు-చెబుతున్న ఖాదర్ కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి.

ఖాదర్ చెప్పేదంతా విన్న వంశీ కూల్గుగా చెప్పాడు....

"ఖాదర్! చిన్నప్పుడు ఇటువంటి విషయాలు మేము కథలు-కథలుగా విన్నాం ఇప్పటికీ ఇటువంటి కథలలో సినిమాలొస్తున్నాయి. నీవు ఏదో వూహించుకుని మాకు ఏదేదో చెబుతున్నావు నీకు నేను తప్ప చెవులో పూవు పెట్టుకున్నవాడు మరెవరూ కనిపించలేదా?" అంటూ మోటార్‌సైకిల్ తాళం జేబులో వేసుకొంటూ సిమెంటు చప్టా మీదుగా హాస్పిటల్ కారిడార్‌వేపు నడక ప్రారంభించాడు.



అలా వెళుతున్నవాడల్లా అప్రయత్నంగా వెనుదిరిగి చూశాడు. కళ్ళు తుడుచుకుంటున్న ఖాదర్ కనిపించాడు.

తాను చెప్పింది నమ్మనందుకు అతడు బాధపడుతున్నాడా? లేక ప్రిన్సిపాల్‌గారి పరిస్థితి చూసి ఏడుస్తున్నాడా?

ఎందుకో ఖాదర్‌పట్ల జాలేసింది.

అప్పుడు గుర్తువచ్చింది గాయత్రి అమె ఈ షాక్‌కి ఎలా తట్టుకోగలిగింది?

ఆమె కోసం వెతికాడు. ఎక్కడా కన్పించలేదు. ఇంటి దగ్గర వుందేమో అన్న ఆలోచన కలిగింది. ఆమెను చూడాలన్నా-ఓదార్చాలన్న కోరికను చంపుకోలేకపోయాడు. వెంటనే వెనుదిరిగి వచ్చాడు.

మోటార్ సైకిల్ ప్రిన్సిపాల్ గారింటివేపు బయల్దేరింది.

* * * *



అపస్మారక స్థితిలో పడున్న గాయత్రికి తెలియదు-తానే స్థితిలో వున్నదీ. ఆ యింటిలో ఆ కొద్దిసేపట్లో జరిగిన విపరీత పరిణామాలూ!

ఆమె ఆ స్థితిలో వుందన్న సంగతి ఏ ఒక్కరికీ తెలియదు. ఆమెను పట్టించుకొనే నాధుడే లేడు.

ఆమెను ప్రభావితంచేసి మరుభూమికి తీసికెళ్ళడానికి భైరవుడు పొంచివున్నాడు. భైరవుడ్ని విరోధిస్తూ కుక్కపిల్లలు గొంతులు పగిలేలా పొగిలి పొగిలి మొరుగుతున్నాయి.

పగటి కాంతి ప్రకాశవంతమౌతున్న కొద్దీ భైరవుడు బలహీనమవుతున్నాడు,

సరిగ్గా ఈ 'పులి-మేక పోరాటంలోకి వంశీ అమాయకంగా అడుగిడబోతున్నాడు.

# 14

శాంతిపూజలు చేసేవారు దేవతా విగ్రహాలకు పూలు, పళ్ళు సమర్పిస్తే క్షుద్రోపాసకులు మద్యమాంసాలు నివేదిస్తారు. అంతే తేడా!

ఈ రెంటికీ భిన్నమయిన స్థితిలో ఉన్నాడతడు.

అతడి ముందు ఏ దేవతా విగ్రహాలూ లేవు మడిగాలు వేసుకొని ముందుకు వంగి ఫాలభాగాన్ని నేలకు తాకించాడు. తలపై టోపీ!

సమాధి స్థితికి చేరుకున్నట్టున్నాడు. మౌనంగా తన దైవాన్ని తనలోనే ఆరాధిస్తున్నాడు.

అతడు-జబ్బార్ సాబ్!

అయన ముఖంలోని ముగతలు అయన వయస్సుని తెలియజేస్తున్నాయి

అయన ముఖంలోని ప్రశాంతత అధ్యాత్మికంగా అయనస్థానాన్ని తెలియజేస్తోంది

తెల్లటి పొడుగాటి గడ్డం—

మెడలో దండని కప్పుతూ భుజంమీద వేసుకున్న షాల్—

పండుటాకులా మనిషి వున్నా దంతాలన్నీ వుండవలసిన స్థానములో వున్నాయి.

రోజుకి ఏడుసార్లు నమాజ్ చేస్తాడాయన. అయనిచ్చే తావీజ్ కట్టుకుంటే క్షుద్రశక్తులు సమీపించవని అక్కడివారి విశ్వాసం. అయన నమాజ్‌చేసి ఎవరితో మాట్లాడకుండా బయటకు వస్తున్నపుడు చెంబుతో నీళ్ళు తీసుకెళ్ళి అయన కరుణా కటాక్ష వీక్షణల కోసం నిల్చుంటారు ఎందరో!

నమాజు చేసిన నోటితో అయన ఆ జలాన్ని పవిత్రం చేస్తారు. ఆ పవిత్ర జలం లోపలికి తీసుకుంటే రుగ్మతలన్నీ తొలగిపోతాయని ఆ చుట్టుపక్కలవారి విశ్వాసం.

అందుకే అయన నమాజు నుంచి వచ్చే సమయానికి కుల-మత ప్రసక్తి లేకుండా నీటి చెంబుతో నిలబడి వుండడం అక్కడ ఆనవాయితీగా వస్తోంది.

మక్కా యాత్ర చేసి వచ్చిన అయన దివ్యపురుషుడు. అయన కరస్పర్శ పునీతుల్ని చేస్తుందని అక్కడివారి నమ్మకం.

అయన కళ్ళలో మాగ్నెటిక్ పవర్ వుంది.

జబ్బార్ సాబ్‌నుంచే తావీజ్ తెచ్చాడు ఖాదర్.



అతడు తెచ్చిన తావీజ్ కట్టి, భస్మం నుదుట పెడితే ఆ కుటుంబము కథ మరోలా వుండేది. కానీ అలా జరగలేదు.

ప్రశాంతత మినహా ఎప్పుడూ మరో భావం కనిపించని అయన మొహంలో మరో భావం తొంగి చూసింది. అది దుష్టశక్తుల ఆగమనానికి సూచన కావచ్చు. దుష్టశక్తులకు హెచ్చరిక కావచ్చు!

* * * *

గాయత్రి పడుకుని వున్న గదిలో నిశ్చలంగా వున్న కర్టెన్లు కొద్దిగా కదిలినట్టయ్యాయి. చెట్ల కొమ్మల్ని ఎవరో నరికినట్టు 'ఫెళ ఫెళ' మంటూ విచిత్రశబ్దం వినిపించింది.

—ఆ యింటిపై అచ్ఛాదనగా మేఘరూపంలోనున్న భైరవుణ్ని కుక్కపిల్లలు పసిగట్టాయి. గొంతులు పగిలేలా మొరుగుతున్నాయి.



ఆ మేఘం కరిగి క్రమక్రమంగా నేలమీదకు జారడం మొదలెట్టింది.

ఆ ఘోరాన్ని చూడలేక ప్రకృతిసైతం మూగదానిలా మిగిలిపోయినా కుక్కపిల్లలు మాత్రం తమ కర్తవ్యాన్ని తాము నెరవేర్చుతున్నాయి.

పసికూనలకు ఎవరు నేర్పారో....

ఎవరు గాయత్రి బాధ్యత అప్పగించారో....

హటాత్తుగా పెరట్లోని వాతావరణం మారిపోయింది. దుమ్ము సుడిగాలిలా లేచి గాలిలో కలుస్తోంది. ఎండుటాకులు పెళపెళ మంటూ విరుగుతున్నాయి- ఎవరి కాళ్ళో పడినట్టు! గదిలో నిస్త్రాణగా పడివున్న గాయత్రి ఎవరో కుదిపినట్టు కళ్ళు తెరిచింది....లోతుగా పీక్కుపోయిన ఆ కళ్ళు గాజుగోళీల్లా వున్నాయి.... పెదవులు ఎండిపోయాయి. రక్తం లేనట్టు మొహం పీక్కుపోయింది.

నిత్యం పూజచేసే గాయత్రి అంతరాంతరాలలో ఎక్కడో, ఏదో అస్పష్టంగా కదులుతున్న అనుమానం....ఏదో చెప్పబోయింది. కానీ గొంతు పెగలలేదు. నేలలో పాతేసినట్టు అక్కడ్నించి కదలలేక పోయింది.

సరిగ్గా అదే సమయంలో వంశీ బైక్ ఆ కాంపౌండులోకి దూసుకొచ్చింది. అక్కడ ఎవరూ లేకపోయినా కుక్కలు గొంతులు పగిలేలా మొరగడం అతడి దృష్టిని ఆకర్షించింది.

ఖాదర్ గుర్తొచ్చాడు అతడు చెప్పింది నిజమేనేమో-అన్న ఆలోచన రాగానే పెనంమీద వేసిన ఉప్పుగల్లులా మూడేసి అడుగులు ఒక అంగగా యింటివేపు పరుగెత్తాడు.

"గాయత్రీ....గాయత్రీ...." అని అతడు పెడుతున్న ఆ కేకలు ప్రతిధ్వనిస్తున్నాయి.

నిత్యం దీపారాధనచేసే గాయత్రి స్మారకంలో వుంది.... కానీ అమ్మవార్ని స్మరించాలన్న ఆలోచన రాలేదు వస్తే ఇంత ప్రమాదం ముంచుకురాకపోను-

"గాయత్రీ.... గాయత్రీ...." అంటూ అతడు పెడుతున్న కేకలు ఏకనామంలా వినిపిస్తున్నాయి. ఆ మహాశక్తిని కదిలిస్తున్నాయి. గాయత్రిని వెదుక్కుంటూ వంశీ వెళుతున్నాడు. వంశీకన్నా ముందుగానే భైరవుడు వాయురూపంలో గాయత్రి గదిని సమీపించాడు.

పదునయిన కత్తితో నరికినట్టు, 'గాయత్రీ....గాయత్రీ' అన్న నామస్మరణ ఆ విశృబ్ద నిశీరవాన్ని తుత్తునియలు చేస్తోంది.

"గాయత్రీ....గాయత్రీ" నామజపానికి వాయురూపంలో నున్న భైరవుడు తల్లడిల్లిపోతున్నాడు. ఆ పిలుపు దగ్గరవుతున్నకొద్దీ అతడి సర్వశక్తులూ సన్నగిల్లుతున్నాయి. ఓవేపు పగటి ఎండ భైరవుడ్ని బలహీనుడ్ని చేస్తోంది; మరోవేపు గాయత్రి నామస్మరణం!



అందుకే వంశీ దగ్గరయ్యేలోపే గాయత్రిని అక్కణ్నించి కదిలించడానికి కంకణం కట్టుకున్నట్టున్నాడు భైరవుడు.

ఎవరో రెండు చేతులతో పట్టి లేవనెత్తినట్టు లేచి నిలబడింది గాయత్రి....

గాయత్రిని కదిలించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు భైరవుడు. అయితే అది సాధ్యపడటంలేదు.

వంశీ 'గాయత్రీ....గాయత్రీ' అని ప్రిన్సిపాల్‌గారమ్మాయిని పిలుస్తున్నాడు. ఆ నామస్మరణకి ఎంతటి శక్తివుందో అతడికితెలియదు. అంతకుమించి అతడిజేబులో ఆంజనేయుని బొమ్మవుంది. సుదర్శనంలా చుట్టూవున్న దుష్టశక్తుల పీచమణచడం ఆంజనేయ నైజం.

తన జేబులో ఆంజనేయస్వామి బొమ్మ వుందని, దాని ప్రభావం అంతగా వుంటుందని వంశీకి తెలియదు- 'గాయత్రి' నామస్మరణ విషయం కూడా!

వంశీ తనను సమీపించేలోపే గాయత్రిని అక్కడ్నించి కదిలించడానికి ఎంతగా భైరవుడు ప్రయత్నిస్తున్నాడో అంతగా శక్తిహీనుడవుతున్నాడు.

ఉదయభానుని తీక్షణ కిరణాలవలె గాయత్రి- ఆంజనేయుల తీక్షణతని తట్టుకోలేకతున్నాడు భైరవుడు.

గాయత్రి గదివైపు పరుగెత్తుకొస్తున్న వంశీ గాయత్రి నిల్చున్న భంగిమను చూసి ఆశ్చర్యపోయాడు. భూమికి రెండు అంగుళాల ఎత్తున నిలబడినట్టు-ముందుకు కదలడానికి ఆసరా దొరక్క గాలిలోనే తేలుతున్నట్టు చిత్రంగా కనబడింది.

వంశీని చూస్తూనే ఆమె ఏదో మాటాడటానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపించింది-ఆమె కనుబొమల కదలిక! కానీ ఎవరో పీక నులిమి

పట్టుకున్నట్టు కళ్ళు పెద్దవయ్యాయి, నోరు తెరుచుకుంది. నాలుక బయటకు చొచ్చుకొచ్చింది.

ఊహించని యీ పరిణామానికి దిగ్భ్రాంతి చెందిన వంశీ, "గాయత్రీ...." అని అప్రయత్నంగా గావుకేక పెట్టాడు.

ఆమె చేయి పట్టుకున్నాడు.

అంతే—నారసింహంలా పనిచేసిందా పిలుపు.

గాయత్రిని అప్పటివరకూ పట్టివుంచిన శక్తి మాడుమీద పెడేలుమని చరిచేనట్టయింది. ఆ దెబ్బకు తట్టుకోలేక, తన అక్కసునంతా వెళ్ళగక్కుతూ- తన శక్తికొద్దీ తన చేతుల్లోని గాయత్రిని విసురుగా విసిరేసి పారిపోయాడు.

గది పైకప్పుకి కొట్టుకుని దబ్బున క్రిందపడిన గాయత్రి భయానకంగా అరిచింది. అంత బలహీనంగానున్న ఆమె అంతగా ఎలా అరిచిందో గమనించే స్థితిలో లేడు వంశీ ఏదో షాక్ తగిలినట్టు బిగబడిపోయాడు మెదడు మొద్దుబారిపోయింది. అతడు ఆ స్థితినుంచి తేరుకోవడానికి ఎంతసేపు పట్టిందో తెలియదుగాని, స్మారకానికివచ్చి చూస్తే గిలగిల కొట్టుకుంటూ కనిపించింది గాయత్రి ఇహ ఆలస్యం చేయలేదు. బేతాళుడ్ని భుజాన వేసుకున్న విక్రమార్కునిలా ఆమెను భుజాన వేసుకుని బయలుదేరాడు-హాస్పిటల్‌కి!



* * * *

ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారి బెడ్ పక్కన వున్నాడు డాక్టరు లల్లావారి.

పక్కనే మానిటర్....హార్ట్‌బీట్ బాగానే వుంది. కానీ మనిషి రంగు మారిపోతున్నాడు.

డాక్టరు లల్లావారితోపాటు మరో ఇద్దరు డాక్టర్లున్నారు. తెల్లమొహాలేసుకుని చూస్తున్న ఆ డాక్టర్లని చూడగానే విషయం బోధపడింది. క్రింది పెదవిపై పంటిక్రింద పగిలిపోసాగింది. డాక్టరు లల్లావారి ఆలోచనలని తెగ్గొడ్తూ వంశీ ప్రవేశించాడు— భుజం మీద గాయత్రి.



* * * *

"అద్భుతశక్తులు ఉన్నాయా...." పలవరిస్తున్నట్టుగా ప్రశ్నించాడు వంశీ.

అతడీ ప్రశ్న అడగడం మూడోసారి.

జరిగిందంతా కలా? నిజమా? అన్న సందిగ్ధంలో వున్నాడు వంశీ అది నిజమని నమ్మడానికి మనసు అంగీకరించగడంలేదు కానీ హాస్పిటల్‌లోని గాయత్రిని చూసాక నిజమని నమ్మక తప్పడం లేదు.

వంశీ ముఖంలోకి ఆశగా, ఆదుర్దాగా చూస్తున్న కాలేజీ ప్యూను ఖాదర్ అన్నాడు; "అవును బాబూ, నిజం, అతీంద్రియ శక్తులున్నాయనటం నిజం. కావాలంటే హాజీ సాబ్‌తో తమరే మాట్లాడండి...." అని!

ప్రిన్సిపాల్‌గార్ని- ఆయన కుమార్తెను సైతాన్ ఏడిపిస్తుందని ఖాదర్ నమ్మకం జబ్బార్ అనబడు 'హాజీ సాబ్' ఇచ్చే తావీజ్ ఆ తల్లీకూతుళ్ళని కాపాడుతుందని అతడి నమ్మకం కానీ ఆ హాస్పిటళ్లో- తావీజ్‌లు, విబూదులు అంటే నవ్వుతారని భయం అందుకే తన ప్రయత్నానికి సారథిగా వంశీని ఎంచుకున్నాడు.

అగ్నిహోత్రం వంటి ఆ కుటుంబాన్ని క్షుద్రశక్తులు ఛిన్నాభిన్నం చేయడం చూడలేక కాబోలు ప్రకృతి ఆక్రోశిస్తోంది. ఉరుములు మెరుపులతో తన ఆవేదనని వెళ్ళగక్కుతోంది. భోరుమని ఏడుస్తున్నట్టు నీటిధారలతో నింపుతోంది.

వంశీ ఓ నిర్ణయానికి వచ్చాడు. "ఖాదర్ బయల్దేరు...." అన్నాడు.

ఆ ఒక్క వాక్యంతో ఖాదర్ మొహంలో రకరకాల భావాలు మిశ్రితమై దర్శనమిచ్చాయి. ఆందోళన, ఆశ, ఆత్రుత..ఒకటేమిటి అన్ని రకాల భావాలు కాక్‌టెయిల్ అయి కనిపించాయి. ఎగ్జయిట్‌మెంట్‌తో వణికిపోయాడు.

ఉత్సుకతతో నరాలు తెగిపోతున్నాయా అన్నట్టుంది అతడి పరిస్థితి. వడివడిగా వంశీ మోటార్ సైకిల్ వైపు నడిచాడు.

ఆ వర్షం రాత్రి మోటార్ సైకిల్ దూసుకుపోతోంది.

గాయత్రి ఆ ఇంట్లో వుంటే చతుర్వేదాలవలె ఆ నాలుగు కుక్కపిల్లలు కొంతవరకు రక్షించగలిగేవి.

వంశీ జేబులోని ఆంజనేయుడు ఆమెకు రక్షణ ఇచ్చేవాడు. గాయత్రి పక్కన వంశీ వుంటే చాలు-

ఇవేమీ తెలియని వంశీ ఆమెను ఆ హాస్పిటల్‌లో వదిలి బయలుదేరాడు; సైన్స్‌నేగాని భగవంతుణ్ని విశ్వసించని లల్లాదారికి అప్పగించి బయల్దేరాడు.

-మరో పెద్ద పొరపాటు జరిగింది.

* * * *

ఒంటిమీద గోచీ మినహా మరే ఇతర ఆచ్ఛాదనలేదు.

అభోజనంతో వుండటం వలన ఎముకలు కనబడేటంత సన్నగా వున్నాడు 'జ్ఞాననిధి'.

ఒక పెద్ద ముగ్గు మధ్యలో కూర్చుని వున్నాడు.

అతని ముందున్న సాంబ్రాణి పొగ దట్టంగా అలుముకొంది.



సాంబ్రాణి నిప్పు ఎర్రదనం అతడి మొహంమీద ప్రతిబింబిస్తోంది.

నైవేద్యంగా సమర్పించే మద్యం తాగి, పచ్చి మాంసం తిని బతుకుతున్న అతడి కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

కాలభైరవుడు కూడా విఫలమవడంతో అతడు రెచ్చిపోయాడు.

మనిషి మనుగడను సవాలుచేస్తున్న ఆ సమాధుల మధ్య, చుట్టు విరబోసుకున్నట్టున్న మర్రిచెట్టుక్రింద కూర్చునివున్న 'జ్ఞాననిధి' చేత కాలుడు మరో తంత్రప్రయోగం ప్రారంభింపజేశాడు.

అప్పుడు వినిపించింది సన్నటి కేక-

జ్ఞాననిధితోపాటు కాలుడు కూడా కళ్ళు చికిలించి భగభగమండుతున్న ఆ నిప్పులవైపు చూశారు.

సరిగ్గా అదే సమయంలో-

'హాజీ' జబ్బార్ సాబ్ ఇంటి ముందాగింది వంశీ మోటార్ సైకిల్.

సౌదీ అరేబియాలోవున్న మహమ్మద్ జన్మస్థలం తొలి మసీదు 'మక్కాని'; మహమ్మద్ నిర్యాణం చెందిన 'మదీనా' దర్శించి పవిత్ర యాత్రచేసి వచ్చినవార్ని 'హాజీ' అంటారు.

మక్కాలో దేవతలు ప్రసాదించిన పవిత్రశిల ప్రతిష్ట జరిగింది. ఆ శిలను నుదుటితో తాకి పవిత్రమైన 'హాజీ' జబ్బార్ సాబ్ ఇంటి మెట్లెక్కసాగారు ఖాదర్, వంశీ.

* * * *

ముందుగదిలో నేలమీద కార్పెట్ పరిచి వుంది; గోడవారగా బాలీసులున్నాయి గోడలకు పవిత్ర ఖురాన్ సూక్తులున్నాయి. ఆ గదిలో వీచే గాలికికూడా పవిత్రత నాపాదించుకుంటోంది.

ఖాదర్, వంశీ ఆ గదిలో బాలీసులమీద కూర్చున్నారు. నిత్యం మసీదుకి వెళ్ళే ఖాదర్‌కి ఆ వైబ్రేషన్స్ అందుతున్నాయి.

వారు ఆ గదిలోకి వచ్చిన పావుగంటకి జబ్బర్‌సాబ్ వచ్చారు.

జబ్బర్ సాబ్‌కి 'సలాం'లు చెప్పి, తాము వచ్చిన విషయం వివరించాడు ఖాదర్.

జబ్బర్‌సాబ్ కొద్ది నిమిషాలు కళ్ళు మూసుకుని తనలో తానే మననం చేసుకున్నారు; చేతివ్రేళ్ళతో ఏవో లెక్కలువేసి "రేపు లేదు.... ఎల్లుండి కనిపించండి" అని ఆదేశించారు. "ఖుదాఫీ అస్సలామ్ ఆలేకుమ్...." అంటూ మరోమారు సలాంచెప్పి వెనుదిరిగారు. ఖాదర్‌తో వంశీ కూడా.

ఆ ఎల్లుండి అన్నది 48 గంటల తర్వాత....

ఈ 48 గంటలు ఎలా గడుస్తాయో....



సైతాన్‌ని పారద్రోలడానికి ఓ ఆడపిల్లని రక్షించడానికి 48 గంటలసేపు ఆ భగవంతుని స్మరణలో కూర్చున్నారు హాజీ.

* ★ ★ *

గాయత్రి తమ ఇంట్లోవుంటే పక్కపిల్లలు కొంతవరకు ఆమెను కాపాడేవి; హాస్పిటల్‌లో వుండడంవలన ఇప్పుడు ఆ రక్షణ కూడా లేకపోయింది.

చీకటి చిక్కగా అలుముకుంటోంది.

చీకటిపడితే క్షుద్రశక్తులు విజృంభిస్తాయి.

పడకమీదున్న గాయత్రి జుట్టు చెదిరిపోయి వుంది; కళ్ళు ఎర్రగా వున్నాయి; మొహం పీక్కుపోయి వుంది.

ఆమె చూపులు ఒక విస్ఫోటపు భ్రాంతిని కలిగిస్తున్నాయి.



సరిగ్గా అదే సమయంలో నారాయణాచార్యులుగారి వద్దనున్న ందరమ్మ భర్త మగత నిద్రలోకి జారిపోవడంతో కూతురు దగ్గరికి చ్చింది.

గాయత్రి వున్న గది తలుపులు తెరిచింది సుందరమ్మ.

ఇప్పుడేం జరుగుతుందా అని ప్రకృతి అంతా నిశ్చలంగా స్తోంది. కారు మేఘం తన పయనాన్ని కొద్దిక్షణాలు వాయిదా వేసుంది.

సుందరమ్మ వెన్నులో ప్రారంభమైన జలదరింపు ఒళ్ళంతా ాకింది; ప్రేతకళ గాయత్రి ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది

కళ్ళు మూసుకుని వుంది గాయత్రి. కోమాలో వున్నట్టుంది.

ఎముకల పోగుకి చీర చుట్టినట్టుంది.

దిష్టిబొమ్మలా వుంది.

ఎవరో చేయిపట్టుకుని లేపినట్టు మంచంమీదనుంచీ లేచింది. బలవంతాన తీసుకెడుతున్నట్టు నడుస్తోంది కళ్ళు మూసుకుని!

ఆ నడకని-ఆ వాలకాన్ని సుందరమ్మగారు పసిగట్టేది- కానీ ఆ సమయానికే డాక్టర్ లల్లాచారి వచ్చాడు.

ఎక్కడో గడియారం పది గంటలు కొట్టింది.

"గాయత్రికి నిద్రలో నడిచే అలవాటుందా...." అంటూ "తీసి శెళ్ళి మంచంమీద పడుకోబెట్టు" అన్నాడు.

సుందరమ్మగారి మెదడు పనిచేయడం మానేసింది.

గాయత్రి చేయి పట్టుకుని వెనుకకు తీసుకెళ్ళబోయింది. కానీ గాయత్రి చేయి విదిలించింది. ఆ విదిలింపు ఒక ఝంఝామారుతంలా వుంది. తుఫానులో మర్రిచెట్టు ఊగినట్టు సుందరమ్మగారు ఊగి

పోయింది. తనను తాను నిలదొక్కుకునే ప్రయత్నంలో గాయత్రి మీద పడింది. ఏనుగుమీద కోతిపిల్ల పడినట్లయింది. అంత నీరసంగా వున్నా, గాయత్రి బ్యాలెన్స్ తప్పలేదు- తల్లి తనమీద పడ్డా!

డాక్టర్ లల్లాచారి పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. బాగా విపరీతమైన జ్వరం వచ్చినప్పుడు పేషెంట్స్ ఇలాగే ప్రవర్తిస్తారు దీనినే 'సంధి' అంటారు.

ఇహ ఆలస్యం చేయలేదు డాక్టర్ లల్లాచారి. సిరంజి తీసుకొచ్చి గాయత్రి జబ్బలోకి గుచ్చడం రెప్పపాటు కాలంలో జరిగింది.

సరిగ్గా ఇప్పుడే శ్మశానంలో మర్రిచెట్టుక్రింద తంత్ర ప్రయోగం చేస్తున్న 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్‌కి ఓ సన్నటి కేక వినిపించింది.

అది కేకనుమించిన ఆర్తనాదం. కంట్లో సూది గుచ్చుకుంటే ఎటువంటి ఆర్తనాదం వినిపిస్తుందో, అటువంటి ఆర్తనాదమే వినిపించింది.



పరిస్థితి ఆకళింపు చేసుకున్న కాలుడు తటాలున గుగ్గిలం జ్ఞాననిధి చేతికి అందించాడు. మంత్రాలు చల్లుతూ భగభగమండుతున్న ఆ నిప్పులపై గుగ్గిలాన్ని కుమ్మరించాడు.

అదేమి చిత్రమో- యజ్ఞకుండలం నించి మంటలు లేవలేదు. దట్టమైన పొగలు లేచాయి.

అంటే- రెండవ పర్యాయం భైరవ ప్రయోగం జరిగిందన్న మాట.

భైరవుడు కార్యార్థియై ఎన్నడూ రెండవసారి బయల్దేరడు. బయల్దేరితే పని జరిగి తీరాలి. లేదా ప్రళయమైనా ముంచుకు రావాలి!

ఆ భైరవుడు పొగ రూపంలో హాస్పిటల్ వేపు గగన మార్గాన యలుదేరాడు.



హాస్పిటల్ ఎమర్జెన్సీ వార్డులో వుంది గాయత్రి. ఆమె ముక్కుకి సిజన్ ట్యూబు వుంది. కోడి కూత పెట్టినట్లు గుండె గుర గుర డుతోంది.

గాయత్రి పల్స్ చూస్తున్న డాక్టర్ లల్లాచారి ముఖంలో టెన్షను బడుతోంది.

యిక్కడ పరిస్థితి ఇలా వుంటే గాయత్రిని భగవూజ శ్మశానానికి ప్పించడానికి జ్ఞాననిధి తన ప్రయత్నం చేస్తున్నాడు- గాయత్రిని పాడుకోవటానికి వంశీ, ప్రిన్సిపాల్‌గారి కుటుంబాన్ని క్షుద్ర శక్తుల ంచి కాపాడుకోటానికి ఖాదర్ మానవ ప్రయత్నం చేస్తున్నాడు.

దేవుడు వున్నాడు అని నమ్మినవారు దయ్యాన్ని కూడా నమ్మి రాలి.

ఖాదర్ ఆ భగవంతుడ్ని నమ్ముతాడు కనుకనే సైతాన్‌ని కూడా నమ్ముతున్నాడు.

ఈ హఠాత్పరిణామాలకు ఏదో ఒక దానిని ఆలంబన చేయాలి గనుక ఖాదర్ చెబుతున్న దానిని నమ్మచూద్దాం- అనుకొంటున్నాడు వంశీ.

హాజీసాట్ 48 గంటల గడువు పెట్టడంతో ప్రత్యామ్నాయం కోసం వెదుకుతున్న వారికి బుడబుక్కలవాడు గుర్తొచ్చాడు. ఆ బుడబుక్కలవాడి అచూకీ కోసం వెదకసాగారు.

'దేవుడు-దెయ్యాలు' అన్నవి ఎంత మిస్టరీయో, అంత మిస్టరీగా కన్పించాడు ఆ బుడబుక్కలవాడు.

ఆ యింటి చుట్టూ కోట బురుజులా ఎత్తయిన గోడలు, గోడల వెనుక సుందరమయిన పూల మొక్కలు, ఆ మొక్కల మధ్య చక్కటి రోడ్లు. అక్కడక్కడ నియాన్ లైట్లు, గేటు దగ్గర గూర్ఖా, కారుకి ఓ షెడ్.

ఇదీ ఆ బుడబుక్కలవాని యిల్లు.

యిల్లు కాదది బంగ్లా.

డమరుకం మోగించుకుంటూ, భుజాన ఓ గంట వ్రేలాడేసుకుని, ఒళ్ళంతా బూడిద పూసుకుని వీధులన్నీ తిరిగే బుడబుక్కలవాడు అంత గొప్ప బంగ్లాలో వుంటాడా?

ఎవరో తమని జోక్ చేయటానికి చెప్పలేదు గదా!

-అన్న అనుమానం యిద్దరికి కలిగింది. అయినా ఆశ యిద్దర్నీ నిలేసింది.

ఒకప్పుడయితే వంశీ పరిహాసంగా మాట్లాడేవాడు, చూసేవాడు. కానీ యిప్పుడు గుండెలు బిగపట్టి టెన్షన్‌తో చూస్తున్నాడు, ఆలోచిస్తున్నాడు.

మానవ శక్తిని మించిన అద్భుత శక్తులు ప్రిన్సిపాల్‌గారి కుటుంబాన్ని చిన్నాభిన్నం చేస్తున్నాయని వంశీని నమ్మించడానికి విశ్వ ప్రయత్నము చేస్తున్నాడు ఖాదర్.

కాదనడానికి తన వద్ద ఆధారాలు లేకపోవడంతో నమ్మక తప్పలేదు వంశీకి.

నిద్ర లేకపోవడం వలన, ఏమీ తినకపోవడం వలన నిస్సత్తువ రావలసిందే, కానీ ఆ ఛాయలేవీ కన్పించడం లేదు.

లక్షల విలువ చేసే ఈ బంగ్లాలో ఒక బుడబుక్కలవాడు నివాసము వుండటం నిజమైనప్పుడు, దైవ శక్తుల్ని — క్షుద్రశక్తుల్ని ఎందుకు నమ్మగూడదు?

* * * *

క్షుద్ర దేవతోపాసకులు సాధారణంగా తక్కువ మాట్లాడతారు!

ఒక శక్తిని ప్రయోగిస్తే ఫలితం కన్పించి తీరాలి. లేకుంటే ఆ ఉపాసకుని శక్తి క్షీణిస్తుంది.



—అన్న విషయం జ్ఞాననిధికి తెలుసు. అందుకే పెనంమీద వేసిన గింజలా అల్లలాడసాగేడు.

యిది ఆఖరి ప్రయత్నం. ఈ ప్రయత్నం ఫలించకపోతే విపరీత పరిణామాలు తప్పవు.

జుట్టు విరబోసుకున్నట్లున్న చెట్టు క్రింద- యజ్ఞ కుండలం ముందు- బాసింపెట్లు వేసుకొని కూర్చుని వున్నాడు. అతడు దక్షిణం దిక్కుగా తిరిగి కూర్చుని వున్నాడు. ప్రేతాత్మలు దక్షిణం వేపు నుంచి గమనిస్తూ వుంటాయి.

వర్షంలో తడుస్తున్న సమాధులు, ముళ్ళ పొదలు, మర్రిచెట్టు క్రింద దట్టంగా అలుముకుంటున్న పొగ, పెద్ద ముగ్గు మధ్యలో మొగ్గలా జ్ఞాననిధి!



కాలుడు యజ్ఞకుండం వేపు, దక్షిణం వేపు మార్చి మార్చి చూస్తున్నాడు.

గాయత్రి ఈ రాత్రికి రావడం ఖాయం!

తన జీవిత ధ్యేయం- భగపూజ- వీక్షణం ఖాయం!

రక్తపు గుడ్డులా వున్న అతడి కన్ను ఆనందంతో అదురుతోంది.

* * * *

ఆ గేటుకి ఆవల రోడ్ పక్కనున్న ఫుట్‌పాత్ మీద ఖాదర్ పక్కన జారగిలబడి కూర్చున్న వంశీ మొహంలో రకరకాల భావాలు, ఆందోళన- ఆతృత- ఆశ- వగైరా వగైరా!

ఆ గేటులు తెరుచుకుంటాయా?

ఆ యింటి యజమాని ఒక బుడబుక్కలవాడా?

ఢమరుకం మోగిస్తూ అపరాత్రి వేళ వీధుల వెంట తిరిగే బుడ బుక్కలవాడు కోటీశ్వరుడా?

ఇవేమీ ఆలోచించే స్థితిలో లేడు

అక్కడ కూర్చుని కాలయాపన చేస్తున్నానా? అన్న ఆలోచన కూడా రాలేదు.

ఒక రహస్యాన్ని ఛేదించబోతున్నానన్న ఉద్వేగంతో కూర్చుని వున్నాడు.

నరాలు తెగిపోతాయా అన్నంత ఉత్సుకత అతడిలో చోటు చేసుకుంది.

* * * *

కళ్ళు పెద్దవి చేసి చూస్తున్నాడు కాలుడు—

సమయం ఆసన్నమైంది.

ఈ ఉపాసనా కార్యక్రమంలో ఏ తేడా వచ్చినా ముందుగా మసి అయిపోయేది ఉపాసకుడే!

ఆ స్మశానంలో జరగబోయే దారుణాన్ని ఊహించలేక కాబోలు ప్రకృతి భోరున విలపిస్తోంది ఎక్కడో గుడ్లగూబ వికృతంగా అరుస్తోంది. టిటువపిట్ట కర్ణ కఠోరంగా విలపిస్తోంది. సమయం గడుస్తున్న కొద్దీ జ్ఞాననిధి ఆవేశంతో ఊగిపోతున్నాడు. పెదవులు మరింత వేగంగా కదుల్తున్నాయి.

సరిగ్గా అదే సమయంలో—

హాస్పిటల్ దాదాపుగా నిద్రావస్థలో జోగుతున్న దశలో-

గాయత్రిని ఎవరో పేరు పెట్టి పిలిచినట్లుంది. ఎక్కడో అగాధం నుంచి ఆ స్వరం పెల్లుబుకుతున్నట్లుంది. ఆ పిలుపులో స్పష్టత వుంది- ఆదేశం వుంది.



మరు నిమిషం సెలైన్ ట్యూబు ఊడిపోయింది. ఏదో ఉన్మాదం ఆవరించినట్టు మంచం మీద లేచి కూర్చుంది. స్మశానంలో- సమాధిలో నుంచి శవం లేచినట్లు మంచం మీదున్న గాయత్రి లేచింది. ఎవరో చేయి పట్టుకుని నడిపిస్తున్నట్లు నడవసాగింది.

సరిగ్గా అదే సమయంలో—

ఆ బంగ్లా వెనుకవైపున వున్న చిన్న గేటు కిర్రుమంటూ తెరుచుకుంది.

ఆ ఇంటి యజమాని ప్రపంచం దృష్టిలో ఒక కోటీశ్వరుడు.

పిశాచాలు తిరిగే సమయంలో రోడ్డు మీద కొచ్చిన అతడ్ని నిశ్చేష్టుడై చూస్తుండిపోయాడు వంశీ.

ఖాదర్, వంశీ చూసింది బుడబుక్కలవాణ్ని.



'శరీరేణ జితాస్సర్వే శరీరం యోగిభర్జితం'

శరీరం చేత అందరూ జయింపబడతారు, కాని శరీరం యోగి చేత జయింపబడుతుందని ఉపనిషత్తుల ఉవాచ!

ఖచ్చితమయిన దారిలో యోగాభ్యాసం అలవాటు చేసుకుని, యమ నియమాలనూ, అసన, ప్రాణాయామ, ప్రత్యాహారాలనూ, ధ్యాన, ధారణ సమాధులనూ పొందగలిగితే శరీరం స్వాధీనమవుతుంది

యోగ శాస్త్రానికి సంబంధించి మొత్తం ఇరవై రెండు ఉపనిషత్తులున్నాయి. వాటి పరమావధి....సమాధి స్థితిని పొందడమే!

యోగశాస్త్రోపనిషత్తుల లక్ష్యం సమాధిస్థితిని పొందడం ఎలాగో నని బోధించటమే!

అతడు యోగశాస్త్రం వలన కాయ కల్పం పొందాడు.

యమ నియమాలతో- అసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణతో సమాధి స్థితి పొందినవారు మన మధ్యా వున్నారు. ప్యాంటు షర్టు ధరించి మామూలు మనుషుల వలె మన మధ్యా మసలుతుంటారు. వార్ని గుర్తించడం కష్టం.

ఆ బుడబుక్కలవాడు అటువంటి మహనీయుడు.

నిజ జీవితంలో అతడొక పెద్ద ఆఫీసరు. అతడి ఇంటి గేటు దగ్గర గూర్ఖా.... షెడ్‌లో కార్లు....

ఆ బుడబుక్కల వాని కళ్ళలోకి సూటిగా చూశాడు వంశీ మిల మిలలాడే ఆ కళ్ళలోంచి కిరణాల్లా దూసుకువస్తున్న చూపుల ధాటికి తట్టుకోలేకపోయాడు.

ఖాదర్, వంశీలను పరీక్షగా చూసిన ఆ బుడబుక్కలవాడు దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పు పాము బుసలా వుంది.



* * * *

జ్ఞాననిధి-

సరయిన తిండి నిద్రలేక శుష్కించిపోయి వున్నాడు. ఆ రోజున మరింత భయంకరంగా వున్నాడు. కళ్ళు మరింత ఎర్రబడ్డాయి; మొహం మరింత కర్కశంగా మారింది. క్షుద్రదేవతోపాసన అతడ్ని పీల్చే స్తోంది.

యజ్ఞకుండలంలోకి కళ్ళ పెద్దవి చేసి చూస్తున్న జ్ఞాననిధి పెద వులపై నవ్వు వెలసింది. అది బిగ్గరగా మారింది- అలలు అలలుగా స్మశానం అంతా అవరించింది.

* * * *

ఎత్తయిన చెట్లు- ఆకాశాన్ని ఆలింగనం చేసుకుంటున్నట్లు, మబ్బు తునకల్ని ముద్దాడుతున్నట్లు!



ఆ చెట్ల మధ్యగా బాట- బతుకు అర్థాల్ని వివరించే కాలిబాట!

గాయత్రి కన్నీటితో నాని నిగనిగలాడుతున్నాయి. కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి.

ఆమె ముందు ఒక వ్యక్తి వున్నాడు- నిండయిన విగ్రహం, ఆరడుగుల ఎత్తులో బొద్దుగా వెడల్పయిన ముఖం, కాటుక దిద్దినట్టు కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి. పొడవుగా సాగిన నాలుక. అతడి చూపులతో హిప్నొటిక్ ఫోర్స్ వుంది. అతని తలపై ఆచ్ఛాదనగా మేఘమాల వుంది.

మగవారిలో కనిపించే అరుదైన సౌందర్యం అతడిది. అంత సౌకుమార్యం అరుదుగా కనిపిస్తుంది. ఆ మాటల తీరు, ఆ మధురమైన కంఠస్వరం ఎవరూ ఎన్నడూ విని వుండరు. ఇప్పుడు గాయత్రి వింటోంది.

అతడు భైరవుడు! నేకెడ్ ఐకి కనిపించని సూపర్ నేచురల్ పవర్.

అతడు గాయత్రిని శాసిస్తున్నాడు. గాయత్రి పథాన్ని నిర్దేశిస్తు న్నాడు. 'జ్ఞాననిధి' వున్న శ్మశానం వైపు ఆమెను తీసుకెళ్తున్నాడు.

* * * *

వంశీ, ఖాదర్ వేపు సాలోచనగా చూసి మాట మాత్రమయినా మాట్లాడకుండా ముందుకు కదిలాడు బుడబుక్కలవాడు. అతడి చూపు లకి లిపి లేని భాష వుంది. ఆ భావాన్ని అర్థంచేసుకున్న వారిరువురూ అతడ్ని అనుసరించారు.

ఖాదర్, వంశీ అతడితో మాట్లాడటమే కాదు, తమలో తాము మాట్లాడ సాహసించలేకపోయారు. మౌనంగా అతడ్ని అనుసరించ సాగారు.

వంశీ ఖాదర్ వేపు చూస్తే ఏం జరిగేదోగాని, నిద్రలో నడుస్తున్న వాడిలా బుడబుక్కల వాని అడుగుజాడల్లో నడుస్తున్నాడు- జెర్రిలా పొడవుగా చాపకొని వున్న బాటలో!

ఖాదర్ శరీరం మీద బట్టలన్నీ తడిసిపోయాయి. రవంత వణుకుతున్నట్టుగా కూడా వుంది. నుదురు మీద చెమట చుక్కలు బంగారం మీద తాపిన ముత్యాల్లా మెరుస్తున్నాయి. చేతులు వణుకుతున్నాయి.

అప్పుడు జరిగిందిది.

దట్టంగా అలముకున్న చెట్ల పొదల మధ్య నుంచి వచ్చాడతడు. మెడలో తులసి పూసలు, రుద్రాక్షలూ ధరించి మొలకు ఒక చింకి పాత చుట్టుకుని వున్నాడు. పెరిగిన గడ్డం, మర్రిపాలు లేపనం జేసి జడలు కట్టించిన కేశపాశాలు, పాదరక్షలు లేవు. ఎత్తయిన నుదురు, మొనతేలిన ముక్కు, తాత్త్విక లోకాలకు చొచ్చుకుపోతున్నట్టు కొనతేలిన గడ్డము, ఉజ్జ్వలంగా, తరళాయితంగా వున్న నేత్రాలూ! దృఢమయి అనాచ్ఛాదితమయిన పాదాలకు ఎగువ భాగాన ఉక్కుముక్కల్లా నిగనిగలాడుతున్న పిక్కలు. బల్లెం దింపినా దిగనట్టున్న పొట్ట! కళ్ళు విశాలంగా వున్నాయి దయను వర్షిస్తున్నాయి. గాలిలో తేలుతున్నట్లు అడుగులు పడుతున్నాయి.

ఆయనను చూస్తూనే బుడబుక్కలవాడు ఆయన పాదాల మీద పడిపోయాడు.

ఖాదర్, వంశీ గుండెలు బిగపట్టి టెన్షన్‌తో చూస్తున్నారు.

ఖాదర్ పెదవులు అస్పష్టంగా, నెమ్మదిగా కదుల్తున్నాయి. మంత్రాల్ని ఉచ్చరిస్తున్నాయి.

ఆ బుడబుక్కలవాని గురు పరంపరలో ఏడవ వాడాయన. దాదాపుగా వెయ్యేళ్ళ క్రితం సమాధి స్థితిలోకెళ్ళిన ఆయన హఠాత్తుగా లేచి వచ్చాడు.



చుట్టూ వున్న చెట్టుకొమ్మల్ని రాసుకుంటూ ఎవరో వస్తున్న చప్పుడు, నేలపై నున్న కొమ్మలు విరుగుతున్న శబ్దం....

అదృశ్య శక్తులు సమావేశమవుతున్న సూచన!

ఆ సద్గురువు కళ్ళతోనే తన శిష్యుడ్ని ఆశీర్వదించాడు. అదృశ్యంగానున్న పరివారాన్ని వెంట బెట్టుకుని ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు!

గురుసాక్షాత్కారం, ఆశీర్వచనం!

వంద ఏనుగుల బలంతో కదిలాడు బుడబుక్కలవాడు.

* * * *

శ్మశానంలో....



ఆకాశాన్నుంచి సన్నగా నీరు ధార పడుతున్నా, ఓ పెద్ద చెట్టు క్రింద పేర్చిన చితి చిటపటలాడుతోంది. పూల పట్టిలా నిప్పులు వెదజల్లుతోంది. శవం కాల్చేటప్పుడు పైకి లేవకుండా కర్రలతో నొక్కిపెడతాడు కాపరి.

అయినవారంతా శవాన్ని కాటికాపరి పాల్జేసి తమ పనయిపోయిందనుకొని తిరిగి పోయినట్లున్నారు- అనాథ శవమయిందది.

ఆ వర్షంలో ఆ శవాన్ని, దాని తాలూకు జీవుని పాపపుణ్యాలకు వదిలేసి కాటికాపరి కూడా పీక వరకూ చుక్కేసుకుని చక్కని చుక్కని వెదుక్కుంటూ పోయినట్లున్నాడు.

చైతన్యం పోతే శవం;

చైతన్యం వుంటే శివుడు!

శవం శివుడయ్యే చోటు అది!

తన ప్రియ భక్తుడ్ని విడిచిపోలేక ఆ ప్రియభక్తుడ్ని బూడిదచేసి తన శరీరమంతటా పులుముకుంటాడు. శివుడు, బూడిద కాకుండా మిగిలిపోయిన ఎముకల్ని, పుర్రెలను ఆభరణాలుగా ధరిస్తాడు శివుడు!

శివునికి తన భక్తులంటే అంత ప్రీతి!

కానీ, ఆ శవంమీద పోటీగా పెట్టిన కర్రలు జారిపోవడంతో ఆ శవం లేచి నిలబడింది. దివిటీలా కాలుతోంది!

లేచి నిలబడి కాలుతున్న శవం ఒక పక్కగా గాయత్రి రానున్నది మరో ప్రక్కగా బుడబుక్కలవాని వెనుక ఖాదర్, వంశీ రానున్నారు.

* * *

"చిన్నా....చిన్నా...." ఎవరో పిలుస్తున్నారు.

మధురమయిన కంఠస్వరం అది.



"ఇలా... యిటు వైపు... ఇటే" మళ్ళీ వినిపిస్తోంది ఆ స్వరం.

పిలిచేవారు స్పష్టంగా కన్పించడంలేదు. ఏ వైపునుంచి పిలుస్తున్నారో అర్థం కావటంలేదు. ఇటు తిరిగితే అటువేపునుంచి స్వరం వినిపిస్తోంది-అటు తిరిగితే ఇటువేపునుంచి వినిపిస్తోంది. చిత్రమేమిటంటే-ఆ పిలిచేవ్యక్తి "గాయత్రీ" అని పేరుపెట్టి పిలవడంలేదు. పెట్‌నేమ్‌తో పిలుస్తున్నాడు.

"గాయత్రీ...." అన్న నామ ఉచ్చారణ జరిగితే ఏమయ్యేదో!

ఆ పిలుపు ఎటు పు వినిపిస్తే అటువేపు వడివడిగా అడుగులేస్తోంది. ఆ పిలుపులో లాలిత్యం వుంది, లాలింపువుంది, ఆజ్ఞ వుంది.

అడుగులసంఖ్య పెరుగుతున్నకొద్దీ ఆ పిలుపు దగ్గరవసాగింది. అందుబాటులోకి రాసాగింది. పొగ మనిషి నేలమీదకు దిగాడు. జాగ్రత్తగా గమనిస్తే అర్థమయ్యేదే-ఆ పొగమనిషి పాదాలు నేలమీద లేవని!



అతడు గాయత్రి కళ్ళలోకి చూస్తున్నాడు....సూటిగా!

ఆమె చూపు మరల్చుకోలేక పోతోంది.

అతడిది నిండయిన విగ్రహం.

సాగిన కళ్ళు-బొద్దుగా, వెడల్పయిన ముఖం.

అతడి మాటేకాదు, చూపుకూడా హిప్నటైజ్ చేస్తున్నట్లుంది.

అతడి ఆజ్ఞ మేరకు నడుస్తోందామె-

కామరూపమనేది కథలలో కనిపించే ఫాంటసీ-మాత్రమే కాదు, అది యథార్థంకూడా—అని నిరూపింప బడుతోంది.

అతడు భైరవుడు.

అతడు 'గాయత్రీ' నామస్మరణ చేయలేడు. గాయత్రి పేరు వినిపిస్తే చాలు అతడి శక్తి క్షీణిస్తుంది.

అపరాత్రి-అందునా భీకర వర్షం!

భైరవునికి రాత్రివేళ శక్తి పెరుగుతుంది.

మిలమిలలాడే ఆ కళ్ళలోంచి కిరణాల్లా దూసుకు వస్తున్న చూపుల ధాటికి తట్టుకోవడం కష్టం.

వీణమీద వేదాలు పలికినట్టు మధురమయిన స్వరంతో తనని ఆజ్ఞాపిస్తుంటే తట్టుకోలేక పోతోంది- మగవాడయినా అద్భుత సౌందర్యరాశిలా వున్నాడు. రెల్లు పువ్వులా పగలబడిపోతున్నట్లున్నాడు. వెన్నెల రాశిపోసినట్లున్నాడు!

"చిన్నా....చిన్నా...." అని నవ్వుతున్నాడు.

వెన్నకన్నా తెల్లగా, మీగడకన్నా మధురంగా, మంచుకన్నా చల్లగా, తేనెకన్నా తియ్యగా-ఈ సృష్టి రహస్యాన్ని ఛేదించే రహస్యాల కుంపటిలా నవ్వుతున్నాడు.

ఆ రూపాన్ని చూస్తున్నకొద్దీ ఉద్వేగం వెన్ను చరిచినట్లుంది. శరీరమంతా ఉద్వేగాన్ని పొందుతున్నట్లుంది.

కళ్ళముందు మెరుపులు మెరిసినట్లు ఉల్కలు రాలిపడినట్లు వుంది. అది పిచ్చో, ప్రేమో, వ్యామోహమో, కామమో తెలియనిస్థితి.

కొన్ని అవయవాలు బరువుగా తయారై మొత్తం శరీరమంతా తిమ్మిర్లెక్కడం ప్రారంభమయింది.

కళ్ళు కోరికతో ఎర్రగా చెర్రీ పళ్ళలా తయారయ్యాయి. శ్వాస బరువుగా వదలడంవలన ఛాతీ ఎగిరెగిరి పడుతోంది. అతని యవ్వన సిరులు ఆమె మనసులో తుఫానును రేపుతున్నాయి. ఆ గుండని తనం మనసును ముద్దలాచేసి ఎక్కడో కోర్కెల సుడిగుండంలో గిరవాటేస్తోంది. శరీరాన్ని సుతి మెత్తగా కోస్తోంది.

ఆమె మెదడు పనిచేయడం మానేసింది. ఏం జరగబోతోందో గ్రహించే స్థితిలో లేదు.

పరిసరాల్ని గమనించే స్థితిలోనూ లేదు.

శ్మశానంలో-

హోమగుండం ముందున్న 'జ్ఞాననిధి' పెదవి విడీవిడకుండా నవ్వాడు.

అతడికి కావలసిందదే!

గాయత్రి స్మశానానికి కొనిరాబడుతోంది. ఆమె మనసు వశమయింది. భగభగ మండుతున్న నిప్పుల్లో ఆమె రూపాన్ని చూస్తున్నాడతడు. ఆమెలోని ఏదో తెలియని ఆకర్షణకు మంత్ర ముగ్ధుడై కళ్ళు అర్పాలన్న సంగతి కూడా మరిచిపోయాడు, ఏ స్త్రీని చూసినా కలగని ఆదోలాంటి రస స్పందన అతనిలో మొదటిసారిగా కలిగింది. కొత్త అలజడికి లోనయ్యాడు.





ఆమె స్మశానానికి చేరుతూనే తలారా స్నానం చేయించాలి. వివస్త్రను చేయాలి. రక్తప్రసాదం అందించాలి. ఆ తర్వాత భగపూజ-

ఈ ఆలోచన వచ్చిందే తడవు కనుపాపల్లో శృంగారాన్నంతా కూడినట్టు మత్తుగా, డ్రీమీగా మారాయి.

నిప్పుల్లో కనిపిస్తున్న గాయత్రి రూపం-ఆ ఎత్తు గుండెలు గుండ్రంగా అతడిలో తుఫాను రేపుతున్నాయి.

లోనెక్ జాకెట్‌లోంచి బయటకు దుమకడానికి అవి చేస్తున్న ప్రయత్నం జాకెట్ వంపు దగ్గర అద్భుతంగా కనిపిస్తోంది. కలర్డు 'బ్రా' అమృత భాండాలను పెట్టుకోవడానికి అల్లిన చిక్కంలా వుంది.

రెట్టింపు ఉత్సాహంతో విశేషమైన ప్రక్రియ.

చేస్తూ ప్రతిసారీ ఆహుతిలో 'హాంఫట్' అంటున్నాడు. గుప్పెట గట్టిగా అగ్నిలోకి ఆహుతులు కసికొద్దీ విసురుతున్నాడు. పళ్ళు పటపట లాడిస్తూ దవడ కండరాలు బిగపట్టి మంత్రోచ్చారణ చేస్తున్నాడు.

జ్ఞాననిధికి మంత్రోపదేశం చేసిన గురువు సామాన్యుడు కాదు. ఖడ్గమాల సిద్ధిపొందినవాడు- కుండలినిని జాగృతపరచి జిహ్వాద్వారా కపాలాన్ని స్పృశించి 'అమృతీకరణక్రియ' సాధించినవాడు-కాయద, గణశ్రేష్ఠ సాధనలను శ్మశాన జాగరణ, భూతసిద్ధి, కపాలవిక్రియ, శూలిసీసిద్ధి లాంటి కఠోర సాధనలలో విజయం పొందినవాడు.

అతడొక 'యతి'.

అతడొక 'పరమహంస'

ఆ భూమిపై సంపాదించుకున్న విద్యలను ఈ భూమిపైనే వదిలి పునర్జన్మ లేకుండా సిద్ధిపొందాలన్న సంకల్పంతో తాను నేర్చుకున్న విద్యలన్నిటినీ సుకుమార్‌కి ధారపోసి అతడ్ని 'జ్ఞాననిధి'గా ఆవిష్కరించాడు.

బడబానలం జీర్ణంచేసుకున్న ఆ మహాయోగి అపాత్రదానం చేస్తున్నానని గ్రహించలేక పోయాడు. అదే ఆయన చేసిన పొరపాటు. ఆయన చేసిన పొరపాటుకి ఆయన గురు పరంపర శిక్షను అనుభవించ బోతున్నారు.

గాయత్రి యజ్ఞకుండం చేరిన తర్వాత భగపూజ చేయాలి.

ఆమె రక్తాన్ని తర్పణం చేయాలి.

ఆమె శవంతో సంభోగించడమేకాక, ఆమె మాంసంతో ఆకలి శాంతి జరిపించాలి.

అఘోరలు కోరుకునేది అందమైన, ఆరోగ్యమైన శరీరాలను కాదు, పవిత్రమైన కుటుంబంలో జన్మించిన వారి శరీరాలను!

అగ్నిహోత్రంవంటి కుటుంబంలో జన్మించింది గాయత్రి.

ఆమె తండ్రి వేద పండితుడు. నిత్యం గాయత్రి చేస్తాడు-ఆమె కూడా చేస్తుంది.

ఆమె గొప్ప అందగత్తె, విజ్ఞురాలు. అందుకే ఆమెపట్ల అతడికి అంత మక్కువ!

గాయత్రి స్మశానంవేపు వేగంగా వస్తోంది.

ఆమెను హిప్నొటైజ్ చేసినట్టు తీసుకొస్తున్నాడు భైరవుడు.

* * * *

వెక్కుబెట్టి విడిచిన బాణంలా దూసుకుపోతున్నాడు ఆ బుడబుక్కలవాడు.

వాడి భుజాన వేలాడుతున్న గంట మోకాలి దిగువ భాగాన తాకుతోంది. అడుగుతీసి అడుగేసినప్పుడల్లా వింత శబ్దం చేస్తోంది!

అతడేమీ గమనించడంలేదు. దీక్షగా చూస్తున్నాడు. పాము కాటు



వేయబోయే ముందు అలాగే చూస్తుంది. పులి ఛార్జ్ చేయబోయే ముందు కూడా అలాగే చూస్తుంది.

అయితే అతడికి ఈ బాహ్యప్రపంచం స్పష్టంగా కనిపించడం లేదు. అతడు చూస్తున్నది వేరే ప్రపంచాన్ని! జరుగబోతున్న దారుణాన్ని!!



తిరుమణి-తిరుమార్గాలతో శరీరంమీద పండ్రెండుచోట్ల ఊర్ధ్వ పుండ్రాలు~ ద్వాదశోర్ధ్వ పుండ్రాలు ధరించడం వైష్ణవులకు ఎంత ముఖ్యమో, విభూది పులుముకొని, ఢమరకం ధరించడం ఈ బుడబుక్కల వానికి అంత ముఖ్యం అప్పుడుగానీ అతడిలో 'శక్తి' జనించదు, 'వాణి' పలుకదు.

అందుకే అంత వేగంగా నడుస్తున్నాడు.

అతడి వెనుక ఖాదర్, వంశీ

ఆ వర్షంలో అతడెక్కడికి తీసుకెళుతున్నాడో వారికి తెలియదు. తెలుసుకోవాలన్న ధ్యాసకూడా లేదు.

ఆ సమయంలో అతడే తమకి గురువు, గైడ్.

* * * *

దక్షిణం దిక్కునుంచి గాలి సుడులు తిరుగుతూ తీరాన్ని తాకుతోంది. ఆ గాలి తీవ్రత ఎంతగా వుందంటే-నిల్చున్న మనిషిని పడదోస్తున్నంత వేగంగా వుంది ఆకాశంలో మేఘాలు సుడులు తిరుగుతున్నాయి. ఎక్కడో సముద్రంలో ఏర్పడిన వాయుగుండం ఇక్కడ తన ప్రతాపాన్ని చూపుతోంది.

ఆకాశాన మెరుపుల ఫెళఫెళార్భాటాలు చూస్తుంటే భూమి రెండుగా బద్దలవుతుందా అనిపిస్తోంది.

ఈ చల్లని బీభత్స వాతావరణంలో కూడా డాక్టర్ లల్లాచారి నుదుట చెమట చోటుచేసుకుంది.

ఆయన ఆందోళనకి కారణం-ప్రిన్సిపాల్ నారాయణాచార్యులు గారి ఆరోగ్య పరిస్థితి.

పల్స్ చూస్తే నార్మల్‌గా వుంది కానీ పక్షవాతంవల్ల పక్కకు తోసుకుపోయిన నోరు నీలంగా మారిపోయింది. చేతిగోళ్ళు కూడా నీలంగా మారాయి. శరీరంలో ఒకపక్క అంతా చల్లబడినట్లుంది.

గుండె నార్మల్‌గా కొట్టుకుంటోంది.

డాక్టర్ లల్లాచారి చూస్తుండగానే ప్రిన్సిపాల్ నారాయణాచార్యుల గారి శరీరం నిప్పులమీద కాల్చిన అప్పడంలా వంకర్లు తిరగడం కనిపిస్తోంది. అంతకుమించి తల అటూ ఇటూ విదిలిస్తూ భయానకంగా కళ్ళు విశాలం చేశారు.

ఈ హఠాత్పరిణామంతో సుందరమ్మగారు బెంబేలు చెందింది. భోరున ఏడ్వడం ప్రారంభించింది.

హాస్పిటల్ స్టాఫ్ సహాయంతో కాళ్ళూ చేతులూ నొక్కిపెట్టి శరీరం కదలకుండా వుంచిన డాక్టర్ లల్లాచారి నారాయణాచార్యులుగారి నోరు బలవంతంగా తెరిచి జేబులోని కలాన్ని పళ్ళమధ్య కుక్కారు. ఆయన నాలుక పళ్ళమధ్యపడి ఎక్కడ తెగిపోతుందోనని!

ఆ ప్రయత్నం సఫలం కాలేదు. కలం రెండు ముక్కలవడంతో పక్కనే వున్న స్కైల్ పళ్ళమధ్య పెట్టారు.

ఆ హడావుడిలో కూడా ఆలోచనా జ్ఞానాన్ని కోల్పోలేదాయన. ఇంజక్షన్ చేశారు.

ఇంజక్షన్ ప్రభావం రెండే రెండు నిమిషాల తర్వాత కనిపించడము ప్రారంభించింది.





నారాయణాచార్యులవారి కళ్ళు నిద్రలో సోలిపోసాగాయి. తల, శరీరం కదలడం మానేసింది. ఉచ్ఛ్వాస, నిశ్వాసలు తెలుస్తున్నాయి.

పేషెంట్ నిద్రలోకి జారుకోవడంతో స్టాఫ్ గుండెలనిండా గాలి పీల్చుకున్నారు.

ఎందుకిలా జరిగింది?

—ఆ డాక్టర్ పరిపరి విధాల ఆలోచించసాగాడు.

"నాయనో! మా కొంపకి ఏదో చెడుగాలి సోకిందిరో నాయనో! ఆ ఔదంబర వృక్షం ఏ ముహూర్తాన కొట్టించామో, ఆరోజునుంచి మాకు చెడ్డరోజులు దాపురించాయిరో దేవుడా...." అని ఆమె దీర్ఘం తీస్తోంది.

అంత గజిబిజి ఆలోచనల్లోనూ డాక్టర్ లల్లాచారి ఒక్కసారిగా మాన్పడిపోయారు.

'యస్....బావ అనారోగ్యానికి కారణమేమిటి? అక్క అంటున్నట్టు అతీంద్రియ శక్తులున్నాయా?'

....కొత్త ఆలోచనల పురుగు మెదడుని తొలవడం ప్రారంభించింది.

నేర్చుకున్న మెడిసిన్ 'ట్రాష్' అని కొట్టిపారేస్తోంది. కానీ పుట్టి పెరిగిన వాతావరణం, తరతరాలుగా నరనరాన జీర్ణించుకున్న సెంటిమెంట్స్ 'నిజమేనేమో' అనిపిస్తున్నాయి.

అప్పుడు గుర్తువచ్చింది గాయత్రి.

ఇహ ఆలస్యం చేయలేదు ఒక్క ఉదుటున లేచి గాయత్రి వున్న వార్డ్‌వేపు దాదాపుగా పరుగెత్తినట్టే నడిచాడు.

బెడ్ ఖాళీగా వుంది

"గాయత్రీ...." అప్రయత్నంగా పెనుకేక పెట్టాడు డాక్టర్ లల్లాచారి.

ఆ బీభత్స వాతావరణంలో కూడా ఆ పెనుకేక ఫెళ్ళున విరిగిన చెట్టులా పేషెంట్స్‌ని ఉలిక్కిపడేలా చేసింది.

"గాయత్రీ....గాయత్రీ" అంటూ హాస్పిటల్ కాంపౌండ్‌లో వెదక సాగాడు.

వర్షం ధారకడుతోంది.

ఆకాశాన్నుంచి తెల్లదారాల్ని వ్రేలాడదీస్తున్నట్టు-వర్షపు ధారలు.

తాను తడిసిపోతానన్న స్పృహలేదు డాక్టర్ లల్లాచారికి.

కళ్ళు మిరుమిట్లు గొలిపే మెరుపు ఆకాశంలో చెవులు చిల్లులు పడేలా ఉరుములు!

అయినా దేనినీ ఖాతరుచేసే స్థితిలో లేరు.

"గాయత్రీ... గాయత్రీ" అని గొంతు పగిలేలా అరుస్తూ వీధిన పడ్డాడు.

ఆ అరుపుల మధ్య రవంత ఆలోచన-గాయత్రి ఇంటికి వెళ్ళిందేమోనని!

అంతే-ఇంటివేపు పరుగుదీశాడు గుండె గోలపెడుతున్నా!

పరుగెత్తుతూనే ఆలోచిస్తున్నాడు.

ఔదంబర వృక్షం-కుక్కపిల్ల-అమావాస్య-రాహుకాలం.

ప్రిన్సిపాల్‌గారి ఇంటి ఆవరణలోకి అడుగుపెట్టిన డాక్టర్ లల్లాచారి అప్రయత్నంగా ఆగిపోయాడు. అస్పష్టమైన అరుపులు కర్ణపుటాలను తాకుతున్నాయి. ఏదో అనుమానం కడుపు ప్రేగుల్ని కదిలిస్తోంది.

గాలిలో సన్నగా వచ్చిన అరుపులకి కళ్ళు చికిలించి చూశాడు.

వర్షానికి తడుస్తున్నాయి కుక్కపిల్లలు-హృదయ విదారకంగా



వినిపిస్తున్నాయి. కానీ గాలి, వాన పెడుతున్న ఈలలలో ఆ కుక్కపిల్లల అరుపులు వినిపించడంలేదు.

మరునిమిషంలో ఆ కుక్కపిల్ల ముందాగాడు డాక్టర్ లల్లాచారి.

పరుగెత్తుకు రావడంవలన నోరుతెరిచి గాలి పీలుస్తున్నాడు.

ఆయాసం తగ్గటానికి క్షణకాలం ఆగి ఆ కుక్కల మెడలకున్న గొలుసుల్ని తొలగించాడు.

చిత్రం- ఆ కుక్కపిల్లలు లోపలికి పరిగెత్తలేదు. బయటకు వీధిలోకి- వానలోకి దౌడుతీసాయి.

ఆ చలిలో గిజగిజలాడుతూ ఏడుస్తున్నట్టు మొరిగిన కుక్కపిల్లలు వానలోకి పరుగెత్తడం చూసి ముందు బిత్తరపోయాడు. ఆ తర్వాత వాటిని అనుసరించాడు.

ఊరుకి దక్షిణాన వున్న మహాప్రస్థానంవైపు అవి పరుగెడుతున్నాయని అతడికి తెలియదు. గుడ్డిగా వాటినే అనుసరిస్తున్నాడు.

సరిగ్గా అదే సమయంలో-

తెల్లటి నీటిధారల కాంతికి రాత్రి తెళ్ళున తెలవారిన భ్రాంతి కలిగిస్తోంది.

సమాధులు వర్షం నీటితో అభిషేకింపబడుతున్నాయి.

చైతన్యం వుంటే శివుడు, చైతన్యం ఆగిపోతే శవం.

శివుడికి, శవానికి వున్న తేడా అదే.

బుడబుక్కలవాడు నెమ్మదిగా ముందుకు కదులుతున్నాడు.

అతడి పెదవులు నెమ్మదిగా అస్పష్టంగా కదులుతూ మంత్రాల్ని ఉచ్ఛరిస్తున్నాయి.

హఠాత్తుగా మంత్రోచ్చారణ చేస్తున్న ఆ బుడబుక్కలవాని పెదవులపై చిరునవ్వు తొంగిచూసింది.

ఆ చిరునవ్వు కుక్కపిల్లల ఆగమనానికి సూచన- అహ్వానం కూడా!

బుడబుక్కలవాడు ఒక కోణంనుంచి భవిష్యత్తుని చూస్తుంటే, 'జ్ఞాననిధి' మరో కోణంనుంచి చూస్తున్నాడు.

బుడబుక్కలవానికి కుక్కపిల్లలు కనిపిస్తే, జ్ఞాననిధికి గాయత్రి కనిపిస్తోంది వర్షంలో తడిసిన దుస్తులు ఆమె శరీరానికి అతుక్కుపోయి బహిర్గతం చేస్తున్న ఎత్తుపల్లాలు కనిపిస్తున్నాయి

ఇద్దరి కళ్ళలోను మాగ్నెటిక్ పవరుంది.



గురు పరంపరనుంచి సంక్రమించిన శక్తుల్ని లోక కళ్యాణానికి వినియోగిస్తున్నది ఒకరయితే, ఆ శక్తులను వినియోగించుకుని అడ్డదారిన ఎదగాలని ప్రయత్నిస్తున్న 'అఘోర' మరొకరు!

భగపూజ వలన సంక్రమించే మహా శక్తిపాతాన్ని జుర్రుకోవడానికి సిద్ధంగా వున్నాడు కాలుడు.

జ్ఞాననిధి యజ్ఞకుండంవేపు యెక్కుపెట్టి విడిచిన బాణంలాదూసుకొస్తోంది గాయత్రి.

ఆమెను కాపాడడానికి బుడబుక్కలవాడు, అతడివెనుక ఖాదర్-వంశీ తీరానికి బయల్దేరారు.

మరో దిశలో నాలుగు కుక్కపిల్లలు ముందుకు దారితీస్తుంటే, వాడివెనుక డాక్టర్ లల్లాచారి.

* * * *



హాస్పిటల్ గడియారం ఎన్ని గంటలు కొట్టిందో గమనించే స్థితిలో లేదు సుందరమ్మ.

నారాయణాచార్యులుగారి ముక్కుకి ఆక్సిజన్ ట్యూబు అమర్చి వుంది– ఊపిరితిత్తుల్లో గురక- పల్స్ పడిపోతోంది– బి.పి.కూడా బాగా వేరియేషన్ చూపుతోంది- డ్రిప్ ఎక్కువచేస్తే పల్స్ రేటు నార్మల్ అవుతోంది.

డ్యూటీ డాక్టరు జేమ్స్ టెన్స్ ఫీలవుతున్నాడు. ఫస్ట్ పోస్టింగ్ యిది.

పేషెంటు ఒక కాలేజీ ప్రిన్సిపాల్. డాక్టరు లల్లాచారికి స్వయాన బావగారు.

పేషెంటు కండిషనులో వేరియేషను కనిపిస్తోంది. తనకు మాట ఎక్కడొస్తుందోనని కంగారుపడుతున్నాడతడు.... హఠాత్తుగా లల్లాచారి ఎక్కడికెళ్ళాడో తెలియక తికమకపడసాగాడు.

బయట వాతావరణం బీభత్సంగా వుంది. ఉరుములు, మెరుపుల నేపథ్యంలో ఎవరివో ఏడుపులు వినిపిస్తున్నాయి. ఆ హాస్పిటల్లో ఎవరో పోయి వుంటారు; బంధువులు ఏడుస్తున్నారు. ఆ గది కిటికీ తలుపులన్నీ మూసాడు జేమ్స్.

నారాయణాచార్యులుగారి బెడ్ పక్కనే సుందరమ్మ కూర్చుని వుంది.

అప్పటివరకూ వెగిలి వెగిలి ఏడ్చిన ఆమె నిశ్చలంగా- భావ రహితంగా- మౌనంగా మిగిలిపోయింది. జుత్తు చెదిరిపోయివుంది, బట్టలు నలిగి వున్నాయి. కళ్ళు ఎర్రగా వున్నాయి– మొహం పీక్కుపోయి వుంది.

స్టీల్ ఫ్రేములోని ఫోటోలా నిశ్చలంగావుంది. కళ్ళు తెరచి వున్నా కోమాలో వున్నట్టుంది. ఈ కొద్ది వ్యవధిలోనే అస్థిపంజరంలా మారింది.

తుపాను కావడంతో సిస్టర్స్, వార్డ్‌బోయ్స్, అంతా యెక్కడెక్కడో సర్దుకున్నారు.

సరిగ్గా అప్పుడే కరెంటుపోయింది.

ఎవరో అగ్గిపుల్ల వెలిగించారు.

స్టాఫ్ ఎమర్జెన్సీ లైట్లు 'ఆన్' చేశారు.

అంత పెద్ద హాస్పిటల్‌లో అయిదే అయిదు ఎమర్జెన్సీ లైట్లు.... గదిలోని క్యాండిల్స్ వెలిగించాడు.

అంతటి చలిలోనూ జేమ్స్ నుదుటిపై చిరుచెమట్లు చోటుచేసుకున్నాయి. ఎమర్జెన్సీ వార్డునుంచి బయటకు రాబోతూ వెనక్కితిరిగి చూశాడు. మృత్యువు పొంచివున్నా ఆ మొహంలో ఏదో జీవకళ ఆ చిరు చీకట్లోనూ కనిపిస్తోంది.

బయటకు వచ్చిన జేమ్స్‌ని ఈదురుగాలి చుట్టేసింది.

డ్యూటీ డాక్టర్స్ వుండేగది అక్కడికి వంద మీటర్ల దూరాన వుంది.

ఒక్క దౌడు తీసాడు.

సరిగ్గా అప్పుడే ఓ అంబాసిడర్ కారొకటి వచ్చి హాస్పిటల్ ముందాగింది.

ఏదో ఎమర్జెన్సీ కేసొచ్చింది.

జేమ్స్‌కి పనిపడింది.





ఆరిపోయేముందు దీపం దేదీప్యంగా వెలుగుతుంది; ఆఖరి క్షణాల్లో మనిషికి జ్ఞానం వస్తుంది.

—ఇదే నిజమైతే ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారు ఆఖరి నిమిషాలలో ఉన్నారనే చెప్పాలి.

ట్రాన్స్‌లో ఉన్నట్టు భర్త ఉనికినే మర్చిపోయి కూర్చుని వున్న సుందరమ్మగారు ఎవరో తట్టి లేపినట్టు వులిక్కిపడి చూసింది. అపస్మారకంగా పడివున్న నారాయణాచార్యులవారు కళ్ళు తెరవలేదుకాని పెదవులు నెమ్మదిగా, అస్పష్టంగా కదులుతున్నాయి.

చుట్టూ చూసింది. డాక్టరు జేమ్స్‌కాని, తన సోదరుడు దాక్టరు లల్లాచారికాని కనిపించలేదు. నిద్రలేమి- అభోజనం అంతకుమించి నిస్సహాయత.

నవనాడులూ కృశించినట్టయింది. మొహం తెల్లగా పాలిపోయింది.

బయటకు చూసింది.

వాతావరణం ఆమెను భయపెట్టలేదు. కానీ భర్తను విడిచి వెళ్ళాలనిపించక వెనుదిరిగింది.

నారాయణాచార్యులవారి కళ్ళు మూతబడివున్నా రెప్పల వెనుక కదలికలను పసిగట్టింది.

ఒక్క ఉదుటున ఆయన పక్కకు చేరింది.

అతికష్టంమీద గొంతు పెగుల్చుకున్నారాయన.

"గా....య....త్రీ.... గాయత్రి" ఇంకా ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నారుగాని సాధ్యం కావడంలేదు.

శాసించే వేదంలా-

బోధించే పురాణంలా-

రంజించే కావ్యంలా—

అంపశయ్యపైనున్న భీష్మునిలా నారాయణాచార్యులు!

సుందరమ్మగారి గుండె కెలికినట్టయింది.

వాస్తవానికి నారాయణాచార్యులవారు తన కుమార్తె గాయత్రిని అడిగారు....

కానీ సుందరమ్మకి అమ్మవారు- గాయత్రి అమ్మవారు స్మృతిపథంలో మెదిలారు!

వంశపారంపర్యంగా వస్తున్న ఆ దేవతార్చన ఈ రోజుకి ఫలించింది.

తన కూతురికి 'గాయత్రి' అని ఏ ఉద్దేశంతో ఆ పేరు పెట్టాడో గాని ఈ రోజుకి అక్కరకు వచ్చింది.

'గాయత్రి' జపం చేయమని భర్త ఆదేశిస్తున్నాడనుకొంది సుందరమ్మ.

ఆ క్షణాన— ఆ తుఫాను రాత్రి భర్తను ఒంటరిగా విడిచి వెళుతున్నానని అనుకోలేదామె. గాయత్రి మాతకు అప్పగించి వెళుతున్నానని బయల్దేరింది- ఆ చీకట్నీ, ఆ ఉరుములు మెరుపుల్నీ ఖాతరు చేయకుండా!

* * * *

గరళకంఠుడ్ని ఆవాహనం చేసిన అతని శరీరం మండే కొలిమి నుంచి అప్పుడే బయటకు తీసిన లోహ ప్రతిమలా ప్రచండమైన ఎర్రని కాంతితో వెలిగిపోతోంది. కళ్ళలో ఎర్రని జీర! శరీరమంతా విభూది రేఖలు; చేతిలో దక్షిణావర్త శంఖం.



ఆ బుడబుక్కలవాడు సామాన్యుడు కాడు- భూతభావన, సిద్ధిసేవిత, కాలశమన, ధూమ్రాలోచన, యోగినీ సిద్ధి, కపాలసిద్ధి పొందినవాడు. అతడు అందించే మహా ప్రసాదాన్ని భూతనాథుడే స్వయంగా స్వీకరిస్తాడని ప్రతీతి!

గరుడప్రయోగం చేసిన వాడతడు

బడబానలం జీర్ణం చేసుకున్న వాడతడు;

భద్రకాళిని ప్రసన్నం చేసుకున్న వాడతడు.

అటువంటి మహాశక్తి సంపన్నుడు ఓ అఘోర ఆట కట్టించడానికి సంసిద్ధుడవుతున్నాడు.

ఓ వైపు గాయత్రీ జపంతో సుందరమ్మ;

మరోవైపు బుడబుక్కలవాడు!



ఆకాశం గుండె పగిలినట్లు హోరుమంటూ వర్షం. ఉరుములు మెరుపులతో పెళపెళార్భాటాలు.

పెనుగాలికి నేలకూలుతున్న చెట్లు, చేమలు-

అర్ధరాత్రి-ఝంఝూమారుతం!

వాగ్రాంబర పైశాచిక కేళి!

ఆ చీకట్లో నక్కల ఊళలు- ఆ భయానక వాతావరణంలో మృత్యువు ఆకలితో చేస్తున్న పెనుకేకల్లా వున్నాయి.

ఎందరి ఆక్రందనలో గుండెలో దాచుకున్న ఆ రుద్ర భూమి దిక్కుమాలిన శవంలా వుంది.

ఆ నీరవ వాతావరణంలో ఖాదర్ వెంట బుడబుక్కలవాని వెనుక వెళుతున్న వంశీ గుండె చప్పుడు అతనికే వినిపిస్తోంది.

ఆయాసంతో రొప్పుతున్న వంశీ హఠాత్తుగా ఉలిక్కిపడ్డాడు-

తను వెళుతున్న దోవ పైకి వంగివున్న చెట్టుమీదున్న ఓ లంగరు వికృతంగా అరిచేసరికి!

క్షణంపాటు రక్తం స్తంభించినట్టయిన వంశీ టక్కున ఆగాడు.

చిత్రమైన ధ్వనులు భీతిని గొలుపుతున్నాయి.

అదురుతున్న గుండెతో చుట్టూ కలియజూశాడు

ఆ క్షణమే నిర్ణయించుకున్నాడు- నిబ్బరంగల వాడి మనసునయినా రంపపుకోతతో నలిపే ఆ దుర్భర క్షణాలను మనసులోకి రానివ్వగూడదని! ఆవేశం- గుండె నిబ్బరం మాత్రమే కాదు ఆలోచనతో ప్రతి క్షణాన్నీ ఆయుధంగా వాడుకోవాలని!

చెవులు రిక్కించి, దృష్టిని నిశితంగా సారిస్తూ గుబురుగా పెరిగిన చెట్ల మధ్యకు చూశాడు- ఏ క్షణాన ఎటువంటి పరిణామాన్నయినా ఎదుర్కోడానికి సిద్ధపడి!



వేగం, ఒడుపు ఏకాగ్రతలే ఆయుధాలయ్యాయి అప్పుడు చూశాడు- ముందు నడుస్తున్న బుడబుక్కలవానివైపు.

బద్దలవబోతూ ఆఖరి క్షణంలో చల్లారిన అగ్నిపర్వతంలా వున్నాడతడు.

ఆ బుడబుక్కలవాని కళ్ళలోకి చూసే అవకాశం లభించలేదు.

ఆ క్షణంలో ఆ బుడబుక్కలవాని తీక్షణమైన చూపులకి ఎవరయినా భయపడవలసిందే!

ఆ బుడబుక్కలవాని చూపులు మౌనంగా ప్రశ్నించగలవు; మౌనంగానే కోపాన్ని, అవతలివాడి ఆలోచనల్ని పసిగట్టగలవు.

అతడు తన జీవితకాలంలో ఎప్పుడూ పడనంత ఆందోళన పడుతున్నాడు.



తాను కాలంతో పోటీ పడుతున్నానని అతడికి తెలుసు. చీకట్లో కదిలిపోతున్న శివుడిలావున్న ఆ బుడబుక్కలవాణ్ని హఠాత్తుగా చూస్తే గుండె ఆగిపోవడం ఖాయం!

* * * *

ఏ విషయం చెప్పినా శ్రద్ధగా వినడం- వింటుండగానే అది సమస్య అయితే దానికి పరిష్కారం- పథకం అయితే ఎలా వేయాలనేది- ఇబ్బంది అయితే ఎలా అధిగమించాలనేది క్షణాలలో ఆలోచించగల స్థాయి కాలుడిది.

సమయం గడుస్తున్నకొద్దీ 'జ్ఞాననిధి'లో ఆతృత పెరుగుతోంది. పెదవులు మరింతగా కదుల్తూ మంత్రాలు చదువుతున్నాయి.

ఈ పూజలో ఏ మాత్రం తేడా వచ్చినా తన తల వేయి వక్కలవుతుందని అతడికి తెలుసు.

ఆ స్మశానంలో జరుగబోయే దారుణం తలుచుకొని ప్రకృతి కూడా ఉరుములు, మెరుపుల రూపంలో వణికిపోతున్నట్లుంది వర్ష రూపంలో భోరున ఏడుస్తున్నట్లుంది

'సుకుమార్' ఒకప్పుడు సన్నగా, నాజూగ్గా అందమైన ఆడపిల్లలా కనిపించేవాడు. ఆ కళ్ళలో మెరుపు.... శరీరపు అంచులలో దృఢత్వం- కదులుతున్న కళ్ళలో వేటగాడి వాడి.... ఉత్తేజపూరితమైన కదలిక.... సన్నగా అనిపిస్తూనే ఆరోగ్యంగా, బలిష్టంగా అనిపించే చేతులు.... అది ఇది అని చెప్పలేని ప్రత్యేక ఆకర్షణ

జ్ఞాననిధిగా మారిన తర్వాత ఏవి ఆ చూపులు? కాంతులీనే ఆ కళ్ళు రాత్రంతా తాగినట్టు చింతనిప్పుల్లా వున్నాయి. పూర్వం దుస్తులు ఇస్త్రీ మడత నలిగేవికాదు. ఇప్పుడు దాదాపుగా దిగంబరంగా వున్నాడు. అస్థిపంజరానికి చర్మం తొడిగినట్టున్నాడు; రొమ్ముమీద దట్టంగా కాల్చిన శవం బూడిద పూసుకున్నాడు; మెడలో పూసలదండలు- చూడటానికి దెయ్యంలా వున్నాడు.

అతడు చూస్తున్నది గాయత్రి కోసం.

* * * *

వీణమీద వేదాలు పలికిస్తున్నట్టుగా మధురమైన స్వరంతో తనను పిలుస్తున్న అతడు పుచ్చపువ్వులా పగలబడిపోతున్న అద్భుత సౌందర్యరాశిలా వున్నాడు. వెన్నెలకన్నా తెల్లగా, మంచుకన్నా చల్లగా, తేనెకన్నా తియగా ఈ సకల సృష్టికి అర్థాలను వివరించే అద్భుత గ్రంథంలా వున్నాడు.

గాయత్రికి కళ్ళముందు మెరుపులు మెరిసినట్లు, ఉల్కలు రాలి పడినట్లు అనిపించింది- రెప్ప వేయడమే మర్చిపోయి చూడసాగింది.

అదే రూపం- అదే చెరగని మధుర హాసం!

ఆ రూపాన్ని చూస్తూవుంటే వెన్నున చరిచినట్లుంది; శరీరమంతా ఉద్వేగాన్ని పొందినట్టు అయింది.

ఏదో ట్రాన్స్‌లో వున్నట్టు నడుస్తోంది.

అతడు-భైరవుడు.

* * * *

గాయత్ర్యైనమః

శ్లో. ఓం భూర్భువ స్సువంః తత్సవితుర్వేణ్యం!
భర్గోదేవస్య ధీమయి ధియో యోనః ప్రచోదయాత్ !!

—ఇది గాయత్రీ మంత్రం.

ఇది రాజర్షి అయి, ఆ తరువాత జ్ఞాన సాధనతో రాజసాన్ని విడిచి బ్రహ్మర్షి అయిన విశ్వామిత్ర మహర్షి రూపొందించిన మంత్రం. గాయత్రీదేవి అధిష్ఠాన దేవత అయిన ఈ మంత్రం గాయత్రీ మంత్రంగా ప్రసిద్ధి కెక్కింది.



సాత్త్విక రూపమైన ఈ గాయత్రీ మంత్రం సాత్త్వికతత్త్వం గలిగినది. కోప తాప పరివర్జితులు తప్ప అన్యులు ఈ మంత్రాన్ని ఉపాసించినా ఫలితం శూన్యమనే చెప్పాలి.

మంత్రాలలో ఉత్తమోత్తమ మంత్రంగా ఈ గాయత్రీ మంత్రం పేర్కొనబడింది.

ఈ మంత్ర సాధన వల్ల ఇహపర సుఖాలు రెండూ సిద్ధిస్తాయి. ఎటువంటి దుష్ట శక్తి అయినా ఈ మంత్రం ముందు నిరుపయోగమయిపోతుంది.

పంచముఖ దేవత అయిన గాయత్రీమాత పాంచ భౌతిక శక్తులన్నిటిపై అధిపత్యం కల్గి సృష్టి స్థితి లయ స్వరూపిణిగా వర్థిల్లుతూ జ్ఞాన స్వరూపిణిగా వుంటుంది.

ఈ గాయత్రీ జపం వల్ల తేజస్సు, బలం, ఆయుష్షు, ఆరోగ్యం, ఐశ్వర్యం సర్వం సిద్ధిస్తాయి. సర్వ దేవతా శక్తులను ఆపాదిస్తూ విశ్వామిత్రుడు తన జ్ఞాన, యోగ శక్తులతో రూపొందించిన రూపమే గాయత్రీ రూపం.



ఈ రూపాన్ని త్రిసంధ్యల పఠించాలి. ఈ దేవతకు ప్రత్యేక నైవేద్యాలు ఏమీ లేవు. కేవలం జపంతో విడిచే నీరే. సంధ్యాయైనమః గాయత్ర్యైనమః సావిత్ర్యైనమః సరస్వత్యైనమః అంటూ ఆమె ముఖాలను వేరువేరు రూపాలుగా స్తుతించడం జరుగుతుంది. ఈ గాయత్రీ మంత్రాన్ని జపిస్తే గ్రహదోషాలు, విషదోషాలు, మృత్యుదోషాలయిన రోగాలుండవు. గాయత్రీ సర్వశక్తి స్వరూపిణి.

అందుకు విశ్వరూపం ధరించిన కృష్ణుడు సర్వశక్తులతో విలసిల్లుతూ అర్జునుడికి గీతోపదేశం చేస్తూ మంత్రాలలో ఉత్కృష్టమైన గాయత్రీ మంత్రం తానేనని- అందే తననే ఉపాసించే మంత్రంగా పేర్కొన్నాడు.

దాని అర్థం కృష్ణుడని కాదు. అన్ని దేవతా శక్తులతో సృష్టి స్థితి లయ కారకమయిన ఏకైక స్వరూపంగా వర్థిల్లే దేవతా రూపమే గాయత్రి అని అర్థం. సర్వే జనా స్సుఖినోభవంతు అని అందరి క్షేమాన్ని కోరే వారు ఈ మంత్రాన్ని ఉపాసించటానికి అర్హులు.

కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలకు అతీతులుగా, జ్ఞాన సముపార్జనే ధ్యేయంగా, లోక కళ్యాణమే ఆశయంలు జీవించే వారే ఈ మంత్రాన్ని ఉపాసించి సిద్ధి పొందగలరు తక్కి వారెవరయినా అరిషడ్వర్గాలకు అతీతంగా వుండాలని భావించినప్పుడు ఈ మంత్ర సాధన వలన జ్ఞానాన్ని పొందగలరు.

ఈ మంత్రం ఫలించిన వారు సర్వోత్కృష్టులు కావడమే కాక దైవత్వాన్ని పొంది సర్వశక్తులతో, జ్ఞానంతో విలసిల్లగలరని- విజ్ఞుల ఉవాచ!

అటువంటి పరమ పవిత్రమయిన గాయత్రీ మంత్రాన్ని పఠిస్తోంది నారాయణాచార్యులు సతీమణి సుందరమ్మ.

* * * *

సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః

ఏకేఏవ పరోమంత్రో 'గురు' రిత్యక్షర ద్వయః!

అజ్ఞానమును పారద్రోలి సుజ్ఞానమును వెలుగులోకి జీవితాన్ని నడుపగల శక్తి లోకంలో ఒక గురువుకే వుంది. అందుకనే స్కాంద పురాణములో గురు గీత యిలా అంటోంది. గురువుతో సమానమయిన వారెవరు లేరు. తండ్రి, దైవము, బంధువర్గము, ప్రభువులకంటె కూడా ఉన్నతుడు గురువు. అందువలననే 'సప్తకోటి మహా మంత్రాలున్నా' అవి మనోవైకల్యాలను కలిగించవచ్చు.

అన్నిటిని మించిన మంత్ర మొక్కటే అదియే "గురుః" అనే రెండక్షరాల మంత్రము. దీనిని చిత్తశుద్ధితో నిత్యము మనము చేసినచో



మానసిక చైతన్యము కలిగి ఆనందము విరియును. గురువు మాటపై మనసును లగ్నపరిచిన శిష్యున కపజయము లేదు.

లోకమే ఒక పాఠశాల. ప్రతి వ్యక్తి ఒక విద్యార్థియే. సామాజికంగా, రాజకీయంగా, న్యాయం, నీతి, నియమాలను నేర్పగల గురువులే నిజమైన 'బోధ' గురువులు.

మిగిలినవారు—

చదునయిన నేల మీద జంబుఖానా పరిచి ఒంటి మీదున్న వస్త్రాన్ని వుంచాడు. తర్వాత కౌపీనం ధరించాడు తన గురువుని ముందుగా స్మరించాడు.

ఆ తర్వాత రేవులోకి దిగాడు. అయిదు పడగలున్న నాగులా బుసలు కొడుతున్న నదిలో పాదం మోపాడు. ఆ నది అడుగు భాగాన ఆసీనులై తపసు చేసుకుంటున్న ఋషి పుంగవులకు నమస్కరించాడు. ఆ తర్వాత స్నానించాడు.

స్నానం సర్వాంగ శుద్ధిః మలిన శుచికరం దేహకాంతిం కరోతి!

నానారోగోప శాంతిః హితకరణ కరం చిత్తశుద్ధిం కరోతి!

స్నానం వలన శుద్ధియే కాక దేహమునకు కాంతి ధాతువృద్ధి కల్గుతుంది.

శర్మ, పైత్యము, దాహము తగ్గుతాయి.

శిరస్సు, చెవులు, పాదములు వీటికి తైలము మర్థించి నిత్యమూ అభ్యంగన స్నానము చేయవచ్చు.

ఇది సర్వాంగాలకు పుష్టి నిస్తుంది.

ఆధ్యాత్మిక కోణంలో స్నానం ధ్యానాన్ని పెంచుతుంది. తేజాన్ని నింపుతుంది. సూర్యోదయానికి ముందుచేసే చన్నీటి స్నానము ఆరోగ్య ప్రదం.

శుభకార్యాలలో మంగళ స్నానాలు, కర్మవిమోచనలో తిలామలక (ఉసిరికపప్పు) స్నానాలు దోషరహితుణ్ని చేస్తాయి.

భోజనం చేసిన వెంటనే, అర్ధరాత్రులయందును స్నానం చేయరాదని శాస్త్రకారుల వచనం.

* * * *

దీపం జ్యోతి పరంబ్రహ్మ!

దీపం సర్వసమోపగః!

దీపేన సాధ్యతే సర్వం!

సంధ్యా దీపం! నమోస్తుతే!!

శరీరము జ్యోతి స్వరూపము.

"నీవార శూకవత్ తన్వీ...."

నెవరి ధ్యానపు మొలకలవలె, పచ్చని కాంతితో హృదయమున నున్నదియే ఆత్మజ్యోతి. అదియె బ్రహ్మ, శివ, హరి, అక్షర రూపము. లోకమునకు వెలుగును ప్రసాదించునదీ జ్యోతియే. అన్నిటి పైనను సమానముగా తన తేజస్సును వ్యాపింపజేయు ఈ దీపము వలననే సర్వ కార్యములు సుగమములగుచున్నవి. అట్టి సంధ్యా దీపమా! నీకు నమస్కారములు అని కవి వాక్కు.



జీవుడు (లేక) జీవాత్మ శరీరము కంటె భిన్నుడు. మానవుని స్థూల శరీరము పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము అను పంచభూతాలతో నిర్మించబడింది. చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు అనునవి జ్ఞానేంద్రియములు.

జీవుడు వీనికంటె భిన్నుడే.

శరీరములో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనే పంచ ప్రాణాలు వున్నాయి.



బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము అనే వానితో వున్న సూక్ష్మ శరీరమూ ఉన్నది. కాని జీవుడు మాత్రము వీని అన్నిటికన్నను భిన్నుడే. వీనికి చావు పుట్టుకలు లేవు. ఇతడు నిత్యుడు. ఎట్టి మార్పులకును లోనుగాడు.

'అచలోయం సనాతనః'

"భూతిర్ భూతకరి సర్వార్థ సంపత్కరి

భూతప్రేత రాక్షస గణారిస్టారి...."

అంటూ మంత్రం పఠిస్తూ భస్మధారణ చేశాడు.

(గురు ముఖతా పై మంత్రాన్ని సంపూర్ణంగా స్వీకరించి భస్మధారణ చేసినవారిని ఏ దుష్టశక్తి ఏమీ చేయదని ప్రతీతి)

అనంతరం మెడలో వ్రేలాడుతున్న వెండి భరిణిలోంచి శివలింగాన్ని తీశాడు. నదినుంచి తెచ్చిన నీటితో అభిషేకించాడు. శివలింగాన్ని నేలపై వుంచకుండా వెంట తెచ్చిన తైలం, వత్తితో దీపారాధన చేసాడు.

మనిషిని పడదోసే ప్రచండ వేగంతో గాలి వీస్తున్నా, ఆకాశం నుంచి నేలకు నీరు ధారకడుతున్నా ఆ దీపం నిశ్చలంగా వెలగడం ఖాదర్‌ని, వంశీని ఆశ్చర్యపరిచింది.

కుడిచేతిలోశివలింగాన్ని ధరించి జపం చేసుకుంటున్నాడా బుడబుక్కల వాడు. అప్పుడు చూడాలి ఆయనవేపు....

చాలా ప్రశాంతంగా వున్నాడు.

ఆయన విగ్రహం తేజోవంతమయింది.

అయితే అంతర్గతంగా ఓ లావా, ఓ విద్యుత్తు, ఓ చైతన్యం ఆయనలో ప్రవహిస్తోంది. మూసిన రెప్పల వెనుకనుంచి ఆయన చూపులు మనసు పొరలను దాటి అంతరాత్మను పలకరిస్తున్నట్టున్నాయి.

ఆ బుడబుక్కలవాడు శివుడిలా వున్నాడు.

ఆ శివుడు కళ్ళు తెరిస్తే?

ఆ బుడబుక్కలవాని ముఖంలోకి ఆందోళనగా, అసహనంగా చూస్తున్నాడు వంశీ

దేవతలు, చిత్రపటాలు, విగ్రహాలు, మంత్రాలు, పూజా సంసారాలు వేరు. భూతప్రేత తదితర విద్య అభ్యాసాలు వేరు—స్మశానాలు, శవాలు, ఎముకలు, బొమికలు, బలి, వీటన్నిటితో కూడుకున్నది. కొన్ని సందర్భాలలో మార్చుకోరే అవకాశం కూడా వుంటుంది. బుద్ధిలో వకత ఏర్పడుతుంది. ఎప్పుడూ ఎవరి మీదనో ప్రయోగించి వారిని బాధపెట్టడానికి పనికొస్తుంది. ఆత్మరక్షణకు సహకారం కోసం అభ్యసించడం ప్రారంభించి అహం పెంచుకొని సర్వం నాశనం అయినవారు యెందరో వున్నారు.



బాణామతి; ఊడావంటి విద్యలు కర్ణాటకలో, పూర్వపు తెలంగాణ జిల్లాలో వున్నాయి. బాణామతి నేర్చుకొనే మంత్రోపాసకులు క్షుద్ర శక్తులవలనే స్మశానంలో ఉపాసనం చేస్తారు. గురువు దిగంబరుడై వుంటాడు. శుచిగా స్నానంచేసి వచ్చి స్మశానంలో ఒకచోట మండపం ఆకారంలో ఒక గీత గీయడం, ముగ్గు, పసుపు, కుంకుమ ఆ మండపం చుట్టూ అష్ట భుజముల ఆకారం రెండు కోణాలు కలిపి గదులు గదులుగా విభజించడం. దిశలు కలుపుతూ గీతలు గీచి ఆ మధ్య చక్రాలుగా గీస్తారు కొందరు బొగ్గు వాడతారు. అప్పుడే తెచ్చిన శవంమీద పువ్వులు వాడడం శ్రేష్టంగా భావిస్తారు.

చెమ్మబొమ్మగానీ, మట్టిబొమ్మగానీ చేసి ప్రయోగం చేయదలచుకున్న వ్యక్తి పోలికలు, లేదా అతడు ధరించిన ఏ చిన్నదయిన ముగ్గుల మధ్య పెట్టి మంత్రోచ్చారణ చేసి, సూది తీసుకుని, నువ్వుగింజ, బిల్వ ఆకు, సూదికి గుచ్చి దాంతో బొమ్మమీద గుచ్చడం, గుచ్చినప్పుడు



ప్రయోగించిన వ్యక్తులకు బాధ కలగడం కల్గుతుందని క్షుద్రోపాసనా తంత్రం తెలియజేస్తున్నది.

అయితే ఈ విద్యలు అభ్యసించినవారు వినాశనానికి కారణభూతులౌతారు. ఇటువంటి క్షుద్రోపాసనా విద్యలనుంచి రక్షించుకోటానికే ఇంటిలో తులసిచెట్టు, బయట వాకిలి చిమ్మి ముగ్గులేయడం, ఇంటిలో భగవతీ నామసంకీర్తనా కేసెట్లు కనీసం పెట్టడంవల్ల ఆ క్షుద్రశక్తులు గడపధాటి లోనికి ప్రవేశింపవని ఉపాసనాతత్పరులు తెలియజేస్తూ వుంటారు.

దేవీ ఉపాసన ముందు క్షుద్రోపాసనా బలం ఏమాత్రం పనిచేయదని శాస్త్ర వచనం.

మంత్ర తంత్రములతో బంధించి అతీంద్రియ శక్తులు సంపాదించాలని ఆలోచించడం కన్నా అంతరాత్మను అదుపులో పెట్టుకోగలిగిన వ్యక్తి-వ్యక్తిగత విలాసము, బలము, ఆరోగ్యము మానసిక శక్తిని పెంపొందించుకోవడం అత్యంత ఉత్తమోత్తమమని అనుభవజ్ఞుల ఉవాచ.

అయితే అనుభవజ్ఞుడైన గురుముఖతః మేలుచేసి మంత్రాల్ని ఉపాసించడంద్వారా మానవుడు మహనీయుడు కాగలడు. శక్తిసంపన్నుడు కాగలడు.

మంత్రశక్తి చిత్రమయింది. ఉచ్చరించే వారికి అర్థం కాకపోయినా అది అంతరాత్మలో పనిచేసి కార్యసాధనకు అవకాశమిస్తుంది.

అన్ని భాషలకు మూలమైన సంస్కృతములో మంత్రాలున్నాయి ఏయే సందర్భాల్లో ఏయే మంత్రాలు ఉచ్చరించాలో స్పష్టంగా మన పూర్వులు వెల్లడించారు.

దయ్యాలు, భూతాలు, తరిమివేయటానికి, విషసర్పాలనుండి రక్షించటానికి, మనసు శక్తివంతం చేయటానికి, గర్భస్థవమునుండి

చనిపోయేవరకు ఎప్పుడు ఏ మంత్రం ఉచ్చరించాలో స్పష్టంగా తెలిపారు.

సాధన, త్రికరణశుద్ధి ఓపికలతో మంత్రాలను జపిస్తే తప్పకుండా శక్తి వస్తుంది. ఒక్కొక్క మంత్రానికి ఒక్కొక్క అర్థం వుంది....

'రం' అంటే అగ్ని-

'హ్రీ' అంటే హృదయం-

'క్లీం' అంటే లైంగిక శక్తి-

అన్నింటికంటే మంచి మంత్రం 'ఓం'

అది శక్తినిస్తుంది.

ఇటీవల కాలంలో వైద్యశాస్త్ర నిపుణులు సయితం మంత్రశక్తిని పరీక్షించి రోగాలను నయం చేసినట్లు ఒప్పుకున్నారు కూడ. బొంబాయిలో ఇద్దరు మంత్రవేత్తలను పిలిపించి "ఫ్రీ" అనే వ్యవసాయ క్షేత్రాన్ని మంత్రశక్తితో సుక్షేత్రముగా మార్పుచేయడం గమనార్హం. మంత్ర జలముతో ఈ క్షేత్రములో పంటలు పండించారు. మామూలు పొలాల్లో 10వేల కిలోగ్రాముల టమోటాలు పండుతూ ఉండే మంత్ర జలముతో సాగుచేయబడిన పొలములో ముప్పైవేల కిలోగ్రాముల టమోటాలు పండినాయి. అందుకే ఖా ఫ్రీ కేంద్రములో మంత్రశాస్త్ర అధ్యయనానికి పదిహేనుమంది పట్టభద్రులను ఉచిత వేతనము, పారితోషిక వేతనాలతో ఏర్పాటుచేసారు మంత్రము కేవలం పద సముదాయం కాదు. మంత్రముయొక్క శక్తి ఉత్పాదనకు మూలము మంత్రాలతో చింతకాయలు రాలతాయా? అన్నారు. రాలక ఏం చేస్తాయి రాలతాయి. సరిగ్గా చేస్తే-మంత్రాలలో అంత్రాలనుచేసి ఆ అంత్రంలో మంత్రశక్తి కుదించి మనిషి ఉపయోగానికి ఇచ్చేవారు నేటికీ వున్నారు.

ఓం హ్రీం శ్రీం శంశంశం నమో

భగవతే మను సర్వకార్యాణి సాధయ



సాధయమాం రక్ష రక్షశ్రీఘ్రం మాం

ధనినం కురుకురు హుం ఫట్

శ్రియం దేహి.

ప్రజ్ఞాందేహి. మమాపత్తిం నివారయ నివారమి స్వాహా....

శివాలయంలో వుండే లింగముపైగానీ ఇంటిలో వుండే శివలింగముపైగానీ మట్టితో చేసిన లింగముపైగానీ ఏ శివలింగంపైనయినాసరే పై మంత్రము ఉచ్చరించి 7 మారేడు దళములు వేసి పూజించిన తరువాత ఈ మంత్రం 108సార్లు జపిస్తే ఏ ఆపదా ఆ భక్తుని దరి చేరదు.

పద్మాసనంలో గోచీగుడ్డ ధరించి నిశ్చలచిత్తుడై భృకుటి మధ్య చూపును నిలిపి ఏ కార్యార్థియై తాను తలపోస్తున్నాడో ఆ విషయాన్ని తలచుకొని ఔపోసనపట్టాడు. నిశ్చల స్థితిలో 'హ్రీం' మంత్రాన్ని ధ్యానించాడు—అకుంఠిత పరాక్రమసిద్ధికి, ధైర్యానికి- ఆ తర్వాత ప్రారంభించాడు మారేడు దళాలతో పూజ!

మారేడుదళాల పూజానంతరం మంత్రోచ్చారణ ప్రారంభించాడు. చేతిలోని రుద్రాక్షమాల ముందుకు కదుల్తోంది.

కదలి గర్భంలో రేగిన పెనుతుఫానులా నాభినుంచి ఆవిర్భవించాయి బీజాక్షరాలు.

పెదవుల కదలికకు అనుగుణంగా బుడబుక్కలవాని చేతిలోని రుద్రాక్షమాల రిథమేటిక్‌గా ముందుకు కదుల్తోంది.

—ఈ మంత్రాన్ని 1008 సార్లు జపిస్తే చాలు.

"ఓం వసుదారే స్వాహా"

నేలమీద గంధంతో అలికి దానిమీద కూర్చుని అర్థరాత్రివేళ పై

మంత్రం రోజుకు వెయ్యి ఎనిమిదిసార్లు 40 రోజులు జపించిన కోరిన కోర్కె సిద్ధించును. అధిక ధనలాభం కల్గును. ఆ తరువాత రోజుకు 108 సార్లు జపించుచూనే వుండాలి.

జ్ఞాననిధి అటకట్టు!

స్మశాన జాగరణ, అష్టాదార భైరవ, వ్యోమభైరవ, భూతనాధ భైరవ తంత్రాలన్నీ గురువుద్వారా సంపాదించిన జ్ఞాననిధి అధీనంలో నున్న కర్ణపిశాచి ఈ విషయాన్ని అతడికి చేరవేసింది.

విషయం వింటూనే జ్ఞాననిధి రక్తం సల సల కాగింది. భూత యోనులకంటే భయంకరమైన రాక్షస యోనులు, రాక్షస యోనులకన్నా భయంకరమైన బ్రహ్మరాక్షసి యోనులను సృష్టించాడు. తన కాలివేలితో చుట్టూ ఓ గిరగీసి, మధ్యలో నిలబడ్డాడు.

అప్పుడు శ్మశానం మేల్కొంది.



బాన శ్మశానం తంత్రంలో పవిత్రస్థలం- ఎంతో మనోహర ప్రదేశం.

'మహాకాళి' ఇక్కడే అలంకరించుకుంటుంది.

'తార' ఇక్కడే పుర్రెల మాల ధరించి నృత్యం చేస్తుంది.

'షోడశి' ఇక్కడే సంచరిస్తుంది.

అది జగజ్జనని 'భువనేశ్వరి' సిద్ధ పీఠం.

'భైరవి' యిక్కడే కాళిని ప్రసన్నం చేసుకుంటుంది.

—బుడబుక్కలవాని మంత్రోచ్చరణ సజావుగా సాగకూడదు. అతడు 1008సార్లు ఆ మంత్రాన్ని పూర్తిచేయరాదు. అదే జరిగితే తన లక్ష్యం నెరవేరదు.

జ్ఞాననిధి తనపనిలో నిమగ్నమయి వున్నాడు



"సమస్త విద్యలకు స్వానుభవమే ముఖ్యకారణం. ఎన్ని శాస్త్రములు, పురాణములు చదివినను, ఎన్ని విద్యలు అభ్యసించినను, అనుభవజ్ఞానము లేనిచో, ఏవియూ రాణించవు. స్వానుభవము గలవారలకే విద్యయైన నేర్చుకొనినను నేర్చుకొనక పోయినను విశేషముగా ప్రకాశించును—"

గిరి అవల అతని ప్రియశిష్యుడు- కాపాలికుడు- మెడలో సర్ప అస్థికల మాలతో నిల్చుని వున్నాడు.

సరిగ్గా అదే సమయంలో—

ఏ సిక్స్త్‌సెన్స్ ప్రేరేపించిందోకాని 0.375 మేగ్నమ్ ఎక్స్‌ప్రెస్ రైఫిల్ మేగజీన్‌లోనుంచి దూసుకొచ్చిన తూటాలా అక్కడ్నించి కదిలాడు వంశీ.

వాస్తవానికి ఆ బుడబుక్కలవాడు నోరుతెరిచి ఇదమిద్ధంగా 'ఇది' అని చెప్పలేదు.

అతడు చెప్పబోయేది వినడానికే ఖాదర్, వంశీ ఆత్రం!

కానీ, ఏ గుండెవాగుకు గండి పడిందో—

ఏ మనసుపొర చిట్లి మెదడు నరాలను మెలిపెట్టి నిక్షిప్తమయి వున్న నిప్పుసెగల్ని పైకి చిమ్మిందో-

లావాలా ఉబుకుతున్న ఆవేశం అతడ్ని అక్కడ నిలవనీయ లేదు.

మృత్యువు అలికతో పెడుతున్న పెనుకేకలా వినిపిస్తున్న ఆ భయానక వాతావరణంలో బయల్దేరాడు వంశీ—

* * * *

ఆవేశం, గుండెనిబ్బరం మాత్రమే కాదు, ఆలోచనతో ప్రతి

క్షణాన్నీ ఆయుధంగా మార్చుకునే వంశీ భూతాలనీడల్లా భీతిని గొలుపుతున్న ఎత్తయిన చెట్లమధ్యగా నడుస్తున్నాడు-స్మశాన స్తబ్దతనుమించిన నీరసం- రివ్వున వీస్తున్నగాలికి పొదలు పాముపడగల్లా తలలాడిస్తున్నాయి.

ఏటి ఒడ్డునుంచి వంశీ పట్నంవేపు వస్తున్న సమయంలో డాక్టరు లల్లాచారి ముందుకురుకుతున్న కుక్కలపిల్లలవెంట అనాలోచితంగా పరిగెత్తుకొస్తున్నాడు.

ఇంట్లో ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారి సతీమణి సుందరమ్మ తలారా స్నానంచేసి అమ్మవారిముందు కూర్చున్నది. దీపారాధన చేసి ఆచమనం తీసుకున్నది. ఆ సమయంలోనే జరగరాని రెండు సంఘటనలు జరిగిపోయాయి.

ఒకటి నాలుగు కుక్కపిల్లలవెంట వెళుతున్న డాక్టరు లల్లాచారి దూసరతీగలు తొక్కాడు. అంతే!! ఎవరో చుట్టిపడేసినట్టు దూసరతీగలు అతడ్ని చుట్టుకున్నాయి.

రెప్పపాటు కాలంపాటు వెనుదిరిగి చూసిన ఆ కుక్కపిల్లలు డాక్టరు లల్లాచారిని విడిచే ముందుకు ఉరికాయ్.

విషయం బోధపడలేదు డాక్టరు లల్లాచారికి.

చూడటానికి ఎంతో ఆహ్లాదకరంగా కనిపించే ఆ దూసరతీగలు మృత్యుగహ్వరమై ఎందరి అరణ్యరోదనలకో, మరెందరి కన్నీళ్ళకో ఆలవాలమైపోయింది.

పెనుభూతంలా చుట్టుకుపోతున్న ఆ దూసరతీగల్నుంచి తప్పించుకోలేక పొలికేకలు పెడుతున్నాడు ఆ మృత్యుకరాళ దంష్ట్రిమధ్య- అరికాలులో గుచ్చుకున్న తుమ్మముల్లు సలుపుతుంటే బాధను నిగ్రహించుకుంటూ

క్షణాలు గడుస్తున్నకొద్ది కాలం చెల్లిపోతుందన్న భావన ఒకగాలి కెరటం జాలిగా స్పృశించినట్టు గుండెల్నికోసి వెళ్ళిపోయింది.





అతడి కళ్ళు నీటికుండలయ్యాయి.

నిస్త్రాణగా ఒళ్ళు తూలిపోతోంది.

నీరసంతో ఎక్కడ తూలిపడతానో,కూలిపోతానోనని బాధతో రొప్పుతున్నాడు.

చుట్టుకున్న దూసరతీగలు రంపాల్లా చర్మాన్ని చీల్చేస్తున్నాయి.

క్షణక్షణానికి దూసరతీగల పట్టు బిగుస్తోంది.

ఎంతటి నిబ్బరంగలవాడి గుండెనయినా రంపపుకోతతో నలిపే దుర్భర క్షణాలవి.

నిలువెల్లా వ్యాపించిన భయం అతడి వూపిరితిత్తుల్ని నొక్కిపట్టింది.

సమయానికి ఎటువంటి సహాయమూ అందని నిర్మానుష్య నిశీధిలో మనిషి చాలా చాలా బలహీనుడన్న సత్యానికి నిదర్శనంలా డాక్టరు లల్లాచారిలోని ధైర్యం పిపీలిక ప్రమాణానికి దిగజారిపోయింది.

డాక్టరు లల్లాచారి పరిస్థితి ఇలావుంటే,

శ్మశానంలో-అగ్నిగుండం ముందు నిల్చునివున్న జ్ఞాననిధి పగలబడి నవ్వాడు. ఎగతాళిగా కాదు— వికృతంగా, బండరాళ్ళు దొర్లినట్టు, పులి ఎముకల్ని కొరికినట్టు.

కాపాలికుడు కట్టెలు వేయడంవల్ల యజ్ఞకుండంలో అగ్ని ప్రజ్వరిల్లింది

జ్ఞాననిధి శూన్యంలో చేతులు తిప్పి మానవ రుధిరపాత్ర సృష్టించాడు; కాపాలికునివేష చూసి సైగచేసాడు. కాపాలికుడు తాజా శవ భస్మం తెచ్చాడు. కొంత భస్మం తన ఆసనంక్రింద చల్లి, మిగిలిన భస్మం తన శరీరం అంతా పులుముకున్నాడు— 'కరాళ భైరవు'గా మారాడు.

అతని మనసులోని పైశాచికత్వం కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది.

'హాక్యమదారి' మంత్రంవలన శూన్యంలోంచి ఓ పాత్ర సృష్టించాడు. ఆ పాత్రలోని మాంసం నుంచి రక్తంబొట్లుగా పడుతోంది.

రక్త తర్పణంతో ఆ రుద్రభూమి నలువైపులా వింత ధ్వనులు ప్రారంభమయ్యాయి- భూత ప్రేత పిశాచాలు విచిత్ర వికృత ధ్వనులతో వింత ఆకృతులతో పుట్టుకొస్తున్నాయి.

ఊహింప శక్యంకాని దృశ్యమది.

ఎటు చూసినా భీతావహమైన వాతావరణం, ఒడలు జలదరింప జేసే పరిసరాలు.

అప్పుడు లేచిందొక దట్టమైన పొగ, యజ్ఞకుండంనుంచి. అది ప్రిన్సిపాల్ నారాయణాచార్యులుగారి ఇంటివేపు దౌడుతీసింది.

కేవలం రెండేరెండు నిమిషాలు వుంటే సుందరమ్మ అమ్మవారి స్తోత్ర పఠనం ప్రారంభించేదే!

ఈలోపే ఎవరో బాది మాడుమీద చరిచినట్లయింది. దమ్మున ముందుకు పడింది సుందరమ్మ అ పడటంకూడా అమ్మవారి పాదాల ముందు పడింది.

ఇక్కడ నారాయణాచార్యులుగారి భార్య సుందరమ్మగారి పరిస్థితి ఇలా వుంటే, సుందరమ్మగారి సోదరుడు డాక్టర్ లల్లాదారి పూర్తిగా దూసరతీగలతో కప్పబడ్డాడు. సుందరమ్మగారి కూతురు గాయత్రి నేరుగా జ్ఞాననిధిముందు నిలిచింది.

ఆమె సోగకళ్ళతో అస్పష్టమయిన బదలిక. మనసులో భాషతో వ్యక్తీకరించలేని మగత, చిలిపిగా విచ్చుకున్న పెదవులు!

* * * *

ఇనుప రజను నింపినట్టు కళ్ళు మండుతున్నాయి.



ఆయాసంతో రొప్పుతూ నిల్చున్న వంశీ హఠాత్‌గా ఉలిక్కిపడ్డాడు. కళ్ళు రిక్కించి చీకట్లోకి చూశాడు.

నిశ్శబ్ద స్మశానంలో భీకర మార్పు ప్రారంభమైంది.

ఆ మార్పు బుడబుక్కలవాని వలన జనించింది. పద్మాసనంలో గోచీగుడ్డ ధరించి మంత్రపఠనం చేస్తుంటే ప్రత్యర్థిపై ఆ ప్రభావం కనిపిస్తోంది.

ఒకవేపు గాయత్రి నిల్చునున్నది, భగపూజకు సిద్ధమై-

మరో వేపు బుడబుక్కలవాడు తమ మంత్రప్రయోగం చేస్తున్నాడు.

భగపూజ చేస్తే ఏ బుడబుక్కలవాడు, ఏ మంత్రమూ తనని దరిజేరలేదు.

భగపూజలో నిమగ్నమైవుంటే, భగపూజ పూర్తయ్యేలోపే ఆ బుడబుక్కలవాడు తనని మంత్రశక్తితో ఎదుర్కొనవచ్చు.

యంత్రానికి తంత్రానికి ప్రచ్ఛన్నయుద్ధం ప్రారంభమైంది.

భూత, ప్రేత, పిశాచాలు, రాక్షసులు త్రివర్గాత్మకమైనవి. ఇవి తమ ఆకారాన్ని చిన్నవిగా-పెద్దవిగా మార్చుకోగలవు. వీటికి పొడవు వెడల్పు, ఎత్తు ఉంటాయి. లోతవు వుండదు భూత ప్రేతాలు మానవులలో ప్రవేశించి తమ కోర్కెలు తీర్చుకుంటాయి. వీటికి నీతి అనేవి వుండదు. 'కూతురు-కోడలు' వ్యత్యాసం వుండదు. 'తమ-పర' తారతమ్యాలు లేవు.

మానవుడు ఇందుకు విరుద్ధం.

మానవుడు పంచభూతాత్మకుడు. మానవుని శరీరం నిప్పు-నీరు-నేల-గాలి-ఆకాశంతో తయారుచేయబడింది ఇందులో భూతత్వం ఎక్కువ. అందుకే నేలను అంటిపెట్టుకుని వుండేది.

రుద్రజపం పూర్తి చేసిన బుడబుక్కలవాడు రుద్రునికి భస్మాభిషేకం చేశాడు.

దానితో స్మశానంలో జ్ఞాననిధిని అంటిపెట్టుకుని వున్న భూత ప్రేతాలు–పిల్లినిచూసిన ఎలుకవలె- పులినిచూసిన జింకలవలె- తోడే ళ్ళను చూసిన మేకలవలె కకావికలై పోయాయి.

ఈ హఠాత్పరిణామంతో జ్ఞాననిధిని నీడలా వెన్నంటివున్న కాపాలికుడు చేష్టలుడిగి చూస్తుండిపోయారు. జడపదార్థంలా మిగిలి పోయారు కళ్ళు బైర్లుకమ్మాయి. శరీరం పట్టుతప్పి నేలమీద పడి పోయారు.

అప్పుడు ప్రయోగించాడు త్రిపురభైరవీమంత్రాన్ని-బుడబుక్కల వాడు.

భూత ప్రేత పిశాచ సంబంధించి కలిగే మానసిక బాధల్ని, పిచ్చిచేష్టల్ని దూరం చేయడానికి త్రిపురభైరవ మంత్రం ప్రయోగిస్తారు. పిల్లలకు ఈ యంత్రం బాగా ఉపయోగపడుతుంది

భూర్జపత్రంపై కర్పూరం- కస్తూరి- గోరోజనము కేసరి- శ్రీగంధం చూర్ణముతో వ్రాసి పూజిస్తారు. రాగి, వెండి తాపడు తయారు చేసి అందులో దీనిని నింపుతారు. 1400 సార్లు జపం చేయడంవలన ఈ యంత్రానికి శక్తి వస్తుంది.

"హ్రీం భూత ప్రేత పిశాచ వినాశిన్యై నమః"

అని మంత్రపఠనం చేస్తున్నాడా బుడబుక్కలవాడు.

విష్ణువు చేతిలోని సుదర్శన చక్రంలా,

ఆ పరమేశ్వరుని చేతిలోని త్రిశూలంలా ఆ మంత్రం జ్ఞాననిధి చుట్టూవున్న భూత ప్రేతాల పీచమణచి వేస్తోంది. ఆ మంత్ర ప్రభా వానికి తట్టుకోలేక భూతప్రేతాలన్నీ పారిపోతున్నాయి.

అది చూసిన జ్ఞాననిధి లావాలా ఉడికిపోయాడు. తాను గీసినగిరి చిన్నదై తన మీదకి ముంచుకు రావడంతో ఆవేశంతో ఊగిపోయాడు.

జ్ఞాననిధి భృకుటి భీకరంగా ముడిపడింది.

కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.



శరీరం కోపంతో వణికిపోతుంది.

మండే కొలిమినుండి అప్పుడే బయటకు తీసిన లోహ ప్రతిమలా ప్రచండమైన ఎర్రని కాంతితో వెలిగిపోతుంది అతని శరీరం.

వేయితలల నాగు బుసలు కొడుతున్నట్టు కాపాలికుని పెదవుల నుండి మంత్రాలు వెలువడుతున్నాయి.

"లం లం లం లంబదంతం ల ల ల ల లలితం దీర్ఘ జిహ్వాంక కారాళయ

భూంభూంధూం ధూమ్రవర్ణం

స్ఫుట వికృత ముఖం భాసురం భీమరూపమ్. రుం రుం రుం రుండమాలం రుధిరమయ ముఖం తామ్ర నేత్రం విశాలమ్.

వం వం వం నగ్నరూపం ప్రణమత సతతం భైరవం క్షేత్ర పాలవు"

మూర్తీభవించిన కోపాగ్నిలా వున్నాడు మంత్రోచ్ఛారణ చేస్తున్న జ్ఞాననిధి.

ఆ మంత్ర ప్రభావం బుడబుక్కలవానిపై కనబడింది.

ఆ బుడబుక్కలవాని ముఖకవళికలు క్రమక్రమంగా మారు తున్నాయి. శాంతి, సౌమ్యం, నశించి ఆ స్థానంలో క్రోధం చోటుచేసు కుంటోంది. కరుణ ప్రేమబదులు క్రౌర్యం కళ్ళలో తాండవిస్తోంది.

గుండెలు నిండా గాలి పీల్చుకుని జ్ఞాననిధి వ్యూహాన్ని ఛేదించ సాగాడు.

హ్రీం రాహువే నమః హ్రీం రవియే నమః హ్రీం శుక్రాయ నమః.

హ్రీం కుజాయనమః హ్రీం గురువే నమః హ్రీం శనైశ్చ నమః

హ్రీం బుధాయ నమః హ్రీం కేతవే నమః హ్రీం సోమాయ నమః.

నవగ్రహాలను రక్షా కవచంగా ప్రార్థించాడు బుడబుక్కలవాడు.
అంతే!!
ఆకాశంలో పెద్ద విస్ఫోటనం!

ఒక మహోపద్రవం రాబోతోంది. ఓ మారణహోమం జరగబోతోంది. రెండు సింహాలు ఢీ కొంటున్నాయి. మంత్రానికి తంత్రానికి పోరాటం మొదలయింది. మధ్యలో లేడిపిల్లలా గాయత్రి.

మర్డర్ జరిగినట్టు ఆకాశం కాన్వాసుమీద రక్తం మరకలు! చెట్ల శిఖరాలు రక్త తిలకాన్ని అద్దుకున్నట్టు రాక్షసంగా కనిపిస్తున్నాయి.

గుండెలోని రక్తం గొంతులోకి ఎగజిమ్మినట్టు ఒణికిపోయాడు కాలుడు అనబడు కాపాలికుడు.

ఆ భయంకరమైన కాళరాత్రదీ- ఒళ్ళంతా చెమటతో ఇంకా తడిసిపోతూనే వుందతనికి.

కర్మేంద్రియాలన్నీ చచ్చుబడిపోతున్నాయతనికి.

కళ్ళలో ఇనప రజను నింపినట్లు మండుతున్నాయి.

అదురుతున్న గుండెతో పరిసరాల్ని పరికించిన కాలుడు ఊపిరాడనట్లు వుండిపోయాడు కొద్దిక్షణాలు.

-గాయ త్రి దరిదాపులకి వచ్చేసింది.

భగపూజ పూర్తయితే ఇహ జ్ఞాననిధిని జయించే వారంటూ వుండరు.

రక్తం ఓడిన కళ్ళతో నిల్చునున్న అతడు నవ్వాడు. ఎగతాళిగా కాదు- వీహ్యంగా, బండరాళ్ళు దొర్లినట్టు, పులి ఎముకల్ని కొరికినట్టు.

శరీరమంతా విషపూరితమైనట్టు ఒంటిరంగు నల్లబడి నిలబడున్నాడు జ్ఞాననిధి.

నిబ్బరం గలవాడి గుండెనయినా రంపపుకోతతో నలిపే దుర్భర క్షణాలవి.





అంతకు క్రితం కొద్ది గంటలవరకూ ఎంతో ఆహ్లాదకరంగా దర్శనమిచ్చిన ఆ ప్రకృతి మృత్యు గహ్వరమైంది. ఆ రుద్రభూమి రహస్యాన్ని ఛేదించడానికి చాలామంది సాహసించలేకపోయారు. సాహసించినవారు సాధించలేకపోయారు

జ్ఞాననిధికి అర్థమవుతోంది- బుడబుక్కలవాడు తనని త్వరలో అష్ట దిగ్బంధం చేయబోతున్నాడని

అతడి పూజా కార్యక్రమం పూర్తయితే తాను సాధించగలిగిందేమీ లేదు

అంతే!? జ్ఞాననిధి ఓ నిర్ణయానికి రావడంతో శరీరమంతా విస్ఫులింగంగా మండడం ప్రారంభించింది.

జ్ఞాననిధికి అభిముఖంగా నున్న అగ్నిగుండం మండుతోంది. అందులోని జ్వాలలు నాలుకలు చాచి మింగేసేందుకే సిద్ధంగా వున్నాయి. నలువైపులా వాతావరణం భీకరంగా వుంది. జ్ఞాననిధి ఉచ్ఛ్వాస నిశ్వాసలు స్పష్టంగా వినబడుతున్నాయి. కోపంతో ఊగిపోతున్నాడు. పైపెచ్చు మద్యం తాగిన ఆవేశంతో వున్నాడు.

సరిగ్గా ఆ సమయానికి గాయత్రి వచ్చి జ్ఞాననిధి ముందు నిలబడింది- అప్సరస బేతాళుని పరమయినట్టు!

జ్ఞాననిధి గాయత్రి ముఖంలోకి చూశాడు- తదేకంగా!

పాము కాటేయబోయే ముందు అలాగే చూస్తుంది; పులి పంజా విసరబోయేముందూ అలాగే చేస్తుంది.

గాయత్రి శరీరంమీదున్న దుస్తులు ఒక్కొక్కటే మంచు దెబ్బ తిన్న గులాబీరేకుల్లా విడిపోతున్నాయి. ట్రాన్స్‌లో వున్నట్టు చెరగని చిరునవ్వుతో నిర్భీతిగా, నిర్లజ్జగా, నగ్నంగా నిలబడి వుంది గాయత్రి.

క్షేత్రపాలుణ్ని, భైరవుడ్ని పరస్పర సంహార క్రియలోకి దింపడం వలన 'కృత్య' ఆవిర్భవిస్తుంది. అందుకుగాను ఏక నిష్ఠతో

బీజమంత్రాలు వల్లిస్తూ ప్రతిసారీ స్వరక్తాన్ని సమర్పిస్తున్నాడు. మంత్రం మొదలు చివరలో మాంసంముక్కలు సమర్పించి కృత్యా ఆవిర్భావం కోసం మార్గం సుగమం చేస్తున్నాడు.

బుడబుక్కలవాని నుంచి ఆత్మ రక్షణార్థం కాక ఎదురుదెబ్బ తీసేందుకు 'ప్రత్యంగిరి'ని ప్రసన్నం చేసుకుంటున్నాడు జ్ఞాననిధి. ప్రత్యంగిరి ప్రత్యక్షమైతే శత్రువినాశనం తప్పదు.

జ్ఞాననిధి చేస్తున్నది వామాచార క్రియలు.

శత్రుసంహార క్రమం ప్రారంభమైంది.

యజ్ఞకుండం ముందు గాయత్రి నగ్నంగా నిల్చున్న క్షణాన బుడబుక్కలవాని శక్తి క్షీణించడం ప్రారంభమైంది.

డాక్టర్ లల్లాచారి దూసర తీగలకు బందీ అయ్యాడు.

సుందరమ్మ అమ్మవారి పాదాలచెంత స్పృహతప్పి పడి వుంది.

జ్ఞాననిధి అప్పుడే కాల్చిన శవభస్మం తెప్పించి గాయత్రి ముఖాన పులిమాడు. కుంకుమ పెట్టాడు. కత్తితో ఆమె చిటికెన వ్రేలు అతి దారుణంగా చీల్చాడు; దానినుండి వచ్చే రక్తం యజ్ఞకుండంలో సమర్పించాడు ఏకనిష్ఠతో బీజమంత్రాలు వల్లిస్తూ ప్రతిసారీ ఆమె రక్తాన్ని సమర్పించసాగాడు. మాంసం, మద్యం ఆహుతి ఇవ్వసాగాడు.

తదుపరి కార్యక్రమం- భగపూజ- అదీ వజ్రయాని సంప్రదాయం ప్రకారం!

వజ్రయాని సంప్రదాయం ప్రకారం స్త్రీ శరీరంమీద సారాయి పోసి సాధకులు ఆ సారాయిని సేవిస్తారు; స్త్రీ నగ్నదేహాన్ని పూజిస్తారు. స్త్రీ పురుషులు పెనవేసుకుని వున్నప్పుడు మంత్రాలు జపిస్తారు. రోజుల తరబడి మైదునం సాగిస్తారు. వీరికి వీర్య స్ఖలనం జరుగదు. మనిషితో ఎలా సంభోగిస్తారో పశువుతోనూ అదే విధంగా సంభోగిస్తారు.

-సంప్రదాయ కుటుంబంనుంచి వచ్చిన,
-నిత్యం పూజచేసే



కన్నెపిల్లతో భగపూజ చేయడంవలన 'శ్మశానకాళీ తంత్రం' సొంతమవుతుంది. భూత, ప్రేత, పిశాచ, రాక్షసులను వశం చేసుకోవచ్చు. 'ద్రవాణ తంత్ర' సాధనతో సమస్త శక్తులనూ పొందవచ్చు. 'ధీరవాణ తంత్ర' సహాయంతో ఏ వస్తువు కావాలన్నా పొందవచ్చు.

కామం శివ రూపమని వీరి నమ్మకం.

శివుడు మన్మథుడ్ని భస్మంచేసినా, ఆ భస్మం శివుని శరీరమంతటా సుగంధంలా వ్యాపించి సమ్మోహితుడ్ని చేసిందని వారి విశ్వాసం.

-జ్ఞాననిధి ఒక్కొక్క తంత్రక్రియతో లక్ష్య సాధనకు దగ్గరవుతున్నకొద్దీ బుడబుక్కలవాడు బలహీనుడవుతున్నాడు. ప్రకృతి ప్రళయ ప్రభంజన తాకిడికి దద్దరిల్లుతోంది.

ఖాదర్ ఎప్పుడో మూర్ఛిల్లాడు.

ఇహ మిగిలింది వంశీ.

గమ్యంలేనట్టు నడుస్తూనే వున్నాడు- మనసు ప్రేరేపించిన మార్గంలో.

గాయత్రి కోసం; ఆ కళ్ళు వర్షించే అయస్కాంత దృక్కుల కోసం బయలుదేరాడతడు. అతడియాత్ర అనంతయాత్ర. చీకటి వెలుగులతో పనిలేదు; క్రూరమృగాల క్రీనీడలు అతణ్ని భయపెట్టలేవు. చావో బ్రతుకో దేనికయినా సిద్ధమే అన్నట్టుగా దృఢమైన నిర్ణయం తీసుకున్నాడతడు.

ఏదో ఉద్వేగం నడిపిస్తోందతన్ని. ఫలానాది అని చెప్పుకోలేని అశాంతి!

సరిగ్గా అప్పుడే సుందరమ్మగారి తలవద్ద ఒక కాంతిపుంజం వెలువడింది.

అది గాయత్రి అమ్మవారి పాదాల తేజస్సు!

అమ్మవారి శిరస్సుచుట్టూ కాంతిమండలం!

ఆ కాంతిరేఖ రూపంలో అమ్మవారే తన భక్తురాలిని కాపాడుకోవడానికి బయలుదేరింది.

అసంపూర్తిగా మిగిలిన ఆటకు చరమగీతాలాపన ప్రారంభమయింది.

గుండెకీ, గొంతుకి మధ్య కండరాన్ని చిట్లించే యాతన అది.

గడ్డకట్టిన గుండెవాగుకి గండి పడినట్టు-

ఒక ఉన్మాదిలా ఏ శక్తో ఆవహించినట్టు-

దుముకుతున్నట్టు పరుగెడుతున్న వంశీ ఎంత వేగంగా పరుగెడుతున్నాడంటే లేడిపిల్లకూడా అంత వేగంగా పరుగెత్తలేదు.

అతడికి తెలియదు- నాలుగు కుక్కపిల్లలు తనకు దారిచూపుతున్నాయని, ఒక కాంతిపుంజం తనను నడిపిస్తోందని.

సుకుమార్-

వంశీ-

ఇద్దరు ప్రత్యర్థుల మధ్య భీకర సంగ్రామం మొదలయింది.

టెన్షన్, రక్తం నోటిలోకి ఎగజిమ్ముతున్నట్టు గొంతులో వగరు!

అతడి కదలిక మామూలు కదలిక కాదు; రౌద్ర కళాకృతహధికేతువు కదలిక అది!

* * * *

మేఘాల రాపిడిలో మెరుపుల తళతళలు.

గుండె అట్టడుగు పొరల్ని స్పృశిస్తూ విచిత్రమైన లాలసత్వాన్ని కలిగించే ఆ కళ్ళలోకి చూస్తున్నాడు 'జ్ఞాననిధి' అనబడు సుకుమార్.



అతడ్నే చూస్తున్న కనుపాప నీడల్లో హఠాత్తుగా అలజడి మొదలయింది.

భగపూజ ప్రారంభించాడు జ్ఞాననిధి- స్వహస్తాలతో వండుకున్న పాపాన్ని భుజించడానికి!

ఆమె సోగ కళ్ళలో వెలుగు క్షీణించి జీవంలేని గాజుగోళాల్లా పాలిపోయాయి.

ఏ చూపుల స్పర్శతో అతడి రక్తప్రసరణ స్తంభించిపోయిందో-

ఏ సోగకళ్ళ దృక్కులతో మంత్రముగ్ధుడిలా తనను తాను మరిచేవాడో-

ఆ కళ్ళలోని యాంత్రికతకు అతడి గుండె కెలికినట్టయింది.

ఇక్కడే ఘోర తప్పిదం జరిగిపోయింది.



తాంత్రికశక్తి విద్యుల్లత లాంటిది. ఎక్కడయినా ఒక పర్యాయం అవాంతర మేర్పడితే అంతే!!

సరిగ్గా అప్పుడే ఓ తీతువు అరుచుకుంటూ వెళ్ళింది భయానకంగా!

తంత్రసాధన జరుగుతున్నవైపు పశుపక్ష్యాదులే కాదు, గాలి అల కూడా ఆ వైపు తొంగిచూడదు.

తీతువు అరుపుతో జ్ఞాననిధి ఏకాగ్రత చెదిరింది. గుండె బెదిరింది.

-ఉపాసకునికి భయమనేది తెలియగూడదు.

నాలుగు కుక్కపిల్లలు అక్కడ ప్రత్యక్షం కావడంతో అతడి తంత్రశక్తులన్నీ అదృశ్యమయ్యాయి.

ఆ నేపథ్యంలో వంశీ గొంతు ఎంత కర్కశంగా వినిపించిందంటే కాపాలికుడు తన చేతిలోని వస్తువుల్ని నేలవిడిచాడు.

ఘనీభవించిన కసి, ఉక్రోషం వంశీని వివశుణ్ని చేశాయి; ఉద్రేకంగా గాలిలోకి డైవ్ చేశాడు.

అప్పటికే ఏ అదృశ్యశక్తో తన ఖడ్గంతో అతడి కుత్తుకను కత్తిరించినట్టు జ్ఞాననిధి తలవెళ్ళి యజ్ఞకుండంలో పడింది.

పెద్ద విస్ఫోటనం చెలరేగింది.

భూమి బ్రద్దలయింది. భూగృహంలో కొలువు తీరివున్న గురు పరంపర మేల్కొనక తప్పిందికాదు- ప్రాయశ్చిత్తం తప్పదు.

అప్పుడే ఓ మెరుపు మెరిసింది. మింటిని మట్టిని ఏకంచేస్తూ!

ఒక అంకం పూర్తయిందన్న సూచనగా నాలుగు కుక్కపిల్లలు అక్కణ్నించి నిష్క్రమించాయి.

"అతీంద్రియ శక్తులు మానవ కళ్యాణానికి ఉపకరించాలిగాని, వ్యక్తి ప్రయోజనాలకు, విలాసాలకు దుర్వినియోగంచేస్తే దుష్ఫలితాలు మిగులుతాయి"



.... సమాప్తం ...